# ఎవరు ఆదరిస్తే అక్కడే!

## –మెహ్రీన్‌కౌర్

**ఇప్పుడు ఏ భాషలో వారు ఆ భాషలోనే సినిమాలు చేయాలన్న రూలేం లేదు. ఉత్తరాది వారు దక్షిణాదినీ, దక్షిణాది వారు ఉత్తరాదినీ ఏకబిగిన ఏలేస్తున్నారు. అలా ఉత్తరాది నుంచి దక్షిణాదికి వచ్చిన హీరోయిన్ మెహ్రీన్ కౌర్. తొలి సినిమా 'కృష్ణగాడి వీరప్రేమ గాథ' తెలుగు వారి మనసులు దోచుకుంది. మధ్యలో కొంత గ్యాప్ తీసుకున్నా తిరిగి తెలుగులో బిజీ అయిన మెహ్రీన్‌తో...**

---

**తెలుగులో గ్యాప్ వచ్చినట్టుంది...**

'కృష్ణగాడి వీరప్రేమ గాథ' తరువాత కొద్దిగా గ్యాప్ వచ్చిన మాట వాస్తవమే. ఈ గ్యాప్‌లో ఖాళీగా ఏమీ లేను. బాలీవుడ్ సినిమా 'ఫిల్లౌరీ' చేశాను. అది పూర్తి చేసిన వెంటనే ఇక్కడకు వచ్చాను. వరుస పెట్టి సినిమాలు చేస్తున్నాను.

**సినిమాల్లో అవకాశం ఎలా వచ్చింది?**

నేను ఢిల్లీ అమ్మాయిని. విదేశాల్లో చదువు పూర్తి చేసుకుని ఇండియాకి తిరిగి వచ్చిన వెంటనే యాడ్స్‌లో చేయడానికి ముంబయి వచ్చాను. అక్కడ పలు యాడ్స్ చేశాను. అలా నా యాడ్స్ చూసి తెలుగులో నాకు అవకాశం ఇచ్చారు. బాలీవుడ్‌లో కూడా ఇదే విధంగా అవకాశం వచ్చింది. ఏ భాషవారు ఆదరించినా, ఆ భాషలో సినిమా చేయడానికి ఎలాంటి అభ్యంతరం లేదు. నటనకి భాష, ప్రాంతాలు అడ్డు కాదు కదా?

**'ఫిల్లౌరి' గురించి...**

ఈ సినిమాలో నాకు అవకాశం రావడం నాకే ఆశ్చర్యంగా ఉంది. అనుకోకుండా ఆ సినిమా నిర్మాతలలో ఒకరితో సరదాగా చాటింగ్ చేశాను. ఆ విషయం అప్పుడే మరిచిపోయాను. కానీ కొన్ని రోజులికి ఆ సినిమా యూనిట్ నుంచి కబురొచ్చింది. ఆడిషన్‌కి రమ్మన్నారన్న సంగతి అక్కడికి వెళ్లేంత వరకూ నాకు తెలీదు. ఆడిషన్ జరగడం, నేను సెలక్ట్ కావడం అన్నీ చకచకా జరిగిపోయాయి. నా ఫేవరెట్ హీరోయిన్ అనుష్క శర్మతో నటించబోతున్నానని తెలియగానే ఎంత సంతోషించానో నాకే తెలుసు. ఆ సంతోషాన్ని మాటల్లో చెప్పలేను.

**పిస్టల్ షూటింగ్‌లో మీరు ఎక్స్‌పర్టట కదా?**

అవును. స్కూల్ డేస్‌లో నేర్చుకున్నాను. జాతీయస్థాయి పోటీలకు వెళ్ళాల్సింది! రెండు సార్లు మిస్ అయింది. హైస్కూలు ఎగ్జామ్స్ కారణంగా ఆ పోటీలకు వెళ్ళలేకపోయాను. ఇప్పటికీ అప్పుడప్పుడు ప్రాక్టీస్ చేస్తుంటాను.

**తెలుగులో చేస్తున్న సినిమాల గురించి...**

రవితేజ గారితో 'రాజు ది గ్రేట్'లో చేస్తున్నాను. ఈ సినిమాలో ఆయనకి కళ్ళు కనిపించవు. కానీ దునియా మొత్తం కనిపిస్తుంది. అది ఎలా సాధ్యం అంటే సినిమా చూడాల్సిందే! నా పాత్ర చాలా బాగుంటుంది. సాయిధరమ్ తేజ్‌గారితో 'జవాన్' సినిమా చేస్తున్నాను. దేశానికి సైనికుడిలా ప్రతి ఇంటికీ ఓ సమర్థుడైన కొడుకు అవసరం అన్న కాన్సెప్ట్‌తో రూపొందుతోంది ఈ సినిమా. మంచి ఫ్యామిలీ ఎంటర్‌టైనర్. సందీప్‌కిషన్‌తో 'నా పేరు శివ' చేస్తున్నాను. నితిన్‌తో సినిమా డిస్కషన్‌లో ఉంది. ఇవి కాక మరికొన్ని కథలు విన్నాను. వేటికీ ఓకే చెప్పలేదు.

**బాలీవుడ్‌లో కొత్త సినిమాలు?**

అక్కడ కూడా చాలా కథలు విన్నాను. రెండు కథలు నచ్చాయి. ఇంకా ఓకే చెప్పలేదు. ఇక్కడ సినిమాల షూటింగ్‌లో బిజీగా ఉన్నాను. డేట్లు అడ్జస్ట్ కాగానే వాటికి ఓకే చెబుతాను.

–బికె

## నవ్యవీక్లి-తురగా ఫౌండేషన్ సంయుక్త నిర్వహణలో



### తురగా జానకీరాణి కథల పోటీ

| | | |
|---|---|---|
| ప్రథమ బహుమతి | : రూ. | 10,000 |
| ద్వితీయ బహుమతి | : రూ. | 8,000 |
| తృతీయ బహుమతి | : రూ. | 7,000 |

5 విశేష బహుమతులు

కథ ఒక్కింటికి : రూ. 5,000

### తురగా కృష్ణమోహనరావు హాస్యకథల పోటీ



| | | |
|---|---|---|
| ప్రథమ బహుమతి | : రూ. | 10,000 |
| ద్వితీయ బహుమతి | : రూ. | 8,000 |
| తృతీయ బహుమతి | : రూ. | 7,000 |

5 విశేష బహుమతులు

కథ ఒక్కింటికి : రూ. 5,000

### కథ/హాస్యకథ: నిబంధనలు

- కథ తెలుగు వారి జీవితాన్ని ప్రతిబింబించేలా ఉండాలి.
- ప్రపంచంలోని ఏ ప్రాంతమైనా కథకు నేపథ్యం కావచ్చు. అయితే అది తెలుగువారి జీవితానికి సంబంధించినదై ఉండాలి.
- కథలు అరటావు సైజులో 10 పేజీలకు మించకుండా ఒకవైపునే రాసి పంపాలి. దస్తూరి చక్కగా అర్థమయ్యేలా ఉండాలి. డి.టి.పి. చేసిన పక్షంలో అది 6 పేజీలకు మించరాదు.
- కథను పంపేటప్పుడు రచయిత/రచయిత్రి పేరు అందులో ఉండరాదు. పేరు, పూర్తి చిరునామా వేరే కాగితం మీద రాసి జతపరచాలి. అనుకరణ, అనుసరణ కాదని, బ్లాగుల్లోనూ, వెబ్ మాగజైన్స్‌లోనూ రాలేదని హామీ పత్రం విధిగా జత చేయాలి. కవరు మీద 'తురగా జానకీరాణి కథల పోటీకి' అని స్పష్టంగా పేర్కొనాలి. పోటీకి హాస్యకథ పంపుతున్నట్టయితే కవర్ మీద 'తురగా కృష్ణమోహనరావు హాస్యకథల పోటీకి' అని పేర్కొనాలి.
- విదేశాల నుంచి కథలు పంపించే రచయితలు/రచయిత్రులు మాత్రమే ఈ-మెయిల్ (navyaweekly@andhrajyothy)కి పంపగలరు.
- బహుమతి పొందిన కథలు 'నవ్య' వీక్లీలో ప్రచురితమవుతాయి.
- పోటీ గడువు తేదీ పొడిగించేందుకు కానీ, అర్హమైన రచనలు రాకపోతే బహుమతుల్లో మార్పులు చేసేందుకు కానీ 'నవ్య వీక్లి' యాజమాన్యానికి సర్వహక్కులూ ఉన్నాయి.
- కథల ఎంపిక విషయంలో తుది నిర్ణయం నవ్య సంపాదక వర్గానిదే! ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలకు కాని, వాద ప్రతివాదాలకు కాని తావు లేదు. ప్రచురణకు అనర్హమైన కథలు తిప్పి పంపడం సాధ్యం కాదు.

### కథలు పంపవలసిన చిరునామా

నవ్య వీక్లి
ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్
ప్లాట్ నెం. 76
రోడ్ నెం 70
అశ్వనీ లే అవుట్
హుడా హైట్స్
జూబ్లీహిల్స్
హైదరాబాద్-500033

## కథలు, హాస్యకథలు చేరవలసిన ఆఖరు తేది

# 30 జూన్ 2017

* నిబంధనలు వర్తిస్తాయి



## 42

## సక్సెస్‌ఫుల్ 'సెక్స్ లైఫ్'

కొందరు సెక్స్ కోసమే పెళ్ళి చేసుకుంటారు. మరికొందరి సెక్స్ దాహం వివాహేతర బంధాలు పెట్టుకున్నా తీరదు. మొహం మొత్తి మరొకరి వెంటపడతారు. అసలు ఎందుకింత లైంగిక దాహం? ఈ దాహం తీరే మార్గం లేదా? భార్యాభర్తలు ఏం చెయ్యాలి? చదవండి

## 8

### అరుదైన ఫీట్లు... సరికొత్త రికార్డులు

నాలుకతో ఫ్యాన్ రెక్కల్ని ఆపేస్తారొకరు! టేబుల్‌మీద కూర్చున్న యువతిని ఏ ఆధారం లేకుండా పళ్ళతో మోసేస్తారింకొకరు! అరుదైన ఆ సాహస కళాకృత్యాలేమిటో తెలుసుకోండి.

## 72

### ఎమ్మెస్ నారాయణ జీవితకథ పుస్తకావిష్కరణ

నవ్య వీక్లీలో 36 వారాలు ధారావాహికంగా వెలువడిన కామెడీకింగ్ ఎమ్మెస్ నారాయణ జీవిత కథ పుస్తకావిష్కరణ సభ విశేషాలు.

## సీరియల్స్


| | |
|---|---|
| వెట్టి | 16 |
| మనసుగతి ఇంతే! | 30 |
| సినీవాలి | 44 |
| సాఫ్ట్‌వేర్‌లో సరిగమలు | 60 |


## కథలు


| | |
|---|---|
| బందరిల్లు | 10 |
| గొంగళి పురుగు | 26 |
| సరదా కథలు | 40 |
| మూడోపాదం | 52 |
| మాస్టారు | 66 |


## ఫీచర్స్


సురభి–15, హరివంశం–22

రివ్యూ–24, తీన్‌మార్–29

క్రైమ్–36, జీవితమే ఒక ప్రతిఘటన–38

గూఢనారి నెంబర్–1–50, మనమీదేన్రోయ్–55

ఇంటర్వ్యూ–58, ఆరోగ్యమే మహాభాగ్యం–65

సౌభాగ్యచక్రం–68 నవ్యసినిమా–69

అవును డేటింగ్ చేశా–70

పదగారడీ–74


ముఖచిత్రం: శ్రుతిహాసన్
ఫొటో: గోపీకృష్ణ


రచనలు, కథలు పంపవలసిన చిరునామా

నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్33. email: navyaweekly@andhrajyothy.com





### కాఫీబ్రేక్

**చ**చ్చి నరకానికి చేరుకున్నాడతను. చిత్రగుప్తుడు అతనితో పాటుగా నడుస్తూ చెప్పాడిలా.

"చేసిన పాపానికి ఇక్కడి మూడు రూముల్లో ఏదో ఒక రూంలో నువ్వు శిక్ష అనుభవించాలి. ఏ రూంలో అనుభవిస్తావో నువ్వే నిర్ణయించుకో."

ఒక రూం చూపించాడు. ఆ రూం అంతా బురద మయంగా ఉంది. దుర్గంధభరితంగా ఉంది. పాపు లంతా మెడవరకు బురదలో కూరుకుపోయి ఉన్నారు. ఛీఛీ! యాక్ అనుకున్నాడతను. చిత్రగుప్తునితో ఆ రూం వద్దన్నాడు. రెండోరూం చూపించాడు చిత్రగుప్తుడు. ఆ రూం కూడా అంతే! బురదమయం. దుర్గంధభరితం. అందులో పాపులు ముక్కు వరకూ కూరుకుపోయి ఉన్నారు. అమ్మో అనుకున్నాడతను. ఆ రూం కూడా వద్దన్నాడు. మూడోరూం చూపించాడు చిత్రగుప్తుడు. ఆ రూంలో పాపులంతా మోకాళ్ళలోతు బురదలో నిల బడి, దుర్గంధాన్ని భరిస్తూ సమోసా తిని, టీ తాగు తున్నారు. బెటర్! బాగుందనుకున్నాడతను. ఆ రూంలో ఉంటానన్నాడు. ఓకే చెప్పి చిత్రగుప్తుడు, అతన్ని ఆ రూంలోనికి ప్రవేశపెట్టాడు. కొత్తగా వచ్చిన పాపికి యమదూతలు సమోసా ఇచ్చి, టీ కూడా సెర్వ్ చేశారు. కాసేపు గడిచింది. అప్పుడు గట్టిగా అరిచాడిలా చిత్ర గుప్తుడు.

"కాఫీ బ్రేక్ అయిపోయింది. ఇక అంతా తలకింది లుగా బురదలో నిలబడండి."

### ఖర్మ

**బా**ర్‌కి అతను చాలా చిరాగ్గా వచ్చాడు. వస్తూనే వెంటవెంటనే ఆరుపెగ్గులు తాగేశాడు. తాగేసి, కుర్చీ లోంచి లేచి కింద కూర్చుని, నానా అల్లరీ చేయసా గాడు. బార్‌టెండర్ అతన్ని లేపి, వెళ్ళి రండి అని ముందు గేటులోంచి పంపించేశాడు. వెనక గేటులోంచి బార్‌లోకి ప్రవేశించాడతను. మందుకావాలంటూ గోల చేయసాగాడు. అతన్ని బార్‌టెండర్ గమనించి, వచ్చిన దారినే పంపించేశాడు. అప్పుడు అతను ముందుగేటు లోంచి బార్‌లోకి ప్రవేశించాడు మళ్ళీ. అల్లరి చేయసా గాడు. బార్‌టెండర్ అతన్ని బయటకి పంపేశాడు. అటు పంపితే ఇటు, ఇటు పంపితే అటు అతను వస్తూనే ఉన్నాడు. బార్‌టెండర్ పంపుతూనే ఉన్నాడు. అప్పుడు అతను నెత్తికొట్టుకుంటూ అన్నాడిలా.

"సిటీలో అన్ని బార్లలోనూ నువ్వే పనిచేస్తున్నావా? ఖర్మ."

–వైనతేయ

www.navyaweekly.com

పుస్తక పఠనం ఎంతటి బాధనయినా మరపిస్తుంది.

నవ్య

సంపుటి: 14 సంచిక: 9

3-5-2017



మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎన్.జగన్నాథశర్మ

# మొదటి పేజి

## నిర్లిప్తత

సన్నగా వర్షం. ఆ వర్షంలో పరుగుదీస్తూ చిన్నకారు. ఆ కారుని డ్రైవ్ చేస్తూ అతను, కారు వెనుక సీట్లో కునుకు తీస్తూ ఆమె. అతని పేరు రామారావు. ఆమె పేరు జానకి. రామారావుకి డెబ్బయి ఏళ్ళు. జానకికి అరవై ఏడేళ్ళు. ఇద్దరికీ పెళ్ళయి ఏభైఏళ్ళు. ఏభైఏళ్ళ సంసారజీవితంలో వాళ్ళకి చిక్కిన ఏకాంత క్షణాలివే!

బుజ్జిది, చిన్న కారుండాలి. ఆ కారుని మీరు డ్రైవ్ చేస్తూ ఉండాలి. పక్కన నేనుండాలి. ఉండి, మనిద్దరం ఈ దేశంలో ఉన్న పుణ్యక్షేత్రాలన్నీ సందర్శించాలి. ఇదే నా కోరిక! ఇదొక్కటే నా కోరిక అని రామారావుకి చెప్పి, ఆ కోరిక నెరవేర్చుకునేందుకు జానకి పడని పాట్లు లేవు. ఇంట్లో ఉప్పును కూడా పొదుపుగా వాడి పైసా పైసా వెనకేసిందామె. కొడుకులిద్దరూ అప్పుడప్పుడూ అభిమానంగా ఇచ్చిన డబ్బులూ, చీర కొనుక్కో! గాజులు వేయించుకో అని వద్దన్నా వినక, ఏడాదికీ, ఆర్నెల్లకీ కూతురు చేతిలో పోసిన చిల్లరా కూడబెట్టి రెండు లక్షలకి పైగానే దాచింది జానకి. ఆ డబ్బుతో బుజ్జిది, చిన్న కారు వస్తుందన్న ధైర్యం రాగానే భర్తని డ్రైవింగ్ నేర్చుకోమన్నది. నేర్చుకున్నాడతను. అప్పుడు దాచిన డబ్బంతా పెట్టి, చిన్న కారు కొన్నది జానకి. కొని పదిహేనేళ్ళయింది. ఈ పదిహేనేళ్ళలోనూ ఎవరో శపించినట్టుగా భార్యాభర్తలిద్దరూ ఎక్కడకీ కదలిన పాపాన లేదు. అలాగే ఏకాంతంగా గడిపిందీ లేదు. ఇప్పుడు... ఇన్నాళ్ళకి, ఇన్నేళ్ళకి కదిలారు. పుణ్యక్షేత్రాలు సందర్శిస్తూ కాశీకి చేరారు. కాశీలో విశ్వేశ్వరుణ్ణి చూశారు. విశాలాక్షిని చూశారు. చాలనిపించిందేమో! వెనక్కి వెళ్ళిపోదాం అన్నాడు రామారావు. రేపోసారి గంగలో నిండుగా మునిగి వెళ్ళిపోదామన్నది జానకి. సరేనన్నాడు రామారావు. రేపటికోసం చూస్తూ కారులో ప్రయాణిస్తున్నారిద్దరూ.

ఉన్నట్టుండి ఒక్కసారిగా దగ్గొచ్చింది జానకికి. లేచి దగ్గసాగింది. రోడ్డుకి పక్కగా కారాపాడు రామారావు. దగ్గుతూ కారులోంచి కిందికి దిగి, రక్తం కక్కింది జానకి. తూలిపోతుంటే పట్టుకున్నాడామెను రామారావు. కాసేపటికి నిమ్మళించిందేమో! నీళ్ళు కావాలంది జానకి. అందించాడు రామారావు. నీళ్ళు తాగింది జానకి. ముఖాన్ని కడుక్కుంది. కారెక్కి, వెనక్కి చేరబడింది. అప్పుడు చేతికి తగిలిన పేపర్ని తీసుకుని చూసింది. పేపర్లో కారు ముందు నిల్చుని ఉన్నారు జానకి-రామారావు. కింద హిందీలో 'కారులో కాశీయాత్ర' అన్న శీర్షికన వార్త ప్రచురించి ఉంది. మన గురించి ఇక్కడ పేపర్లలో కూడా రాశారా? రామారావుని అడిగింది జానకి. రాశారన్నట్టుగా తలూపాడతను. న్యూస్‌ఛానెల్సూ, పేపర్లూ ఎక్కువైపోవడంతో ప్రతిదీ వార్తే అని నవ్వింది జానకి. మత్తుగా ఉంటే కళ్ళు మూసుకుంది. కేన్సర్! లాస్ట్ స్టేజ్! మహా అయితే ఒకటి రెండు నెలలు మాత్రమే బతికే అవకాశం ఉంది. ఈ ఒకటి రెండునెలలూ ఆమె ఎలా బతకాలనుకుంటే అలా బతకనివ్వండి! ఏది కోరుకుంటే అది తీర్చే ప్రయత్నం చెయ్యండి అని భర్తకి డాక్టర్ చెప్పిన మాటలు గుర్తొచ్చాయి జానకికి. పాపం రామారావు! అనుకున్నది జానకి. తనకోసం చాలా కష్టపడుతున్నాడని, కన్నీరుపెట్టుకుంది. ఏడుస్తున్నావా? కారు స్టార్ట్ చేస్తూ అడిగాడు రామారావు. లేదు అన్నది జానకి. కారు బయల్దేరింది అక్కణ్ణుంచి. చీకటిపడింది. రాత్రి అయింది. తెల్లారింది.



చలిచలిగా ఉంది. ఇంకా సూర్యోదయం కాలేదు. గంగ మీద పొగమంచు పరుచుకుని ఉంది. పడవలో వ్యాసకాశీకి చేరుకున్నారిద్దరూ. ఎవరూ లేరక్కడ. జానకి స్నానానికి సిద్ధమయింది. ఒంటికి పసుపు రాసుకోసాగింది. పసుపురాసుకుంటూ పిల్లలు ముగ్గురూ మీ పోలికే! దేనికీ ఆందోళన చెందరు అన్నది. సమాధానం లేదు. రామారావు మౌనంగా నిల్చున్నాడు. ఈ యాభై ఏళ్ళలో మీపరంగా నేనేమైనా తప్పులు చేశానా? చేస్తే క్షమించండి అన్నది జానకి. ఏమీ మాట్లాడలేదు రామారావు. మెల్లగా గంగలోకి దిగింది జానకి. అప్పుడే సూర్యోదయం అయింది. ఎర్రగా మెరిసిపోతున్నాడు సూర్యుడు. నమస్కారం చేసిందతనికి. గంగలో ఓ మునక వేసి, లేచింది. ఈసారి అటుగా విశ్వేశ్వరాలయం వైపు చూసింది. కాశీవిశ్వేశ్వరునికి నమస్కారం చేసింది. రెండో మునక వేసి, లేచింది. ఇటు తిరిగి రామారావుని చూసింది. నవ్వింది. చేతులు రెండూ జోడించి అతనికి నమస్కరించింది. ముక్కు మూసుకుని మూడో మునక వేసింది జానకి. మరి లేవలేదు. జానకి జానకి అని గుండె ఘోషిస్తున్నా పిలవలేదు రామారావు. పావుగంటైనా జానకి నీళ్ళలోంచి లేవలేదు. లేవదని తెలుసుకున్నాడు రామారావు. జేబులోంచి కారు తాళం తీసి చూశాడు రామారావు. గంగలోనికి విసిరేశాడు దానిని.

సినిమా చూస్తున్నట్టుగా జీవితాన్ని చూడాలి. సినిమాని చూస్తున్నప్పుడు ఎంతగా లీనమైపోతామో అంతగా జీవితాన్ని అనుభవిస్తూ అందులో లీనమైపోవాలి. అలాగే ముగిసిపోయేవేళ వదలి వెళ్ళిపోవాలి. నిర్లిప్తంగా ఉండిపోవాలి అనుకున్నాడు రామారావు. వెనుతిరిగాడు.




## వెదురు పొదరిళ్ళు

పూరిళ్ళు, తాటాకు ఇళ్ళు పోయి డాబాలు, అపార్టుమెంట్లు వచ్చేశాయి. హాల్లో సోఫాలు, కళాత్మక పెయింటింగులు కొలువుదీరుతున్నాయి. ఇలా ఇంటిని అందంగా ముస్తాబు చేయడం కోసం లక్షలకు లక్షలు ఖర్చుచేస్తున్నారు. అయితే బాంబూ హౌస్ ఆఫ్ ఇండియా మాత్రం వీట న్నింటికీ విరుద్ధం అంటోంది. వెదురిల్లుని మించిన పొదరిల్లు లేదని ప్రాక్టికల్‌గా నిరూపిస్తోంది. 2010లో మొదలైంది బాంబూ హౌస్ ఆఫ్ ఇండియా. దీని రూపకర్తలు అరుణ, ప్రశాంత్ దంపతులు. వారి ప్రధాన ఉద్దేశం వెదురుతో ఇల్లు కట్టడం. ఒక్కసారి వెదురిల్లు కడితే 25 నుంచి 30 ఏళ్ళ వరకు చెక్కుచెదరదు. స్క్వేర్ ఫీట్ కు 600 రూపాయల వరకు ఖర్చు అవుతుంది. అంతా సహజంగా లభించే మెటీరియల్‌తోనే! రెండు డిగ్రీల వరకు చల్లగా ఉంటుంది. వెదురులో సిలికా ఉంటుంది. వర్షాలు, అగ్నిప్రమాదాలను తట్టుకునేలా వెదురుకు ప్రత్యేకంగా కెమికల్స్ పూస్తారు. రూఫ్ ఓవర్ హ్యాంగ్స్ ఇస్తారు. రక్షణ గురించి భయం లేదు. బయటి నుంచి పెయింటింగ్ వేస్తారు. మెయింటెనెన్స్ పెద్దగా



ఉండదు. పైగా వెదురిళ్ళతో పర్యావరణానికి బోలెడంత మేలు. మొత్తమ్మీద రుష్యాశ్రమంలాంటి ఇల్లుని తయారుచేసి ఇస్తారు.

వెదురు ఉత్పత్తిలో మన దేశం ప్రపంచంలోనే రెండో స్థానంలో ఉంది. అవగాహన లేకపోవడం వల్ల వెదురును సరిగా ఉపయోగించుకోవడం లేదంటున్నారు అరుణ. ఇప్పటివరకు 200 వెదురిళ్ల నిర్మించారు. వినియోగదారులు చాలా సంతృప్తిగా ఉన్నారని చెప్పారామె. ఎకో ఫ్రెండ్లీ కాన్సెప్ట్ కాబట్టి వ్యతిరేక ఫీడ్‌బ్యాక్ లేదు. వీరి దగ్గర 20 మంది ఉద్యోగులు పనిచేస్తున్నారు. పరోక్షంగా ఇంకా చాలా మందికి ఉపాధి దొరుకుతోంది. వెదురు ఉత్పత్తితో ముడిపడి ఉన్న వాళ్లందరికీ లాభం చేకూరుతుంది.

మోడ్రనైజేషన్ మాయలో పడి ఇంటికీ, కార్పొరేట్ ఆఫీసుకీ పెద్ద తేడా లేకుండా చేస్తున్నారు. అందుకే మరిచిపోతున్న పల్లెను నట్టింట్లో ప్రతిష్ఠించే గొప్ప సామాజిక బాధ్యతను తలకెత్తుకుంది బాంబూ హౌజ్ ఆఫ్ ఇండియా. ఈ కాన్సెప్ట్ వెనుక వ్యాపారమే కాదు సామాజిక బాధ్యత కూడా దాగివుండటం ఎంతైనా అభినందనీయం.

నవ్య

# మెయిల్ బాక్స్

### ఒత్తిడి సమస్యలు బాగా వివరించారు

ఈసారి మార్నింగ్ కాఫీతో ఇచ్చిన జోక్స్ అదుర్స్. భలే నవ్వించాయి. ఏప్రిల్ 19వతేదీ 'మొదటిపేజీ కథ' మా హృదయాలను ఆర్ద్రంచేసి ఆలోచింపజేసింది. నిజమే. ఈ ప్రపంచంలో ఎవరికి ఎవరు? ఈ రోజుల్లో ఉరుకులు పరుగుల జీవితంలో ఒత్తిడి సహజం. ఆ ఒత్తిడివల్ల వచ్చే సమస్యలు, ఒత్తిడి హద్దుల్లో ఉంటే కలిగే లాభాలు బాగా వివరించారు.

**–డి.అభిలాష, సాంబమూర్తి నగర్, తూ.గో.జిల్లా**

### మహానంది అప్పుడే అయిపోయిందా?

'మహానంది' సీరియల్ అయిపోయిందా? అనిపించింది. ఒక్కవిషయం ఏమిటంటే తెలుగు టీవీ సీరియల్ లాగా ఎప్పుడు అయిపోతుందిరా బాబూ అని కాకుండా, అరే అప్పుడే అయిపోయిందా? అనిపించేలా ఈ సీరియల్ ఎంతో బాగా కొనసాగింది. మహానంది సీరియల్ మాత్రమే కాదు, ఇంతకుముందు హవేలీ, డాక్టర్ మాధురి ఐఎ ఎస్ కూడా అదేస్థాయిలో మమ్మల్ని ఆకట్టుకున్నాయి. నవ్య వీక్లీకి హేట్సాఫ్.

**–ఆరిష్ కార్తికేయ, ఈస్ట్ మారేడుపల్లి, సికింద్రాబాద్ –26**

### మొదటిపేజీ ఆదర్శవంతం

ఆటలే ఆరోగ్యం, అందం, ఆనందం అని వక్కాణించిన మొదటిపేజీ ఆదర్శవంతంగా ఉంది. 'తమిరిశ జానకిగారి 'ఆమె ఒంటరి కాదు' కవిత హృద్యంగా ఉంది. 'పళ్ళు పరగడుపునే తినాలని ఆరోగ్యమే మహాభాగ్యం బోధించింది. సాఫ్ట్‌వేర్‌లో సరిగమలు సీరియల్ అంతుబట్టని మలుపులతో సాగుతోంది. నైరా ఆచూకీ ఈ వారం చూచాయగా తెలిసినట్టనిపించి ఉత్కంఠతో ముందుకు పోతోంది. తీన్‌మార్‌తోపాటు, కార్టూన్ల ఊపుతో కార్టూనిస్టు బాచి నవ్వులు పంచుతున్నారు. ఆరోగ్యాన్ని పెంచుతున్నారు. ప్రాణంచెట్టు కథాకర్త ఈతకోట సుబ్బారావుగారికి అభినందనలు. అనుకోని అతిథిలా గీత ఇంటర్వ్యూ చదివాం.

**–నేమాన సుభాష్‌చంద్రబోస్, విశాఖపట్నం**

### నూతనపంథాలో సాగిన కథ

పెద్దింటి అశోక్ కుమార్ కథ టూ గ్రేటర్ దాన్ వన్ నూతన పంథాలో సాగింది. పాఠకులను అలరించింది. పదగారడి, చక్కని కాలక్షేపాన్నిస్తోంది. ఇవన్నీ నిజాలేలోని అంశాలు విద్యార్థులు గుర్తుంచుకోదగినవిగా ఉన్నాయి. నటి కృష్ణకుమారి జీవిత చరిత్ర పుస్తకానికి బి.కె.ఈశ్వర్ సమీక్ష బాగుంది. కానీ క్లుప్తంగా ఉంది. 'అందుకు ఇదా శిక్ష' క్రైమ్ కథను కస్తూరి మురళీకృష్ణ ఆసక్తికరంగా చెప్పారు. 'ప్రాణంచెట్టు' ఈతకోట సుబ్బారావు కథాకథనం కొత్త పంథాలో సాగింది.

### వైద్యవృత్తివారు చదవాల్సిన కథ ఎథిక్స్

బహుమతి పొందిన కథ 'ఎథిక్స్' ఎంతో బాగుంది. గజదొంగ జగ్గడు మనిషిగా మారి దారినపోయే వారికి ఆశ్రయమిచ్చిన తీరు చాలా చక్కగా రాశారు. ఇటువంటి మార్పు అందరిలోనూ వస్తే బాగుంటుంది. ఇలాంటి కథల్ని ఆదరిస్తున్న నవ్యకు ధన్యవాదాలు. రచయిత నక్కా విజయరామరాజుగారికి ధన్యవాదాలు.

**–వి.సత్యస్వాతి, దొడ్డిగుంట**

### మానవత్వ విలువలున్న కథ

ఎథిక్స్ కథ మానవత్వ విలువలను తెలియజేసేదిగా ఉంది. వైద్యవృత్తి చేస్తున్న వారు తప్పకుండా ఈ కథ చదవాలి. కథా రచయిత డాక్టర్ నక్కా విజయరామరాజుగారికి ధన్యవాదాలు. ఈయన రాసిన భట్టిప్రోలు కథలు కూడా ఎంతో బాగున్నాయి.

**–డా.వి.ఎం.కృష్ణ, కాకినాడ**

సరసి కార్టూన్‌లో మనిషి తన సహజసిద్ధమైన లోభి గుణాన్ని మరుగుపెట్టక మరింత లాభం పొందడాన్ని సమర్థించడం హాస్యస్ఫోరకంగా ఉంది.

**–డాక్టర్ శివభూషణం, కర్నూలు**

### తెర వెనుక ఇంత కుతంత్రమా?

సినీరంగం గుట్టుమట్లు అవార్డుల బండారాలు, నిర్భయంగా పూసగుచ్చినట్టు రాస్తున్న సినీవాలి సీరియల్ రచయిత ప్రభాకర్ జైని గారి గుండె ధైర్యానికి జోహార్లు. కళలో ఇంత కుళ్ళు, కుతంత్రం ఉంటాయా! అనిపించింది. స్వంత మనుషులు, తమ దగ్గర మసలేవారే, సదరు నాశనానికి కారకులా? అంతకంటే పరమనీచం ఎక్కడా ఉండదు. పైరవీలకు, అరాచకాల వెనక పనిచేసే రాజకీయ నాయకులు, పోలీసులు, గూండాలు సినీపరిశ్రమకు ఆధారాలు కావడం ఆ పరిశ్రమకే తీరని నష్టం. అవార్డు కమిటీల నిర్వాకాలు, జ్యూరీల జులుములు, అవార్డుల ఎంపికలో అన్యాయాలు సినీవాలిలో రట్టు చేస్తున్న రచయితకు ధన్యవాదాలు. ఈ సీరియల్ నవ్య పత్రికకు హైలైట్ అని చెప్పాలి.

**–ఆర్.కె., హైదరాబాద్**

# సొరియాసిస్ వ్యాధి పునాదులు కదులుతాయి

చనిపోయి మళ్లీ పుడితేనే పునర్జన్మ అని కాదు. ఏళ్ల పర్యంతంగా వేధిస్తూ వచ్చిన ఒక తీవ్రమైన వ్యాధి నుంచి పూర్తిగా బయటపడటం కూడా పునర్జన్మే అవుతుంది. సొరియాసిస్ నుంచి వి ముక్తి పొందడం కూడా కృతంగా పునర్జన్మే అ వుతుంది. దురదా మంటలతో నరకాన్ని చూపిస్తూ, నిద్ర ఆహారాలకు కూడా దూరం చేసే సొరియాసిస్ నుంచి విముక్తం చేయగలిగేది ఆ యుర్వేదం కాక మరేముంది? ఆరోగ్యం విష యంలో సమాధానం లేని ప్రశ్నలు గానీ, పరిష్కారం కాని సమస్యలు గానీ ఏమీ ఉండవని ఆయుర్వేదం బలంగా నమ్ముతుంది. కాకపోతే ఆ యా విషయాల్లో మనసునంత లోతుగా లగ్నం చేయాల్సి ఉంటుంది. ఎన్ని మందులు వాడినా, సొరియాసిస్ ఎప్పటికీ పోదేమో అనుకుంటారు చాలా మంది. ఎంత సేపూ వ్యాధి లక్షణాలను అణచివేయడమే తప్ప, వ్యాధి మూలాలను తొలగించే వైద్యం అందనప్పుడు సొరియాసిస్ అలా కొనసాగుతూనే ఉంటుంది.

### భిన్నత్వమే విశిష్టత

ఆయుర్వేద వైద్య విధానం మిగతా అన్ని వైద్య విధానాల కన్నా ఎంతో భిన్నమైనది. వ్యాధి రావడానికి గల అసలు కారణాలను పరిశీలించి, వాటిని సమూలంగా తొలగించే అన్ని చర్యలూ తీసుకుంటుంది. చర్మం మీదే కనిపించే సొరియాసిస్‌కు ధాతువులను దెబ్బ తీసేంత శక్తి ఉంటుందా అని కూడా కొందరు అనుకుంటారు. నిజానికి సొరియాసిస్‌కు సప్తధాతువులనే కాదు, సమస్త శరీర వ్యవస్థలనూ ధ్వంసం చేసే తత్వం ఉంటుంది. అలా ధాతువులు క్షీణిస్తూ వెళ్లే కొద్దీ శరీరంలో వాతం పెరిగిపోతుంది. ఒక్క వాతం సంతులనం (బ్యాలెన్స్) కోల్పోతే ఆ ప్రభావంతో మిగతా పిత్తం, కఫం కూడా సంతులనం కోల్పోతాయి. అయితే, చికిత్సా విధానాలతో ఒక్క వాతాన్ని తిరిగి సాధారణ స్థితికి తెస్తే, పిత్త కఫాలు కూడా సాధారణ స్థితికి వస్తాయి. అందుకే ఆయుర్వేదం వాత నియంత్రణకు అత్యధిక ప్రాధాన్యతనిస్తుంది.

### ఆయుర్వేదమే అసలైన వైద్యం

ఎన్నో ఏళ్లుగా వైద్య చికిత్సలు తీసుకుంటూనే ఉన్నాం. అ యినా సొరి యాసిస్ ఏ మాత్రం తగ్గలేదని చాలా మంది వాపోతుంటారు. కానీ, ఆ చికిత్సలు పై పై పూతలకే పరిమితమైనవా? శరీరం లోలోతుల్లోకి వెళ్లి సప్తధాతువులనూ ఉత్తేజితం చేసినవా? అన్నది ప్రశ్న. సొరియాసిస్ మచ్చలు చర్మం మీదే కనిపిస్తున్నాయని, పైపై వైద్యాలకే పరిమితమైతే సొరియాసిస్ రోజురోజుకూ పెరుగుతూనే వెళుతుంది. అందుకే, కేవలం బాహ్య చికిత్సలకో లేదా ఔషధాలకో పరిమితమైతే సొరియాసిస్‌కు అది పరిపూర్ణ వైద్యం కాదు. సొరియాసిస్‌కి కారణమైన ఆమాన్ని అంటే విషపదార్థాలను ముందు పంచకర్మ చికిత్సల ద్వారా తొలగించాలి. ఆ తరువాత ధాతుక్షయాన్ని నివారించే ఔషధాలు కూడా ఇవ్వాలి. వమనం, విరేచన కర్మల ద్వారా శరీరంలోని మలినాలన్నీ తొలగిస్తే వాతం అప్పుడు నియంత్రణలోకి వస్తుంది. మిగతా పిత్త, కఫాలు కూడా అదుపులోకి వస్తాయి. అప్పుడే సొరియాసిస్ సమూలంగా తొలగిపోతుంది. ఆయుర్వేదం ఎటువంటి జటిలమైన సమస్యనయినా సవాలుగా తీసుకుంటుంది. దానికి సమాధానం చెప్పి తీరుతుంది. ఇదేదో నమ్మకానికి సంబంధించింది ఎంత మాత్రం కాదు. ఇది పక్కా శాస్త్రీయమైన చికిత్స. అందుకే అందుకే సొరియాసిస్ వ్యాధి ఆయుర్వేదం ముందు తలవంచుతోంది. అలా సొరియాసిస్ బాధితులు సమాజంలో మునుపటిలా సగౌరవంగా బతికేలా చేస్తోంది.




డాక్టర్ ఎన్. రామకృష్ణారెడ్డి
ఆర్.కె ఆయుర్వేదిక్ అండ్ సొరియాసిస్ రీసెర్చ్ సెంటర్

| | |
|---|---|
| కూకట్‌పల్లి | 8886922245 |
| నాంపల్లి | 8886922247 |
| హన్మకొండ | 8886922248 |
| విజయవాడ | 8886922249 |
| వైజాగ్ | 8886922250 |
| కర్నూలు | 8886922251 |
| తిరుపతి | 8886922252 |


# స్వర్ణామృతప్రాశనతో ఆటిజానికి స్వస్తి

పిల్లల్లో శారీరక ఎదుగుదల ఆగిపోతే, కొద్ది రోజుల్లోనే తెలిసిపోతుంది. అదే మానసిక ఎదుగుదల ఆగిపోతే గుర్తించడం అంత సులువేమీ కాదు. ఆటిజంతో వచ్చే క్కే ఇది. సహజంగా పిల్లలమీద తలిదండ్రులు మీద ఉండే వల్లమాలిన ప్రేమ వల్ల వారికి పిల్లల లోపాలు గానీ తప్పిదాలుగానీ వెంటనే మన సుకు తెలియవు. . ఒ కవేళ ఎప్పటికో వాళ్ల దృష్టికి వచ్చినా తమ పిల్లవాడు ఒ క పెద్ద లోపంతో ఉన్నాడనే నిజాన్ని ఒప్పుకోవడానికి మనసు ఒ క పట్టాన అంగీకరించదు. కానీ, వాళ్లు మనసు అంగీకరించనంత మాత్రాన ఉన్న లోపాలు వాటికవే మాయమైపోవు కదా! మన మన ఇష్టాఇష్టాలు ఎ లా ఉన్నా, ప్రతి తలిదండ్రీ ఆటిజం వ్యాధి లక్షణాల గురించి తెలిసి ఉండడం చాలా అ వసరం.

### ఆటిజంలో ఏమవుతుంది.?

శారీరక ఎదుగుదలతో సమానంగా, మానసిక ఎదుగుదల కూడా ఆగిపోతుంది. ఆటిజం వ్యాధిగ్రస్తుల్లో తాము చేయాల్సిన పనేమిటో, చేయకూడనిదేమిటో తెలియని ఒక నిస్సహాయత ఆటిజం బాలబాలికల్ని పీడిస్తుంది. ఆటిజంలో వయసుతో పాటు రావల్సిన జ్ఞానమేదీ రాదు. విషయాల్ని గుర్తించే శక్తి ఉండదు. ఎవరితోనూ కలవకుండా ఒంటరిగా ఉండడాన్ని ఇష్టపడతారు. ఆటిజంలో కొంతమంది పిల్లల్లో అతిగా ప్రవర్తించే హైపర్ యాక్టివ్ లక్షణాలు కూడా కనిపిస్తాయి.

### ఆటిజం కారణాల్లోకి వెళితే.....

● ఎదుటి వారి కళ్లలోకి చూస్తూ ఎప్పుడూ మాట్లాడరు. ఈ పిల్లలకు మాటలు వచ్చినా ప్రతిసారీ రెండు పదాలకు మించి మాట్లాడరు. అయతే ఆ రెండు మాటల్నే మళ్లీ మళ్లీ చెబుతారు.

● హైపర్ యాక్టివిటీ వీరిలో కనిపిస్తుంది. అన్ని విషయాల్లో అతిగా వ్యవహరించడం కనిపిస్తుంది. తనంతట తాను అరవడం, కేకలు వేయడం తను అలా ఎందుకు చేస్తున్నాడో తానేమీ తెలిసే స్థితిలో ఉండడు. ఒక్క నిమిషమైనా ఒక చోట స్థిరంగా నిలబడరు.

### స్వర్ణామృత ప్రాశన వల్ల జరిగేదేమిటి?

ఆటిజంలోని ప్రధాన సమస్య మెదడుకు శరీరానికి మధ్య సంబంధం తెగిపోవడం. అలా తెగిపోవడానికి మెదడు తన సహజమైన పటుత్వాన్ని కోల్పోవడమే కారణం. ఈ స్థితిలో స్వర్ణామృత ప్రాశన మెదడుకు శక్తిని ప్రసాదిస్తుంది. మొత్తం నాడీ వ్యవస్థను, మెదడులోని స్పీచ్ సెంటర్లను చైతన్యపరుస్తూ బాడీకి కనెక్ట్ అయ్యేలా చేస్తుంది. అందుకే స్వర్ణామృత ప్రాశన వాడటం మొదలెట్టిన మొదటి రెండు నెలలలోపల మాట రావడాన్ని గమనించవచ్చు. ప్రతి సందర్భంలోనూ స్పష్టంగా మాట్లాడలేకపోయినా తొలుత సంజ్ఞల రూపంలోనైనా తన మనోభావాల్ని వ్యక్తం చేయడం మొదలవుతుంది. 5వ నెల వచ్చేసరికి అప్పటిదాకా ఉంటూ వచ్చిన హైపర్ యాక్టివ్ తత్వం, స్వర్ణామృతప్రాశనలో స్వర్ణభస్మంతో పాటు, మనిషి మేధోశక్తిని పెంచే మేధోద్రవ్యాలు కూడా ఇందులో ఉన్నాయి. ఇవి ఆటిజం పిల్లల ఐ.క్యూ లెవెల్‌ను పెంచడంలో ఎంతో ఉపయోగపడతాయి. స్వర్ణామృతప్రాశనంతోపాటు ఎడిహెచ్‌డి. హైపర్ యాక్టివిటీ డిజార్డర్‌లో నస్యకర్మతోపాటు కొన్ని ప్రత్యేకమైన చికిత్సలను అందుబాటులోకి తేవడం జరిగింది. అందువల్ల స్వర్ణామృతప్రాశన వాడుతూ, ఈ చికిత్సలను కూడా తీసుకుంటే, ఆటిజం నుంచి బయటపడటమే కాదు, అందిరికీ సరిదీటుగా అడుగులు ముందుకు వేస్తారు. అనుకున్నది సాధిస్తారు.




# అరుదైన ఫీట్లు... సరికొత్త రికార్డులు

**కొం**తమంది పాటలు బాగా పాడతారు. మరికొంతమంది డాన్స్‌లో ప్రావీణ్యం కలిగి ఉంటారు. ఇంకొంతమంది మిమిక్రీలో సిద్ధహస్తులై ఉంటారు. ఇలా ఒక్కొక్కరికీ ఒక్కో టాలెంట్ ఉంటుంది. సృష్టిలో 64 కళల్లో కనీసం ఒక్కటయినా లేకుండా ఏ ఒక్కరూ ఉండరు. నిద్రపోతూ కనేది కల.. సమాజాన్ని నిద్రలేపేది కళ.. అన్న మాటలను నిజం చేస్తూ ఎందరో ప్రముఖులు ఆయా రంగాల్లో ఆహూతులను అలరించారు. వారందరికీ తాము భిన్నం అని ప్రకటించుకోవడానికో లేక ప్రపంచమంతా తమ గురించి మాట్లాడుకోవాలనో ఏమో కానీ కొందరు మాత్రం ఈ కళల జోలికి పోకుండా కళాత్మకమైన రీతిలో తమ ప్రతిభను కనబరిచారు. అందరినీ అబ్బురపరచి జేజేలు పలికించుకోవడమే కాకుండా గిన్నిస్‌బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డుల్లో కెక్కారు కూడా. మరి ప్రపంచమంతా మెచ్చిన, గిన్నిస్‌బుక్కుకు నచ్చిన వారి సాహస కళాకృత్యాలేంటో ఓ లుక్కేద్దామా....










### 1. ఫ్యాన్ రెక్కలను ఆపేసింది

మీ ఇంట్లో తిరుగుతున్న ఫ్యాన్, దాని రెక్కలను మీరు ఎప్పుడైనా గమనించారా..? తిరిగేటప్పుడు అనుకోకుండా వాటికి చేయి తగిలితే.. రక్తం కళ్ల చూడాల్సిందే. గట్టి ఎముక ఉండే చేయి తగిలితేనే తట్టుకోలేనంత బాధగా ఉంటుంది. అలాంటిది మానవ దేహంలో సున్నితమైన కండరాలున్న నాలుక తగిలితే.. తెగిపడటం ఖాయమని వేరుగా చెప్పనక్కర్లేదు. కానీ ఆస్ట్రేలియాకు చెందిన జియో ఎల్ అమోర్ అనే యువతి వేగంగా తిరుగుతున్న ఫ్యాన్ రెక్కల్ని నాలుకతో ఆపేస్తుంది. రెండు టేబుల్ ఫ్యాన్లను రెండు చేతుల్తో పట్టుకుని, వేగంగా తిరుగుతున్న రెక్కల్ని నాలుకతో 32 సార్లు ఆపేసింది. దీనికి సంబంధించిన ప్రత్యేక షో చూసిన వాళ్లు ఆశ్చర్యపోతే.. మరికొందరు భయపడి కళ్లు మూసుకున్నారు. మొత్తానికి ఈ రేర్ స్టంట్.. మార్చి నెలలో గిన్నిస్‌బుక్ రికార్డ్సులో చోటు సంపాదించింది.

### 2. మిస్టర్ ఫెంటాస్టిక్ రియల్

మీ చేతిపై చర్మాన్ని పట్టుకుని లాగండి.. మెడపై ఉన్న చర్మాన్ని కూడా లాగి చూడండి.. మహా అయితే ఒక ఇంచు దూరం మాత్రమే చర్మం సాగుతుంది. యూకేకు చెందిన గారీ టర్నర్ అనే వ్యక్తి ప్రపంచంలోని మనుషులందరికీ భిన్నం. అతడి చర్మం ఫెంటాస్టిక్ ఫోర్ అనే హాలీవుడ్ సినిమాలోని మిస్టర్ ఫెంటాస్టిక్ పాత్ర శరీరంలాగా, రబ్బరులా సాగుతుంటుంది. మెడ, చేతులు, కాళ్లు, పొట్ట.. ఇలా అన్ని భాగాల్లోనూ చర్మాన్ని మామూలు మనుషులకంటే భిన్నంగా సాగదీయగలడు. ఇదేమైనా విద్యా అనుకుంటే మాత్రం పొరపాటే! ఓటమిలోనూ గెలుపును వెతుక్కోవాలని పెద్దలు చెప్పిన మాటలను అనుసరిస్తూ.. తనకు ఉన్న 'ఎహ్లెర్ డాన్లోస్ సిండ్రోమ్' అనే అరుదైన వ్యాధిని అనుకూలంగా మార్చుకుని ఈ అద్భుతం సృష్టించాడు. 2012వ సంవత్సరంలో గిన్నిస్ బుక్కులోకెక్కాడు. ఇలా చర్మాన్ని సాగదీయడం వల్ల తనకేమీ బాధ కలగదనీ, అయితే వ్యాధి వల్ల వస్తున్న ఇతర కష్టాలే ఎక్కువనీ చెబుతున్నాడు.

### 3. ఏకంగా 4,225 కుట్లు..

ముక్కుకు ముక్కెర పెట్టుకున్న చిన్నదానా.. అనే పాట వినే ఉంటారు. చెవిదిద్దులు, ముక్కెరలు, మెడలో గొలుసు ఇవి మగువ అందాన్ని మరింత పెంచేవి. ముక్కెరలు, దిద్దుల మీద మనసు పడిందో లేక వెరైటీగా కనిపించాలనుకుందో ఏమో కానీ బ్రెజిల్‌కు చెందిన ఎలైనే డేవిడ్‌సన్ అనే మహిళ ముఖంపై ఒకటి కాదు రెండు కాదు ఏకంగా 4,225 కుట్లు వేయించుకుని, వాటిల్లో విభిన్న ఆకృతులున్న ఆభరణాలను పెట్టుకుంది. 1997వ సంవత్సరం జనవరి నుంచి మొదలుకుని 2006వ సంవత్సరం జూన్ వరకూ ఈ అరుదైన ఫీట్‌ను సాధించింది. గతంలో రెస్టారెంట్ నడిపిన ఈమె.. ఆ తర్వాత ఈ వింత కళను విజయవంతంగా సాధించి 2000వ సంవత్సరంలో గిన్నిస్‌బుక్ రికార్డు నెలకొల్పింది. ఈమెతో ఫోటోలు దిగేందుకు ప్రేక్షకులు ఎగబడతారంటే అతిశయోక్తి కాదు. విభిన్న డిజైన్లతో టాటూలు వేయించుకోవడం, స్టైలిష్‌గా హెయిర్‌స్టైల్స్ వేసుకోవడం, ముఖంపై వింత వింత ఆకారాలు కన్పించేలా చేయడం.. ఇలా అన్నింటిలోనూ వారెవ్వా అనిపిస్తుందీమె.

### 4. అసలవి పళ్లేనా?!

ఓ మనిషి తన పళ్లతో బల్లను పైకి లేపాడు. ఆ బల్లపై ఓ యువతి ఎంతో పొందికగా కూర్చుని ఉంది. బల్ల బరువు, దాదాపు పాతికేళ్ల పైనే వయసున్న యువతి బరువును పళ్లతోనే మోస్తున్నాడీ వ్యక్తి. ఇలా మోయడమే కష్టం అనుకుంటే దాదాపు 38.8 అడుగుల దూరం నడిచాడు కూడా. యూరప్‌లోని లజ్జెం




బర్గ్ దేశానికి చెందిన జార్జెస్ క్రిస్టీన్ అనే వ్యక్తి చేసిన అరుదైన ఫీట్ ఇది. ఇలాంటివి ఒకటా రెండా.. ఏకంగా 23 గిన్నిస్‌బుక్ రికార్డులు సాధించాడు జార్జెస్. రైలును ముందుకు నెట్టడం, విమానాన్ని వెనక్కు లాగడం.. వంటి రికార్డులెన్నో ఆయన సొంతం.

### 5. తలచుకుంటేనే భయం భయం

ముక్కులోకి చిన్న దోమనో, కీటకమో దూరితేనే నానా ఇబ్బందులు పడుతుంటాం. ఆ కీటకం బయటకు వచ్చేంతవరకూ పడే తంటాలు అన్నీ ఇన్నీ కావు. అలాంటిది రెండు ఇనుప తీగలు ముక్కు రెండు రంధ్రాల్లోకి దూర్చి, నోటిలోనుంచి బయటకు తీస్తే! ఊహించుకుంటేనే భయం పుడుతోంది కదూ.. కానీ ఓ వ్యక్తి మాత్రం ఈ అరుదైన ఫీట్ సులభంగా చేసేస్తాడు. అతడే అమెరికాకు చెందిన ఆండ్రూ స్టాంటన్. అత్యంత పొడవైన మెటల్ తీగను ముక్కులో దూర్చి నోటి ద్వారా బయటకు తీసుకు రాగల వ్యక్తిగా గిన్నిస్ బుక్ రికార్డులకెక్కాడు. 2012వ సంవత్సరంలో మార్చి 31న ఇటలీలోని రోమ్ నగరంలో ఈ ఫీట్‌ను ప్రదర్శించాడు. మొత్తం 3.63 మీటర్ల తీగను ముక్కులో దూర్చుకుని నోటి ద్వారా బయటకు తెచ్చాడు. అతడు చేయగలిగాడని ఈ ఫీట్‌ను ఇంటి వద్ద ఎవరూ ప్రయత్నించేందుకు సాహసించకండి సుమా..

### 6. చెట్టు వేర్లను తలపించే గోర్లు

చేతికి, కాలికి ఉండే గోర్లు కాసింత పెరిగితేనే చికాకుగా ఉంటుంది. అనుకోకుండా ఎవరికైనా గుచ్చుకుంటే రక్తం కళ్ల చూడాల్సిందే. అందులోనూ విషపూరితం అంటుంటారు కూడా. సహజంగా మహిళలకు గోర్లు పెంచుకునే అలవాటు ఉంటుంది. ఆ అలవాటు కాస్తా పిచ్చిగా మారిందో ఏమో కానీ అమెరికాకు చెందిన లీ రెడ్‌మాండ్ అనే మహిళ చేతి గోర్లు పెంచుకుంటూనే ఉండిపోయింది. అలా ఒకటి కాదు రెండు కాదు ఏకంగా 30 ఏళ్ల పాటు అలా పెంచుతూనే ఉంది. తిండి దగ్గర నుంచి స్నానం వరకూ అనేక ఇబ్బందులు పడుతున్నా గోర్లపై ప్రేమతో వాటిని తీసేయడానికి ఏ మాత్రం ఇష్టపడలేదు. అలా 28 అడుగుల 4.5 ఇంచుల(8.65 మీటర్లు) పొడవు వచ్చేంతవరకూ గోర్లను పెంచుకుంది. అలా మొత్తం మీద 2008వ సంవత్సరం ఫిబ్రవరి 23న పొడవైన గోర్లు ఉన్న మహిళగా గిన్నిస్‌బుక్కులో కెక్కింది. అనుకోకుండా 2009లో జరిగిన ఓ ప్రమాదంలో ఈ చేతి గోర్లను రెడ్‌మాండ్ కోల్పోయింది. అంతటితో ఆమె గోర్ల పెంపకం ఆగిపోయిందన్నమాట.

### 7. ముఖంపై నిండా జుట్టున్నా..

తలపై జుట్టు కాస్త ఎక్కువైతేనే తెగ ఇదై పోతుంటాం. చికాకు పడుతుంటాం. ఇక మగవాళ్లకు గడ్డం ఎక్కువైతే ఎక్కడలేని కోపం అంతా వారిలోనే ఉంటుంది. అలాంటిది ప్రపంచంలో ఎక్కడా లేని విధంగా ముఖంపై జుట్టు ఉన్నవాళ్లను చూశారా..? ఇదిగో ఈ ఫోటోలో ఉన్న కుటుంబ సభ్యులు ఈ కోవకు చెందినవారే. మెక్సికోలోని విక్టర్ లారీ గోమెజ్, గాబ్రియెల్ డానీ రోమోస్ గోమెజ్ దంపతులకు, వారి పిల్లలకు 'కంజెనిటల్ జనరలైజ్‌డ్ హైపర్‌ట్రైకోసిస్' అనే అరుదైన వ్యాధి లక్షణాల వల్ల ఈ వింత పరిస్థితులను ఎదుర్కొంటున్నారు. 98 శాతం శరీర భాగాల్లో జుట్టును కలిగి ఉన్న విలక్షణ వ్యక్తులుగా 'గిన్నిస్‌బుక్ రికార్డ్స్' గుర్తించింది. తమ లోపాన్నే ప్లస్ పాయింట్‌గా మార్చుకుని మెక్సికన్ నేషనల్ సర్కస్ కంపెనీలో భార్యాభర్తలిద్దరూ ప్రదర్శనలు ఇస్తున్నారు.

### 8. నేనేమీ తక్కువ కాదు

ఏంటీ... ఎంతసేపూ మీ మనుషులు చేసే గొప్పలు, వింతలే చెప్పుకుంటారా? మేమేమైనా మీకంటే తక్కువా? విలక్షణత్వంలో మీకంటే మేం ఏమాత్రం తీసిపోం.. అంటోందో శునకం. టెక్సాస్‌లోని అవోండలే హాస్పిటల్ జంతు క్లినిక్‌లో ఉండే పుగ్గీ అనే ఓ శునకం.. గిన్నిస్ బుక్ రికార్డ్స్‌ను ఆకర్షించింది. ప్రపంచంలో అత్యంత పొడవైన నాలుక ఉన్న జీవిగా ఈ పుగ్గీ చూపరులను ఆకట్టుకుంటోంది. దాదాపు 4.5 ఇంచుల పొడవైన నాలుకతో తొమ్మిదేళ్ల వయసున్నప్పుడు 2009వ సంవత్సరం, మే నెలలో పుగ్గీ గిన్నిస్‌బుక్ రికార్డుల్లోకి ఎక్కేసింది.

–కె. హసాన్

kandula.hassan@gmail.com



# బందరిల్లు

## మానస

**"ఒరేయ్ గోపీ... నువ్వు నాకో అర్జెంటు సాయం చేసి పెట్టాలిరా. నా పేరనున్న మన బందరిల్లు అమ్మేసి... ఖర్చులూ... టాక్సులూ పోను మిగతా దాంట్లో సగం అమ్మానాన్నల పేర నీకు నచ్చిన ధార్మిక సంస్థలకీ.. గుళ్ళకీ విరాళాలుగా ఇచ్చి... మిగతా సగం బ్యాంకు డ్రాఫ్ట్ తీసుకుని నాకు పంపించు. నా వయసు, సహకరించని నా ఆరోగ్య పరిస్థితి దృష్ట్యా నేను ఇండియా రాలేక, నీకు అమెరికా నుంచి పవరాఫ్ అటార్నీ ఇస్తున్నాను. శ్రమే, కానీ తప్పనిసరి పరిస్థితుల్లో నిన్ను ఇబ్బంది పెడుతున్నానురా గోపీ!" కొరియర్లో వచ్చిన ఆ పెద్ద కవర్లో ఆ చిన్న ఉత్తరం.. నా పేర మా పెద్దన్నయ్య రాంబాబు ఇచ్చిన పవరాఫ్ అటార్నీ... ఇంటి దస్తావేజులూ... ఇల్లు అమ్మకానికి అవసరమైన మిగిలిన కాగితాలూ ఉన్నాయి.**

రాంబాబు ఉత్తరం నన్ను యాభై ఏళ్ళు వెనక్కి తీసికెళ్ళిపోయింది.

***

'బందరిల్లు' నా పేర ఉన్నా.. అది మన ఇల్లురా... మన అందరి ఇల్లు' యాభై ఏళ్ళ క్రితం రాంబాబుది అదే మాట.. ఇవాళా అదేమాట. మా ఆరుగురు అన్నదమ్ముల్నీ.. ముగ్గురు అక్కచెల్లెళ్ళనీ అమ్మానాన్నా కని, పెంచి... పెద్దచేసిన తరువాతే... అప్పుచేసి రాంబాబు కొనగా మా అందరికీ సొంత ఇంట్లో ఉండే అవకాశం.... అదృష్టం కలిగింది.

చదువులూ... ఉద్యోగాలూ.. ఆడపిల్లలు పెళ్ళిళ్ళై అత్తారింటికి వెళ్ళిపోవడం... కొన్నాళ్ళు నేనూ... ఆ తర్వాత... నా తర్వాత తమ్ముడూ చాలాకాలం అమ్మానాన్నలని కనిపెట్టుకుని బందర్లో ఉన్నాం. వాళ్ళ టైమొచ్చి... అమ్మానాన్న దర్జాగా సొంత ఇంట్లోంచే స్వర్గస్తులయ్యారు.

యాభైఏళ్ళ క్రితం బందర్లో ఈ ఇల్లు కొనే టైముకి మూడునాలుగేళ్ళ ముందే రాంబాబు అమెరికా వెళ్ళిపోయాడు. అప్పుడు నేను విశాఖపట్నంలో బ్యాంకులో ఉద్యోగం చేస్తుండేవాడిని.

అమ్మానాన్నా... తమ్ముళ్ళూ, చెల్లాయీ నా దగ్గరే అద్దె ఇంట్లో ఉండేవారు. రాంబాబూ... వదినా వాళ్ళ చిన్నపాపాయి అమెరికా నుంచి మొదటిసారి విశాఖ పట్నం వచ్చారు. రెండు నెలలు మా అందరితో కాలక్షేపం చేసి.. రాంబాబు తిరిగి అమెరికా వెళ్ళిపోయే రెండు వారాల ముందు బందర్లో దాదాపు సరికొత్తదైన ఈ ఇల్లు కొన్నాడు.

అమ్మా... నాన్నా.. తమ్ముళ్ళు... చెల్లాయీ అంతా విశాఖపట్నం నుంచి బందరు షిఫ్ట్ అయిపోయారు. గృహప్రవేశానికి వెళ్ళిన నేను కొత్త ఇంట్లో సామాన్లన్నీ సర్ది... మా కుటుంబ సభ్యులందరితో, ముఖ్యంగా రాంబాబు, వదినా.. వాళ్ళ పాపాయితో ఆ రెండు వారాలూ చాలా హాయిగా గడిపి... మళ్ళీ విశాఖ పట్నం వచ్చేశాను. అప్పటికింకా నాకు పెళ్ళి అవలేదు కాబట్టి మేము అద్దెకున్న పోర్షన్ ఖాళీ చేసేసి... అదే ఇంట్లో ఓ చిన్న రూము అద్దెకు తీసు



# నవ్యవీక్లి-ఉపాధ్యాయుల భాస్కరరావు స్మృతి సాహితి కథల పోటీలో విశేష బహుమతి రూ.5,000 పొందిన కథ

కున్నాను.

మొదట్లో నెలకీ... రెండు నెలలకీ.. పండగలకీ బందరు వెళ్ళొస్తుండేవాడిని. అమ్మా నాన్నల్ని చూడ్డానికీ, అక్కడి ఇంటికి కావలసినవి చిన్నా చితకా సమకూర్చడానికీ బందరు ట్రాన్స్‌ఫర్ పెట్టుకున్నాను. అలా బందరూ... విశాఖపట్నం తిరుగుళ్ళకి హైరానా.. బస్సు రైలు అనవసర ఖర్చులు అవుతున్నాయని చాలా డిమాండ్ ఉన్న మా బందరు బ్రాంచి ట్రాన్స్‌ఫర్‌కోసం మధ్యమధ్యలో హైదరాబాద్ మా హెడ్డాఫీసుకి వెళ్ళి తెలిసిన వాళ్ళనీ, పై అధికారుల్నీ ప్రాధేయపడి అభ్యర్థిస్తుండేవాడిని.

మూడేళ్ళు గడిచిన తర్వాత మానసతో విశాఖపట్నంలోనే నా పెళ్ళైంది. సరిగ్గా నా పెళ్ళి రోజునే బందరు ట్రాన్స్‌ఫర్ అయినట్టు ఆర్డర్స్ వచ్చాయి.

నేనూ, మా ఆవిడా తిరుపతి వెళ్ళొచ్చాం. మళ్ళీ వైజాగ్‌లోనే డ్యూటీలో జాయినై ట్రాన్స్‌ఫర్ మీద బందరు వెళ్ళడానికి రిలీవింగ్ ఆర్డర్సు తీసుకున్నాను. అప్పటికే మా వైజాగ్ ఆఫీసు స్టాఫ్‌తో కలిసి అక్కడ కోపరేటివ్ హౌసింగ్‌స్కీమ్‌లో చేరి ఇల్లు కోసం మూడొందలు కట్టి ఉన్నాను. మిత్రులు వద్దని వారిస్తున్నా ఆ మెంబర్‌షిప్ రద్దు చేసుకుని రెండు వందల యాభై తిరిగి తీసేసుకున్నాను. సొంత ఇంటికోసం అలాంటి స్కీమ్‌లో బందర్లో జేర్తానని వాళ్ళకి సర్దిచెప్పి నాకు నేను సమాధానపరచుకుని, బందరు చేరుకున్నాను.

మొదట్లో కొన్నాళ్ళు బాగానే ఉంది. మా నాన్న గారి పెన్షన్‌తో పాటు, మా అన్నయ్య నెలనెలా పంపేదాంతో గుడివాడలో ఉండే మా తమ్ముడు ఆదుకునేదాంతో కుటుంబాన్ని ఎలాగో లాగేవాడిని. మళ్ళీ మా పెద్దన్నయ్య రాంబాబు.. వదినా.. పాపాయి వచ్చినప్పుడు తరచూ అందరం కలిసినప్పుడు ఎంతో ఆనందంగా ఉన్నాం. కానీ కుటుంబాన్ని నెట్టుకు రావడంలో చాలా సాధక బాధకాలు చవిచూశాను. కాలేజీల్లోనూ, యూనివర్సిటీల్లోనూ చదువుకునే తమ్ముళ్ళ ఖర్చులొకరకంగా ఉండేవి. అక్కయ్యలు పురిటికి వస్తున్నప్పుడూ. శుభకార్యాలకీ కనపడని ఖర్చులు చెయ్యాల్సొచ్చేది. 'ఇంటికీ ఒంటికీ ఎప్పుడూ చేస్తుండాలి నాయనా' అని అమ్మ అంటూ ఉండేది. బోరింగు పాడైపోవడం, నీళ్ళ మోటారు ఆగిపోవడం, సెప్టిక్ ట్యాంకు నిండిపోవడం... ఇలాంటివాటికోసం పైకం ఉండేదికాదు. అనుకోకుండా ఇంత ఖర్చైందని మా అన్నయ్యలకి చెప్పడానికి నాకు మొహమాటంగా ఉండేది. భరించేవాణ్ణి.

వైజాగ్‌లో కోపరేటివ్ హౌసింగ్ సొసైటీ వదులుకుని బందర్లో చేరదామనుకున్నవాణ్ణి అలాంటి హౌసింగ్ సొసైటీలో కాకుండా, కేవలం చేబదులుగా అప్పులిచ్చే కోపరేటివ్ క్రెడిట్ సొసైటీలో చేరి, కుటుంబ ఖర్చుల కోసం, అత్యవసరాల కోసం అప్పులు తీసుకునేవాణ్ణి. అమ్మావాళ్ళకి తెలీకుండా మానస నగలు బ్యాంకులోపెట్టి లోన్లు తీసుకునేవాడిని. మానస ఎప్పుడూ కాదనేది కాదు. మానసకి బందరు నీళ్ళు పడలేదు. తరచు వైజాగ్ వెళ్ళేది. వైజాగ్‌లో నాతో పాటే బ్యాంకులో జేరిన నా మిత్రబృందం చిన్నచిన్న సంసారాలతో వాళ్ళు విడివిడిగా ఉండడం మానస మనసుకి నచ్చింది. తన అన్నయ్యలూ, మా అన్నయ్యలు కూడా అలా విడివిడిగా ఎలా ఉన్నారో అలా ఉంటే బాగుంటుంది కదా, 'మనం వేరే ఊరు ట్రాన్స్‌ఫర్ చేయించుకుని వెళ్ళిపోదామా' అని అడిగింది.

అప్పుడు గుడివాడలో ఉండే మా తమ్ముడూ నేనూ మ్యూచ్యువల్ ట్రాన్స్‌ఫర్ పెట్టుకుని నేను గుడివాడా, వాడూ బందరూ మారిపోయాం. మేమిద్దరం ఒకే బ్యాంకులో పని చేస్తుండడం వల్ల ఇది సాధ్యపడింది.

***

బందరు ఇల్లుతో పోల్చుకుంటే గుడివాడలో మేమున్నది అతి చిన్న ఇల్లు. కానీ స్వతంత్రంగా తన సంసారాన్ని తీర్చిదిద్దుకునే క్రమంలో మానసకి అది అతిపెద్ద బంగళా లాగానే అనిపించింది. అది అంతమటుకే. పదిహేను రోజులకో, నెలకో, మా అక్కయ్యలూ, అన్నయ్యలూ వచ్చినప్పుడో, నేనూ మానసా, మా అమ్మాయి బందరింటికివెళ్ళి అమ్మా నాన్న, తమ్ముళ్ళు, చెల్లాయినీ చూసొచ్చేవాళ్ళం. నాకు గుడివాడ నుంచి ఆఫీసురుగా ప్రమోషన్ మీద హైదరాబాద్ ట్రాన్స్‌ఫరైంది. ఎంప్లాయీస్ కోపరేటివ్ హౌసింగ్‌సొసైటీలో ఇల్లు అనే కోరిక... అదృష్టం నాకు గుడివాడలో కూడా కలిసి రాలేదు. హైదరాబాద్‌లో మాకు రెండోఅమ్మాయి పుట్టింది. అప్పుడప్పుడు అమ్మానాన్న బందరునుంచి నా దగ్గరకు వచ్చేవారు. హైదరాబాద్‌లోనే ఉన్న మా రెండో



అన్నయ్య ఇంటికీ, మాఇద్దరి అక్కయ్యల దగ్గరకీ వెళ్ళొస్తుండేవారు.

హైదరాబాద్‌లో ఐదారేళ్ళున్నా, ఎంప్లాయీస్ హౌసింగ్ సొసైటీలు రెండిటిలో ఒకదాని తరువాత ఒక దాంట్లో సభ్యత్వం తీసుకోగలిగినా మొదటి నుంచీ గాడితప్పిన నా ఆర్థిక పరిస్థితి వల్ల ఇంటి కోసం బ్యాంకు ఇచ్చే లోనుగాక నా వంతు నేను కట్టాల్సిన డబ్బు లేక మధ్యలోనే విరమించుకుని సభ్యత్వం రద్దు చేసుకున్నాను. లక్ష రూపాయలకే మంచి ప్లాట్స్ దొరికే రోజుల్లో కూడా పాతికవేలు తక్కువయ్యేవి. ఈసారి ఎలాగైనా కష్టపడి సొంత ఇల్లు కోరిక తీర్చుకోవాలనుకున్నాను. దానికి తగ్గట్టే మరో బ్రాంచి వాళ్ళు మొదలెట్టిన హౌసింగ్ సొసైటీలో జాయినవడానికి అవకాశం వచ్చింది.

ఐదొందలు కట్టాను. మిగతా కట్టబోయే సొమ్ము గురించి ఆలోచిస్తున్నాను. ఇంతలోనే హౌసింగ్ సొసైటీవారు ఒక మంచి స్థలం చూసి, నిర్ణయించి ఐదేసి వేలు అర్జెంటుగా కట్టమని నోటీసులు పంపించారు. గగుర్పాటు కలిగింది. ఇంతలో నాకు మళ్ళీ విశాఖపట్నం ట్రాన్స్‌ఫర్ అయిందని ఆర్డర్సు వచ్చాయి. గొప్ప రిలీఫ్ ఫీలై సొసైటీ సభ్యత్వం వెంటనే రద్దు చేసుకుంటున్నట్టు ఉత్తరం రాసి వైజాగ్ వెళ్ళిపోయాను.

'మీ దగ్గరిప్పుడు ఐదు వేలు లేకపోతే నేను కడతాను. ఉన్నప్పుడు ఇద్దురు గాని. అంతేకానీ సొసైటీ నుంచి మాత్రం విత్‌డ్రా అవకండి గోపాల్ గారూ..ప్లీజ్ అంటూ హైదరాబాద్ నుంచి ఫోన్ చేశాడు నా మిత్రుడు హౌసింగ్ సొసైటీ సెక్రటరీ సూర్యనారాయణ.

'థాంక్యూ సూర్యనారాయణగారూ, మీ ఔదార్యానికి చాలా థాంక్స్. ఇప్పుడు మీరు కట్టినా త్వరలో మీకు తిరిగి ఇవ్వలేను. మళ్ళీమళ్ళీ కట్టలేను. నాది కొంచెం వీక్ ఫైనాన్షియల్ పొజిషను.

**సంపాదించినదాంట్లో సమాజానికి సాయం చెయ్యాలని మనం కోరుకుంటాం . కానీ ఆ సహాయం సద్వినియోగమవుతోందో లేదో అనే దిగులు మనకు ఉంటుంది. నిజమైన అర్హులకు మన కష్టం చేయూతగా నిలిచిందా లేదా అనే సందేహాలు మనల్ని చుట్టుముడతాయి. ఈ రోజులు అలాంటివి. మరి ఈ కథలో అన్నదమ్ములు అనాథలకు, పేదలకు సహాయం చెయ్యడానికి ఎలాంటి ఆలోచన చేశారు ?**

నా సభ్యత్వం రద్దు చేసుకుంటున్నాను. నాకు తిరిగి వచ్చేదేదైనా ఉంటే పంపండి. ఈ అవకాశం మరొకరికి ఇవ్వండి' అంటూ ఫోను పెట్టేశాను.

వైజాగ్ చేరిన తర్వాత అనుకోకుండా ఆశాజనకంగా మరో ఛాన్సు తగిలింది. కాకినాడ హౌసింగ్ సొసైటీలో నాకు మెంబర్‌షిప్ ఇచ్చారు అక్కడి ఫ్రెండ్సు. రీజినల్ ఆఫీసులో స్టాఫ్ పోస్టింగ్స్ చూసే డిపార్ట్‌మెంట్‌లో నేను ఉండడంవల్ల వాళ్ళకి ఉపయోగకరంగా ఉంటానని నాకా అవకాశం ఇచ్చారు. డబ్బు కట్టడానికి స్పెషల్‌గా చాలా చాలా టైమ్ ఇచ్చారుగానీ, నిలబెట్టుకోలేకపోయాను. సొసైటీ వాళ్ళు చివరిసారిగా డిమాండ్ చేసిన ఐదువేలు కట్టలేక ఏది ఎక్కడ రాసిపెట్టి ఉంటే అది అక్కడ అవుతుందనుకున్నాను. వైజాగ్‌లో రెండున్నర లక్షలకి ఫ్లాట్ చూశాను. మళ్ళీ మామూలే, బ్యాంకు లోనుతో సహా అన్నీ కలుపుకున్నా ముప్పై నలభై వేలు తగ్గాయి. కానీ ఆ టైములో మా పెద్దన్నయ్య రాంబాబు అమెరికానుంచి వచ్చాడు. తను అమెరికా వెళ్ళకముందు తీసుకున్న ఎల్ఐసీ పాలసీ పాతికేళ్ళకి మెచ్యూరై ముప్పై ఐదువేలు వచ్చింది. 'తీసుకోరా గోపీ' అంటూ నాకిచ్చాడు. దాంతో నా ఇంటి కల నెరవేరింది. అలా ఇరవైఏళ్ళ ప్రయత్నంలో వైజాగ్‌లో ఓ టూ బెడ్రూమ్ ఫ్లాట్ కొన్నాను.

అది సుమారు ముప్పై ఏళ్ళ క్రితం సంగతి.

***

ఆ టైముకి వైజాగ్‌లో నాతో ఉద్యోగంలో చేరిన వాళ్ళు పదిహేనిరవై ఏళ్ళ క్రితమే కొనుక్కుని కట్టుకున్న ఇళ్ళకి మూడొంతులు అప్పులు తీరిపోయి, వారి వారి సేవింగ్స్‌తో ఇళ్ళమీద వచ్చిన అద్దెలతో ఒకటీ రెండూ అంతస్తులు వేసుకున్నారు. వైజాగ్ కూడా గొప్పగా అభివృద్ధి చెంది ధరలు విపరీతంగా పెరగడంతో ఆ ఇళ్ళన్నిటికీ చాలాచాలా గొప్ప రేట్లు పలికాయి.

***

వైజాగ్‌లో ఆ చుట్టుపక్కల రెండో దఫాగా ఏడెనిమిదేళ్ళు పనిచేసిన తర్వాత నాకు ఫైనల్‌గా మళ్ళీ హైదరాబాద్ ట్రాన్స్‌ఫర్ అయింది. అప్పటికి మా పెద్దమ్మాయికి అమెరికా సంబంధం చేశాం. మా వియ్యంకుడు హైదరాబాద్‌లో సెటిలయ్యారు. వైజాగ్‌లో ఇంజనీరింగ్ చదివే మా రెండో అమ్మాయిని హాస్టల్లోపెట్టి, నేనూ మానసా హైదరాబాద్ వెళ్ళిపోయాం. రెండో అమ్మాయికి కూడా పెళ్ళి సంబంధం కుదిరింది. అబ్బాయి అమెరికా. అతగాడి తల్లిదండ్రులు కూడా హైదరాబాద్‌లోనే సెటిలయ్యారు.

అమ్మాయిలిద్దరి అత్తవార్లూ హైదరాబాద్‌లోనే సెటిలై ఉండడంవల్ల ఎప్పుడైనా పిల్లలు అమెరికా నుంచి వస్తే అప్పటికి మేమూ హైదరాబాద్‌లోనే ఉంటే, పిల్లలు హైదరాబాద్‌లోదిగి మళ్ళీ మా కోసం ఫ్లయిట్స్‌లో, రైళ్ళల్లో మాకోసం వచ్చే హైరానా తప్పుతుందని మేమూ హైదరాబాద్‌లోనే సెటిలవడానికి నిర్ణయించుకున్నాం. వైజాగ్‌లో రెండున్నర




## ఒక ప్రారంభం!!

జీవానికి నిర్జీవానికి మధ్యన రాలుతున్న క్షణాల్ని
కవితగా రాయాలని కథగా వినిపించాలని
మనసుపడిన తపనలో
జీవితం అక్షరాలుగా రాలుతోంది
పదాలు పేర్చుకోమంటూ
చాలాకాలం తరువాత
నా ముఖం నన్ను కొత్తగా పరిచయం చేస్తోంది
పసిదనం పసిడితనం దాటుకుంటూ
యవ్వనం మిసిమిదనం రాల్చుకుంటూ
కాలం జల్లెడలో కసిగా జారిపోతూ
నామీద నేనే యుద్ధం చేసుకుంటున్నాననేమో
గాయాలు శకలాలుగా



గేయాలు అల్లమంటున్నాయి

కొత్తపదాలు కనిపెడదామంటే అన్నీ అస్పష్టాలే
బతుకంతా అపరిచితంగా పరిచయిస్తూ
వెంటపడుతోంది
ఇతివృత్తం నేనే కనుక వాక్యాలన్నీ
కవాతుచేస్తున్నాయి
మది తలుపులు తీయగానే పాతవాసనలు
పలకరించి మరీ పొగబెడుతున్నాయి
అవసరాలు ఆత్మీయతల మూతిని బిగించి కట్టాయి
సంఘర్షణలో సతమతమవుతూ
బంధాలు బద్ధలైన శబ్దం
ఆరాటాలు పోరాటాలు
వ్యామోహాలు వ్యాకులతలు
కవితనుండి సమూలంగా విదిలించి కొట్టేసానేమో

కొత్తమార్గంలో సరికొత్తకోణంలో
చుట్టూ గోడకట్టుకుని
మారిన మనసుతో
కొల్లగొట్టేవీ కుళ్లబొడిచేవీ లేవనగానే
భావం కిలకిలా నవ్వింది
కథనమంతా కలహంసలా కదిలింది
ఖాళీలన్నీ నింపుకుంటూ

మెలిదిరిగిన జీవితంతో
మలుపులు తిరిగేకాలంలో
కవిత కురవాలంటే
జీవితం చిక్కుముడులన్నీ విప్పాల్సిందే

**—లాస్యప్రియ కుప్పా**
**సెల్: 96405 51664**

## భయపెట్టిన బాక్సింగ్ పిల్ల

**ఓ** పక్క బాక్సింగ్‌తో ‘గురు’లో అదరగొడితే, మరోపక్క దయ్యంగా ‘శివలింగ’లో ప్రేక్షకులను భయపెట్టింది అంటున్నారు సినీ జనాలు. ఈ పాటికే ఈ పిల్ల ఎవరో అర్థమైపోయి ఉంటుంది. ఆ పిల్ల ఎవరో కాదు, రితికా సింగ్! తెలుగులో పెద్ద హీరోయిన్ అయిపోవాలని కలలు కంటున్న రితికాకు ‘శివలింగ’ మంచి బ్రేక్ ఇస్తుందని జోస్యం చెబుతున్నారు సినీ పండితులు. ఈ సినిమాలో రితికా నటనే హైలైట్ అంటున్నారు. గతంలో లారెన్స్ సినిమాలో చేసిన లక్ష్మీరాయ్, తాప్సీల కన్నా కూడా రితికా చాలా బాగా చేసిందని మెచ్చుకుంటున్నారు. పై ఇద్దరికీ లారెన్స్ సినిమాలతోనే మంచి గుర్తింపు లభించింది. ఇప్పుడు రితికా సింగ్‌కి కూడా అంత కన్నా ఎక్కువ గుర్తింపే లభిస్తోందట!



లక్షలు పెట్టి కొన్న ఫ్లాట్‌కి కొంచెం ధర పలకగా ఐదులక్షలకి మా బంధువుల అమ్మాయికి అమ్మేశాను. హైదరాబాద్‌లో మళ్ళీ లోను తీసుకుని పది లక్షల్లో ఓ టూ  బెడ్రూమ్ ఫ్లాట్ కొన్నాను.

మిగిలిపోయిన ఏడేళ్ళ సర్వీసు హైదరాబాద్‌లోనే గడిపాను.

ఆ తర్వాత రిటైరైన నాలుగేళ్ళు కూడా ఆ ఫ్లాట్‌లోనే గడిపాను. పిల్లలూ మనవలూ వస్తున్నప్పుడు ఇరుకుగా ఉందని ఆ ఫ్లాట్ ఇరవై లక్షలకి అమ్మేసి, వార్ధక్యంలో చేదోడు వాదోడుగా కూడా ఉంటాడని మా బావమరిది ఇంటికి దగ్గర్లో నా రిటైర్మెంట్ డబ్బు కూడా కలిపి నలభై లక్షలకి ఓ విశాలమైన త్రీ బెడ్ రూమ్ ఫ్లాట్ కొన్నాను ఐదు సంవత్సరాల తర్వాత ఇప్పుడు దాని ఖరీదు సుమారు యాభై లక్షలు.

వైజాగ్‌లో పదిహేనేళ్ళ క్రితం నేను ఐదు లక్షలకి అమ్మేసిన ఫ్లాట్ ఖరీదు ఇప్పుడు ముప్ఫై లక్షలు.

సాధారణమైన నా సహోద్యోగులు నలుగురి లాగా, సరైన టైమ్‌లో వైజాగ్‌లోనో, బందర్లోనో, గుడివాడలోనో, హైదరాబాద్‌లోనో, కాకినాడలోనో యాభైవేల నుంచి రెండులక్షల లోపు నేను కొనలేక వదిలేసిన ఇళ్ళన్నీ ఇవాళ కోట్ల రూపాయలు విలువ చేస్తున్నాయి. కొన్ని డెవలప్‌మెంట్‌కి ఇవ్వబడి ఫ్లాట్స్‌గా మారి మరింత ఐశ్వర్యాన్ని తెచ్చిపెట్టాయి నా మిత్రులకి. నా సహోద్యోగులకి దక్కిన ఐశ్వర్యం చూసి అసూయపడటం లేదు నేను. భగవంతుడి దయవల్ల మంచి అల్లుళ్ళ రూపంలో అంతకు మించిన ఐశ్వర్యమే దక్కింది నాకు. నా బాధా వెలితీ ఒక్కటే, పిల్లలు పెళ్ళిళ్ళై అమెరికా వెళ్ళిపోయారు. మేము అప్పుడప్పుడు వెళ్ళొస్తున్నా, పిల్లలు వచ్చివెళ్తున్నా మేము అక్కడ స్థిరపడలేము. స్థిరపడము. పిల్లలు ఇక్కడికి రాలేరు, రారు!

మా అన్నదమ్ములంతా ఉద్యోగరీత్యా బతుకు తెరువు రీత్యా తలో చోటకీ వెళ్ళిపోయారు. మా బావమరిది కూడా అమెరికాలో తన పిల్లల దగ్గర కెళ్ళి గ్రీన్ కార్డూ, దరిమిలా అక్కడి పౌరసత్వం కోసం ప్రయత్నాలు చేస్తూ ఎక్కువగా అక్కడే ఉండిపోతున్నాడు. ఇంచుమించు నేనూ మానసా ఒంటరివాళ్ళమైపోయాం. ఆ ఒంటరితనం మరచిపోయేందుకు చుట్టాల్నీ, స్నేహితుల్నీ చూడ్డానికి అప్పుడప్పుడు వైజాగ్, కాకినాడ వెళ్తుంటాం. ఇప్పటికీ నన్ను ఎంతో అభిమానంగా చూసే ఒకప్పటి నా సహోద్యోగులంటే ఎంత ఇష్టమో అంత అసూయ నాకు. నా అసూయ వారివారి ఐశ్వర్యాలను, విపరీతంగా పెరిగిన వాళ్ళ ఇళ్ళ ఆస్తుల్ని చూసి. వారందరూ రిటైరైపోయారు. నాలా ముసలాళ్ళైపోయారు. వాళ్ళల్లో చాలామంది పిల్లలు అమెరికాలు, ఆస్ట్రేలియాలు వెళ్ళిపోయారు. కానీ, ఉద్యోగుల కోపరేటివ్ హౌసింగ్ కాలనీల్లో, ఇళ్ళు కట్టుకున్న నా స్నేహితులంతా ఒకేచోట ఉండి ఒకరి కొకరు సాయంగా ఉంటున్నారు. కలిసి కబుర్లు చెప్పుకుంటున్నారు.

కాలనీల్లోనే కట్టుకున్న గుళ్ళ దగ్గరో, పార్కుల్లోనో ప్రతి సాయంత్రం కాలక్షేపం చేస్తున్నారు. హాయిగా ఒకళ్ళకొకళ్ళు భరోసాగా దన్నుగా ఉంటున్నారు. సరిగ్గా ఈ ఐశ్వర్యాన్నే మిస్సయ్యాన్నేను. అదే అప్పుడప్పుడు నన్ను కృంగదీస్తూ ఉంటుంది. నేను బందరు వెళ్ళకముందో, లేక వెళ్ళిన తర్వాతైనా సరైన టైమ్‌లో నేనూ సొంతిల్లు గురించి శ్రద్ధ పెట్టి ఉంటే అన్ని ఈతిబాధల్తోపాటు మహా అయితే జస్ట్ అదీ ఒక ఈతిబాధ అయ్యుండేది. ఇప్పుడు పరిస్థితి మరోలా ఉండేది అనిపిస్తుంటుంది.

***

నేను గత పదిపన్నెండేళ్ళ నుంచి అమెరికా వెళ్ళినప్పుడల్లా మా పెద్దన్నయ్య రాంబాబుని తప్పకుండా కలుసుకుంటున్నాను. ఎప్పుడూ మా మాటల్లో బందరిల్లు ప్రస్తావన వస్తుంది. అక్కడ అమ్మానాన్నలతో మేమెంత సంతోషంగా గడిపామో తల్చుకుని ఆనందిస్తుంటాము. ‘ఆ ఇంటి మీద మనం ఎవరూ ఏదీ ఆశించవద్దు. మనకెవరికీ అక్కర్లేదు కూడా. అందుకే మనల్ని కనీ, పెంచీ తీర్చిదిద్దిన అమ్మానాన్నల పేర మన బందరిల్లు ఏదైనా అనాథాశ్రమానికో, వృద్ధాశ్రమానికో ఇచ్చేద్దామనుకుంటున్నానురా గోపీ! అంటాడు మా అన్నయ్య. ‘అవునయ్యా గోపాల్!’ అలా చేద్దాం, ప్లీజ్ నువ్వు ఈ విషయంలో తప్పక సహాయం చెయ్యాలి, అంటుంది మా వదిన.

‘చాలా సంతోషం. ఈ విషయంలో నేను చెయ్యాల్సిన సాయం తప్పకుండా చేస్తానని వాళ్ళకి మాటిచ్చి ఒక్క విషయం మాత్రం చెప్పాను’ అమ్మానాన్నల పేర మీరు ఇవ్వదల్చుకుంటే బందరిల్లు అమ్మేసి... ఆ వచ్చిన డబ్బుతో మీకు నచ్చిన ధార్మిక సంస్థకో, సంస్థలకో స్కూలు, కాలేజీకో ఇచ్చెయ్యండి. సక్రమంగా సద్వినియోగం అవుతుంది. అంతేగానీ ఎవరినో మేనేజరుగానో, రక్షకుడిగానో పెట్టి, అతగాడి చేతిలో ఇల్లు పెట్టి అనాథ శరణాలయమో, వృద్ధాశ్రమమో పెడితే అనుకున్న ఆశయం నెరవేరదు. సదరు రక్షకుడి స్వార్థ ప్రయోజనాలకే ఉపయోగపడిపోవచ్చు’ నా ఉద్దేశం చెప్పాను.

‘సరే, నువ్వు చెప్పిందీ బాగుందిరా గోపీ, అలాగే చేద్దాం. అమ్మానాన్నల పేరిట నలుగురికీ ఉపయోగపడే మంచిపని చెయ్యడమే మనకు ముఖ్యం’ అన్నారు మా అన్నయ్య, వదిన. ఐదారేళ్ళ క్రితం నేను అమెరికా వెళ్ళినప్పటినుంచీ ఆరోగ్యరీత్యా కదలేకపోయారు అన్నయ్య, వదినా...!

***

మా వదినగారి చెల్లెలు కూడా గత నలభై, నలభై ఐదు సంవత్సరాల నుంచీ అమెరికాలోనే ఉంది. ఆమె భర్తకి పక్షవాతం వచ్చి ఐదారేళ్ళుగా మంచం మీదే ఉన్నారు. ఉద్యోగం లేదు. ఉన్న కాస్త సంపాదనా వైద్యానికే ఖర్చై పోయింది. చాలా ఇబ్బందుల్లో

ఉన్నారు. వాళ్ళకున్న ఒక్కగానొక్క అమ్మాయి పెళ్ళై.. సంసారం ఒడిదుడుకుల్లో పడగా, విడిపోయి చిన్న ఉద్యోగం చేసుకుంటూ తన కూతుర్ని పోషించు కుంటోంది. 'ఏదో ఉడతాభక్తిగా మా మరదలికి సాయం చేస్తున్నాంగానీ, తల్చుకుంటే గుండె తరుక్కు పోతోందిరా గోపీ' అన్నాడు మా అన్నయ్య క్రింద టేడు నేను అమెరికా వెళ్ళినప్పుడు.

'రాంబాబూ, చారిటీ షుడ్ స్టార్ట్ ఫ్రంహోమ్ నువ్వు కొన్న బందరిల్లు అమ్మేసి మీ మరదలు కిచ్చేయ్. దైవికంగా వాళ్ళకి సాయం చేసినట్టౌతుంది' అన్నాను, మా అన్నయ్య విస్మయంగా చూశాడు నన్ను. అది అప్పుడు అమ్మానాన్నల పేర ఇండి యాలో నలుగురికీ పనికొచ్చేట్టు చెయ్యాలను కున్నాను కదరా' అన్నాడు.

'అవును రాంబాబు.. ఇప్పుడు అదేపని అమ్మా నాన్నల పేర ఇక్కడే చెయ్యి. ఎక్కడైతేనేం ఎవరికై తేనేం, పైనున్న అమ్మానాన్నలు సంతోషిస్తారు' అన్నాను కాస్త ఉద్వేగంగా. నా సూచనకీ, సలహాకీ మా అన్నయ్య, వదిన కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

'ఒరేయ్ గొప్ప ఐడియా ఇచ్చావురా గోపీ, కానీ ఒక్కటి మాత్రం నిజం. అందుకు నువ్వు కూడా ఒప్పుకు తీరాలి. లేకపోతే నాకు తీవ్ర అసంతృప్తి ఉంటుంది' అన్నాడు రాంబాబు.




'ఏమిటది రాంబాబూ?' అన్నాను.

'బందరిల్లుకి మంచిరేటు పలుకుతోందని చెప్పావు. చాలా సంతోషం. అందులో సగం మాత్రమే మా మరదలుకిస్తాను. మిగిలింది నేను అనుకు న్నట్టు ఇండియాలోనే అమ్మా నాన్నల పేర ధార్మిక కార్యక్రమాలకి ఖర్చు పెడతానురా!' అడ్డు చెప్పకు. ప్లీజ్' అన్నాడు.

'సరే... నీ ఇష్టం రాంబాబూ...' అన్నాను అన్న య్యతో.

***

ఇదిగో... ఇన్నాళ్ళకి మళ్ళీ ఈ ఉత్తరం. 'గోపీ.. నేను రాలేకపోతున్నా! ఇంటి దస్తావేజులూ, మిగతా కాగితాలూ, నీ పేర పవరాఫ్ అటార్నీ అన్నీ పంపిస్తున్నాను. నాకేం లెక్కలు చెప్పక్కర్లేదు, నా పేర ఉన్న బందరిల్లు అమ్మేసి, వచ్చిన దాంట్లో సగం నీకు నచ్చిన ధార్మిక సంస్థలకీ, గుళ్ళకీ ఇచ్చెయ్. మిగిలిన సగం నేను మా మరదలుకి ఇవ్వ డానికి వీలుగా నాకు బ్యాంకు డ్రాఫ్ట్ పంపించు' అని క్లుప్తంగా రాశాడు అన్నయ్య.

అసలు బందరిల్లు అమ్మేసి ధార్మిక సంస్థల కిచ్చేయ్ రాంబాబు అన్న ఒకనాటి సలహా నాదే అయినా, ఇల్లు అమ్మగా వచ్చిన డబ్బులో సగం అమ్మానాన్నల పేర నీకు నచ్చిన ధార్మికసంస్థలకీ, గుళ్ళకీ ఇచ్చెయ్‌రా గోపీ' అని రాంబాబు చాలా తేలిగ్గా రాసినా, నాకు ఎందుకో తేలిగ్గా అనిపించట్లే దిప్పుడు.

***

బందరిల్లు స్వార్థపరుల చేతుల్లో పడకుండా దాన్ని డబ్బుగా మార్చి ధార్మిక సంస్థలకీ గుళ్ళకీ ఇమ్మని ఆనాడు సలహా ఇచ్చానుగానీ, అయో గ్యులూ, స్వార్థపరులూ చాలామందే ఉన్నారని రాను రాను తెల్సుకున్నాను. అన్నీ అలాగే ఉంటాయని కాదుగానీ, ఆలయాలు, ధార్మిక సంస్థల్లోకూడా నిర్వాహకుల అవినీతి ప్రబలిపోయింది. 'అయ్యవారి నగలు కొట్టేయడం, మంగళ సూత్రాలతో సహా అమ్మవారి నగలు ఊడ్చెయ్యడం, అనాథలడొక్క మాడ్చడం, వృద్ధుల్ని హీనంగా, పనివాళ్ళుగా చూడటం లాంటి వార్తలు ఈ మధ్య మరీ నన్ను పట్టి పీడిం చడం మొదలెట్టాయి.

అప్పుడు నాకు అనిపించింది, అనాథలు కాక పోయినా ఆర్థికంగా చాలాచాలా ఇబ్బందుల్లో ఉన్న వాళ్ళు దాదాపు వృద్ధాశ్రమ పరిస్థితుల్లోనే మసలు తున్న పెద్దవాళ్ళు మా చుట్టాల్లోనూ, తెలిసిన వాళ్ళ లోనూ చాలామందే ఉన్నారు. ముఖ్యంగా అమ్మా నాన్నలతో అనుబంధమున్న కుటుంబాలూ,, వాళ్ళ దయనీయ పరిస్థితులూ నా కళ్ళ ముందు మెది లాయి.

రాంబాబుకి వెంటనే ఫోను చేశాను. అమ్మా నాన్నల పేర భగవంతుడికే ఇచ్చామనుకుని, అవస రాల్లో ఉన్న మన బంధుమిత్రులకే నేరుగా ఆర్థిక సాయం చెయ్యగలిగితే తద్వారా వాళ్ళ కళ్ళల్లో ఆనందం చూసి మనమూ ఆనందపడి ధన్యుల మవుదాం. ఆ డబ్బు పూర్తిగా సద్వినియోగం కావడం మనకళ్ళారాచూసి ఎనలేని తృప్తి పొందుదాం! ఆలో చించు. ఇంతకంటే ఏం కావాలి? దానికితోడు మరో మాట, ఎందుకో బందరిల్లు అనగానే దాంతో ముడి పడిన నా అనుబంధంతో పాటు, అనేక యదార్థ సంఘటనలు నా కళ్ళముందు మెదులుతూనే ఉంటాయి. నేను యాభైఏళ్ళుగా నష్టపోయిందీ, కోల్పోయిందీ వద్దన్నా గుర్తుకొచ్చేస్తూ ఉంటుంది. నిజానికి నాకు సుతారామూ నచ్చని విషయాలవి. అందుకే, ఎప్పటికప్పుడు వాటికి నో ఫుల్‌స్టాప్ పెట్టా లనుకుంటాను. అది కుదరకపోగా ఇన్నాళ్ళు కుటుంబం కోసం ఎంతో త్యాగం చేశానన్న ఫీలింగ్‌లో కూడా ఉంచుతున్నాయి నన్ను. కానీ ఉన్నట్టుండి ఫుల్‌స్టాప్ కుదిరింది దానికి. ఫుల్‌స్టాప్‌తో పాటు నా త్యాగానికి తగ్గ ఫలితం కూడా దక్కిందని మురిసి పోయే ఛాన్సొచ్చింది రాంబాబూ!

వెళ్ళాల్సిన వయసులో విహారయాత్రకి వెళ్ళలేక పోయినా, ఇప్పుడు ఈ వయసులో తీర్థయాత్రలు చెయ్యడానికి బందరింటి మీద వచ్చిన సొమ్ము లోంచి జస్ట్ నాకూ మానసకీ సరిపడా సొమ్ము కూడా కేటాయించు.. చాలు!' అన్నాను.

రాంబాబు వెంటనే మాట్లాడలేదు. కొన్ని క్షణాల తర్వాత 'గోపీ లైన్లో ఉన్నావా?' అని అడి గాడు. 'లైన్లోనే ఉన్నాను' అన్నాను.

'జీవితంలో ఎన్నో ఆటుపోట్లు ఎదురైనా అర్థ వంతమైన జీవితం పట్ల నీ అవగాహన, నువ్వు తీసుకున్న విధానం, అందులో నిమిడి ఉన్న ఆనందం, నీ బంధుప్రీతీ, నీ మాటలూ నాకు ఎన లేని తృప్తిని ఇచ్చాయిరా గోపీ! ఇంక ఏ మాత్రం ఆలస్యం చెయ్యకు. అలాగే చేసేయ్! డాక్టర్ల సల హాలూ భరోసాలతో శక్తినంతా కూడదీసుకుని నేనూ వదినా వచ్చే సంవత్సరం ఇండియావచ్చి మన బంధుమిత్రులందర్నీ కలుస్తాను. నువ్వు చెప్పిన ట్లేరా గోపీ, అంతకుమించిన ఆనందం ఇంకేం కావాలి?' రాంబాబు చాలా ఉద్వేగంగా మాట్లా డాడు. నా కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

***

'మానసా.. నువ్వు ముందో, నేను ముందో మన తదనంతరం... భగవంతుడి దయవల్ల మన నుంచి ఏదీ ఆశించని మన పిల్లలకి మన గుర్తుగా సెంటిమెంటల్‌గా మన ఆస్తి, సంపాదనా కొంత చెందేట్టు ఏర్పాటుచేసి మిగిలింది ఇదిగో, ఈ లిస్టు ప్రకారం నాకు తెలిసీ అవసరాల్లో ఉన్న మన బంధుమిత్రులకి నెమ్మదినెమ్మదిగా ఇవ్వడం మొద లెట్టేద్దాం. నువ్వు చదువుతున్న ఈ కథలో... ఇదీ అసలు చివరి పేజీ' అని మానసకిచ్చాను.

చదివి కళ్ళల్లో నీళ్ళు పెట్టుకున్న మానస... 'నేను కథ గురించి తర్వాత మాట్లాడతాను గానీ... ముందు అలాగే గోపాల్... మనం కూడా కథలో లాగే... అలాగే చేద్దాం!' అంది సంతృప్తిగా... ఉద్వే గంగా.

**సెల్: 98481 67978**






## యోగా బామ్మగారు

ఆరోగ్యం, ఫిట్‌నెస్ కోసమే ఎంతోమంది యోగాసనాలు వేస్తుంటారు. తద్వారా ఆరోగ్యంతో పాటు అందాన్ని కూడా కాపాడుకుంటారు. అయితే ఒక వయసు దాటాక యోగాసనాలు వేయకూడదంటారుగానీ ననమ్మాల్‌కు మాత్రం అదేమీ వర్తించదు! 98 ఏళ్ళ వయసు లోనూ ఏమాత్రం తొణక కుండా ఆస నాలు వేస్తూ అందరినీ ఆశ్చర్యానికి గురిచేస్తోంది బామ్మ.

తమిళనాడులోని కోయంబత్తూరుకు చెందిన ననమ్మాల్ యోగా టీచర్. దేశంలోనే అత్యంత వృద్ధురాలైన యోగా ట్రైనర్‌గా గుర్తింపు పొందింది. యోగా కారణంగానే తాను ఇప్పటికీ ఇంత ఆరోగ్యంగా ఉన్నానని చెబుతోంది ననమ్మాల్. పదేళ్ళ వయసులోనే యోగా ప్రాక్టీస్ ప్రారంభించిందట ననమ్మాల్. ఇప్పుడు ఆమె దగ్గర వందమందికిపైగా విద్యార్థులు యోగా శిక్షణ పొందుతున్నారు.



## అదరహో...!

టెన్నిస్ అనగానే సానియామీర్జా, లియాండర్ పేస్, రఫెల్‌నాదల్ వంటి స్టార్ ప్లేయర్లు గుర్తొస్తారు. రికీని కూడా ఆ జాబితాలోకి చేర్చుకోవచ్చు. ఇంతకీ ఎవరీ రికీ?

రికీ...జపాన్‌కి చెందిన ఆరేళ్ళ కోతి! రాకెట్ చేతబట్టిందంటే ప్రముఖ టెన్నిస్ ప్లేయర్లు సైతం నోరెళ్ళబెట్టి చూడాల్సిందే. సాధారణ ఆటగాళ్ళలాగే స్పోర్ట్స్ డ్రెస్ వేసుకుని రోజూ టెన్నిస్ కోర్టులో ప్రాక్టీస్ చేస్తుంటుంది. అంతేకాదండోయ్ దానికున్న ఆన్‌లైన్ ఫాలోయింగ్ అంతాఇంతా కాదు. దానికో సొంత యూట్యూబ్ ఛానల్ కూడా ఉంది. అది కొట్టే వాలీలు, స్మాష్‌లు... అదరహో అనిపించేలా ఉన్నాయంటే నమ్మండి. రికీనా మజాకా!

## పెళ్ళిపిలుపు

సకుటుంబ సపరివార సమేతంగా పెళ్ళికి తప్పకుండా రండి...అంటూ పెళ్ళికార్డు ఇచ్చి ఆహ్వానిస్తుంటారు. అయితే కాస్త వెరైటీగా, కొత్తగా ఉండాలనుకునేవారు మాత్రం రకరకాల పద్ధతుల్లో పెళ్ళి ఇన్విటేషన్లు ఇస్తున్నారు. ఇది కూడా అలాంటిదే. కాకపోతే ఇది పిల్లలకు సంబంధించిన ఇన్విటేషన్!

బ్రాడీ అనే పిల్లవాడు తన పెంపుడు పిల్లి సిల్వర్‌కి పెళ్ళి చేయాలనుకున్నాడు. అదికూడా తన పొరుగింటి వివియన్ పెంపుడు పిల్లిపిల్ల పెడ్రోతోనట. పెళ్ళికి తప్పకుండా రావాలంటూ పెళ్ళి ఇన్విటేషన్ ఇచ్చాడు. అందులో 'సిల్వర్, పెడ్రోల పెళ్ళికి మిమ్మల్ని ఆహ్వానిస్తున్నాను. మంచి పార్టీ కూడా ఉంటుంది. సిల్వర్, పెడ్రో నైస్‌గా డ్రెస్ చేసుకుంటాయి... మీరు కూడా నైస్‌గా డ్రెస్ చేసుకుని రావచ్చు అది మీ ఇష్టం' అని రాశాడు. దాంతో బ్రాడీ స్నేహితులు పెళ్ళికి హాజరై పెళ్ళితంతు ముగిశాక, ఛాంపేన్ తీసుకుని, చూడచక్కగా ఉన్న జంటను చూసి సెల్ఫీలు తీసుకుని పార్టీ ముగించారు. బాగుంది కదా పిల్లల పెళ్ళి పిలుపు!



## బోయింగ్ హౌస్

గుహల్లో, కొండకోనల్లో ఇళ్ళు కట్టుకుని ఉండటం తెలుసు. కానీ విమానాన్నే ఇల్లుగా మార్చుకుని అందులోనే కాపురం పెట్టటం ఎక్కడయినా చూశారా? పోనీ విన్నారా? లేకపోతే బ్రూస్ కాంప్‌బెల్ గురించి మాత్రం మనం తెలుసుకోవాల్సిందే!

అమెరికా, ఆరిగాన్ రాష్ట్రంలోని పోర్ట్‌లాండ్‌కు చెందిన బ్రూస్ కాంప్‌బెల్, పాత బోయింగ్ 727 ఎయిర్‌క్రాఫ్ట్‌ను కొని దాన్నే తన ఇంటిగా మార్చుకున్నాడు. అతడో ఇన్‌వెంటివ్ ఇంజనీర్! అయితే అంత పెద్ద ఎయిర్‌క్రాఫ్ట్‌ను ఉంచటానికి సిటీలో స్థలం ఉండదు కాబట్టి, పోర్ట్‌లాండ్ సిటీ బయట చెట్లమధ్య కాంక్రీట్ పిల్లర్స్ నిర్మించి వాటిమీద ఈ ఎయిర్‌క్రాఫ్ట్‌ను ఉంచాడీయన. ఇంట్లో ఉండే హంగులన్నీ ఈ విమానంలో అమర్చుకున్నాడు. షవర్, లావెటరీ, ఇంటీరియర్, లైట్స్ సమస్తం ఉన్నాయి. సంవత్సరంలో ఆరునెలలు ఈ ఎయిర్‌క్రాఫ్ట్‌లోనే గడుపుతాడు కాంప్‌బెల్. మిగిలిన ఆరునెలలు జపాన్‌లో ఉంటాడు. అక్కడ కూడా ఇలాంటి ఇంకో ఎయిర్‌క్రాఫ్ట్‌ను కొని, అందులోనే నివాసం ఏర్పాటుచేసుకోవాలని ఆలోచిస్తున్నాడు.



## క్రో కేఫ్!

గబ్బిలాల కేఫ్‌లు, పిల్లుల కేఫ్‌లు...ఇలా ఎన్నో రకాల కేఫ్‌లు చూశాం. కానీ లండన్‌లో ప్రత్యేకంగా కాకులకు ఒక కేఫ్ ఏర్పాటు చేశారు. కాకులపట్ల ఉన్న దురభిప్రాయం మార్చేందుకే ట్రివర్ స్మిత్ అనే వ్యక్తి ఈ కేఫ్ ఏర్పాటు చేశాడు. ఈ కేఫ్‌లో కాకులతో సరదాగా గడపవచ్చు. వాటితో ఆడుకోవచ్చు. అంతేకాదు కాకుల ఆకారంలో తయారుచేసిన స్నాక్స్‌ను కూడా ఎంజాయ్ చేయవచ్చు. వినూత్నంగా ఉన్న ఈ కేఫ్‌కి సందర్శకులు క్యూ కడుతున్నారట. భలే ఉంది కదూ కాకుల కేఫ్!

–నర్మద వాసిరెడ్డి




**'ఏంట్రా బాగా ఉన్నది? నడుముకు తగిలిన దెబ్బలు ఇంకా పచ్చిగానే ఉన్నాయ్. మోకాళ్ళు ఇంకా సరిగ్గా పనిచేయటం లేదు. గట్టిగా పది అడుగులు వేస్తే ముసలమ్మ మాదిరి ముడుచుకుపోతున్నావ్. ఏంటి ఇంకా నువ్వు బాగానే ఉన్నది?' బాధ, కోపం రెండూ కల గలిపిన కంఠంతో అడిగాడు మధ్యవయస్కుడి పక్కనే నిలబడి ఉన్న ఇంకో పెద్దమనిషి.**

**'అతన్ని ఒకసారి పిలవండి బాబాయ్... ప్లీజ్.. ఒక్కసారి..' అతను తనను వెక్కిరించి నట్టుగా అన్న మాటల్ని పట్టించుకోకుండా రిక్వెస్ట్ చేశాడు ఆ యువకుడు.**

'పిలవండిరా..' పక్కకు తిరిగి మిగిలిన వారికి ఆర్డర్ ఇచ్చాడు ఆ మనిషి.

సిగరెట్ సగం కూడా పూర్తికాకముందే అవ తలికి విసిరికొట్టి, మరింత వేగంగా అడుగులు వేయటం మొదలు పెట్టిన వెట్టికి వినిపించాయి రెండు అరుపులు.

'ఇదిగో అబ్బయ్యా... ఓయ్ అబ్బయ్యా... వెనక్కి.. వెనక్కి వచ్చేయ్ ఒకసారి...'

కడుపులో తిప్పినట్టు అయిపోయింది వెట్టికి. ఆ చుట్టుపట్ల తనని ఎవరైనా అంత గట్టిగా పిలవటం అంటూ జరిగితే, అది తనను చుట్టుముట్టి మడత పెట్టేయటానికే!

పెదవులు బిగించి పరుగు మొదలు పెట్టాలనే కోరిక కలిగింది అతనికి. అందుకు సిద్ధం అవబో తుండగా, అతివేగంగా వచ్చేశారు దుకాణం ముందు నిలబడిన వారిలో నలుగురు.

'కడప హైమారెడ్డి సారు పిలుస్తుంటే వినిపిం చుకోకుండా వెళ్ళిపోగల మొనగాడు ఇంత వరకూ పుట్టలేదు. నువ్వేమిటి? నీకేమైనా చెవుడా?' వెట్టి దారికి అడ్డంగా నిలబడుతూ రఫ్‌గా అన్నాడు వారిలో ఒకతను.

అధికం అయిపోయింది వెట్టి మనసులోని ఆత్రుత. పళ్ళు బిగించి పిడికిలి పైకి ఎత్తాడు.

కనులు చిట్లించుకు చూస్తున్నాడు దుకాణం దగ్గర నిలబడి ఉన్న యువకుడు. 'యస్.. యస్... అతనే! అతనే అనుకుంటూనే ఉన్నాను. వెట్టీ... ఓయ్ వెట్టీ..' గొంతు చించుకున్నంత పని చేశాడు.

తన దారిని అడ్డగించిన మనిషి మొఖానికేసి పిడికిలిని విసరటానికి రెడీ అవుతున్న వెట్టి ఒళ్ళు ఝల్లుమన్నది.

### జరిగిన కథ

వెట్టి అసలు పేరు విఠల్‌రెడ్డి. చౌడేశ్వరి గుడి దగ్గర తనను అంతమొందించాలనుకున్న బాజిరెడ్డి మనుషుల నుంచి తప్పించుకుని రాయుడిపల్లి వెళ తాడు. అక్కడ చౌడేశ్వరికి జరిగిన అపచారమేమిటో తెలుసుకుంటాడు. తిరిగి కదిరికి బయలుదేరిన వెట్టికి చౌడేశ్వరి ఆత్మశిల కనిపిస్తుంది. పిచ్చిపూజారికి ఆత్మ శిల గురించి చెబుతాడు. కడపనుంచి హైమారెడ్డి డైరె క్ట్‌గా శివారెడ్డికే ఫోన్ చేస్తాడు. బాజిరెడ్డి తనదగ్గర తీసుకున్న మొత్తాన్ని చెల్లించకుంటే ఎస్టేట్ మొత్తాన్ని స్వాధీనపరుచుకుంటానని హెచ్చరిస్తాడు. సమస్య లన్నీ తాను సాల్వ్ చేస్తానని మాటిస్తాడు వెట్టి. పఠాన్ ఎస్టేటు లోపలికి రావడంతో విఠల్‌రెడ్డే వెట్టి అని తెలిసి పోతుంది బాజిరెడ్డికి. దాంతో అక్కడినుంచి బయటప డతాడు వెట్టి. హాస్పిటల్ దగ్గర ప్రత్యక్షమవుతాడు. అక్కడ టీదుకాణం ముందు హైమారెడ్డి తారసపడ తాడు అతనికి. ఆ తర్వాత...



**తనను ఆపటానికి వచ్చిన హైమారెడ్డి మనుషులను చూడగానే, ఆత్రుత ఎక్కువైపోయింది వెట్టికి. గొడవ మొదలైతే తన పరిస్థితి ఏంటి? అనే ఆలోచన వచ్చింది. పిడికిలి బిగించాడు. ఫట్‌మని ఒకటి ఇచ్చేలోపుగానే వెట్టీ...ఓయ్ వెట్టీ అని పిలుస్తూ గాబరాగా ఓ యువకుడు తనవైపు పరిగెత్తుకురావడం కనబడింది. ఇంతకూ ఎవరా యువకుడు? వారిద్దరికీ ఇంతకుముందే పరిచయం ఉందా?**

పైకి ఎత్తిన పిడికిలిని అలాగే ఉంచి వెనక్కి చూశాడు.

తనను పట్టుకోబోయిన హైమారెడ్డి చేతుల్ని విదిలించేశాడు ఆ యువకుడు. అంతకుముందు తను బాబాయ్ అని సంబోధించిన పెద్దమనిషిని చాలా రఫ్‌గా వెనక్కి నెట్టాడు. 'వెట్టీ.. వెట్టీ.. నేను.. నేను బాబీని.. బాబీని వెట్టీ..' అంటూ పరిగెత్తుకు రావటం మొదలు పెట్టాడు.

పాతిక అడుగుల దూరం మాత్రమే పరిగెత్తగలిగాడు అతను. ఉన్నట్లుండి మోకాళ్ళు మడత పడటంతో ముందుకు తూలాడు.

తన ఎదుట ఉన్న పర్సనాలిటీని పిడికిలితో మర్దించాలన్న కోరికను పూర్తిగా వదిలేశాడు వెట్టి. గిరుక్కున వెనక్కి తిరిగి వేగంగా ఆ యువకుడి దగ్గరికి వచ్చాడు.

మొఖం పగిలిపోయేటట్టు ముందుకు పడిపోబోతున్న యువకుడిని ఆఖరి క్షణంలో అమాంతంగా ఒడిసి పట్టుకుని పైకి లేపాడు.

'నీకు బుద్ధి లేదు బాబీ.. నీకు తగిలిన దెబ్బలు సామాన్యమైనవి కావు. జాగ్రత్త పడకపోతే శాశ్వతంగా అవిటివాడివి అయిపోతావని ఎప్పుడో చెప్పాను. చెప్పినవన్నీ మర్చిపోయావు కదూ?' నిఠారుగా నిలబెట్టి చెంపమీద మృదువుగా తడుతూ అడిగాడు.

నీళ్ళు వచ్చేస్తున్నాయ్ యువకుడి కళ్ళల్లో... 'నిన్ను మళ్ళీచూస్తానని అనుకోలేదు. ఆ ఎదవలందరూ నన్ను వదిలి నీ అంతు చూడటానికే బయలుదేరారు. చచ్చిపోయావనే అనుకున్నాను. ఎలా తప్పించుకున్నావ్?' వెట్టి మొఖంలోకి ఆరాధనాపూర్వకంగా చూస్తూ అడిగాడు.

దుకాణం ముందున్న జనం అందరూ వచ్చేశారు వారిద్దరి దగ్గరికీ. చుట్టూ నిలబడి విస్ఫారిత నేత్రాలతో వారిద్దరినీ గమనించటం మొదలుపెట్టారు.

'ఎవరు అబ్బీ... ఇతను?' యువకుడి భుజం మీద చేయి వేస్తూ మృదువుగా అడిగాడు హైమారెడ్డి.

'ఇదిగో వెట్టీ... మా నాయన. ఇదుగో మా బాబయ్య... వాళ్ళందరూ మా దగ్గర పనిచేసే వాళ్ళు... మాకు బంధువులు కూడా..' హైమారెడ్డిని, తన బాబయ్యని, మిగిలిన వారందర్నీ చూపిస్తూ వెట్టికి పరిచయం చేశాడు యువకుడు.

'నాయనా.. ఇతను వెట్టి. ఇతని దయవల్లనే నేను ఆ దొంగనాయాళ్ళ నించి తప్పించుకు రాగలిగాను. నా మోకాళ్లు పనిచేయకపోతే అరవై రెండు మైళ్ళు నన్ను ఉప్పుమూట మోసినట్టు మోసుకుంటూ తీసుకువచ్చాడు. ఇతనే గనుక లేకపోతే నేను ఎప్పుడో చచ్చిపోయి ఉండేవాడిని' తన తండ్రికి వెట్టిని పరిచయం చేశాడు.

ఎంతో గంభీరంగా ఉన్న హైమారెడ్డి కళ్ళల్లో నీళ్ళు చిప్పిల్లాయి. గబుక్కున వెట్టి చేతులు పట్టుకున్నాడు అతను. 'నా బిడ్డడిని కాపాడి నా వంశాన్ని నిలబెట్టావు అబ్బయ్యా. నీ రుణం ఎలా తీర్చుకోవాలో తెలియటం లేదు. మాతో వచ్చేయ్. నీకు రాజభోగాలు జరిపిస్తాను, వచ్చేయ్' అంటూ భుజాలు పట్టుకుని తమ వెహికల్స్ వైపు నడిపించబోయాడు.

'ఒక్కక్షణం.. ఒక్కక్షణం ఆగండి సారూ... ఒక్క క్షణం' అంటూ అతన్ని ఆపాడు వెట్టి.

'నువ్వు డబ్బు దండిగా ఉన్న కుటుంబం నుంచి వచ్చావని అనుకున్నానుగానీ, ఇంత పెద్ద కుటుంబంలో నుంచి వచ్చావని అనుకోలేదు. నువ్వు నాకు ఎందుకు చెప్పలేదు?' వెట్టి యువకుడిని అడిగాడు.

ఆనందంతో కాబోలు అదే పనిగా నీటితో నిండిపోతున్నాయి యువకుడి కళ్ళు. 'నేను హైమారెడ్డి కొడుకునని తెలిస్తే ఆ దొంగనాయాళ్ళు మా నాయన్ని బ్లాక్‌మెయిల్ చేస్తారని భయపడ్డాను. అందుకే నా పేరు ఎవరికీ చెప్పలేదు' అన్నాడు.

'నువ్వు వట్టి చవట సన్నాసివి. నీకంటే మనకు డబ్బు ఎక్కువా? ఎంత అడిగితే అంత వాళ్ళ మొఖం మీద కొట్టి నిన్ను విడిపించుకునే వాళ్ళం. అతితెలివి చూపించి అవిటివాడివై పోయావు' కోపంగా అన్నాడు యువకుడి బాబయ్య.

అతని వంక, యువకుడి వంక, హైమారెడ్డి వంక మార్చిమార్చి చూశాడు వెట్టి. 'ఏంటి అలా చూస్తున్నావు?' నవ్వుతూ అడిగాడు యువకుడు.

'నీకు ఏదో బ్యాక్‌గ్రౌండ్ ఉన్నదని అనుకున్నాను గాని, ఇంత పెద్ద సెటప్పు ఉన్నదని మాత్రం అనుకోలేదు. నీ అసలు పేరు....' అని అంటూ ఉండగా,

'మా అబ్బిడి పేరు రాకేష్. ముద్దుగా బాబీ అని పిలుస్తాము. వాడు నీకు చెప్పింది అదే అయి ఉంటుంది' నవ్వుతూ అన్నాడు యువకుడి బాబయ్య.

'ఓకే! నీ పేరు రాకేష్, బాబీ కాదు. బాగానే ఉంది. నా మీది కచ్చతో నా పగవాళ్ళు నన్ను బస వప్పకి పట్టించి గ్రానైట్‌మైన్స్‌లోకి పంపించారు. మరి నిన్ను ఎవరు పంపించినట్టు?' అడిగాడు వెట్టి.

'అదే.. అదే అప్పుడు ఇప్పుడు నాకు ఎంత ఆలోచించినా అర్థం కావటం లేదు' తల పగలగొట్టుకుంటున్నాను' అన్నాడు యువకుడు.

'నీకు తెలిస్తే మాకు చెప్పు అబ్బయ్యా. ఏకేసి ఇంటికి పోతాము. నా బిడ్డడిని మాకు కాకుండా చేయటానికి ప్రయత్నం చేసిన ఆ బద్దెగాళ్ళని కత్తికో కండగా నరికి ఈ కదిరిస్వామికి బలి ఇచ్చేస్తాను' మొఖం ఉన్నట్లుండి వికృతంగా మారిపోతుండగా, పళ్ళు పటపటమని కొరుకుతూ అన్నాడు హైమారెడ్డి.

'అన్నా.. నువ్వు అనవసరంగా ఆత్రపడకు. మనోడి ప్రాణాలు కాపాడిన ఈ అబ్బయ్య మనకి కనిపించాడుగా... తీరికగా మాట్లాడి అన్ని విషయాలు తెలుసుకుందాం. మనోడిని పట్టుకున్న వాళ్ళనే కాదు, ఆ గ్రానైట్‌మైన్స్ ఓనర్స్‌ని కూడా



బయటకు లాగేద్దాం' అన్నాడు రాకేష్ బాబయ్య.

గుండెలనిండా గాలి పీల్చుకుని తన ఆగ్రహాన్ని తగ్గించుకున్నాడు హైమారెడ్డి. 'మంచిగా చెప్పినవ్. ఆ శివారెడ్డి సంగతి తర్వాత చూద్దాం. ముందు మనూరు వెళ్ళి మనోళ్ళందర్నీ సిద్ధం చేయాలి' అన్నాడు.

'తీసుకురండిరా బళ్ళని..' ఆర్డర్ ఇచ్చాడు రాకేష్ బాబయ్య.

వింతవింతగా చూస్తూ నిలబడిన వాళ్ళ జనంలో వెంటనే వచ్చింది చలనం. బిర్రున పరుగెత్తారు అందరూ. టీ దుకాణం దగ్గర ఆపిన తమ వెహికల్స్ స్టార్ట్‌చేసి వేగంగా వెనక్కి తీసుకు వచ్చారు.

'ఎక్కు అబ్బయ్యా... ఎక్కు. మనూరు పోదాం' అంటూ వెట్టిని ఒక వెహికల్‌లోకి నెట్టబోయాడు హైమారెడ్డి.

తన ప్రమేయం లేకుండానే చకచకా జరిగిపోతున్న ఆ డెవలప్‌మెంట్స్‌ని చూసేసరికి మతి పోయినంత పని అవుతున్నది వెట్టికి.

'ఆగండి సారూ... కొంచెం ఆగి నా మాటలు




వినిపించుకోండి' అంటూ వెహికల్ ఎక్కకుండా వెనక్కి తగ్గాడు.

'నీ మాటలు వినటానికే గదా మన ఊరు వెళ్ళి పోదామని చెబుతోంది. ఆ గ్రానైట్‌మైన్స్ సంగతి మాకు పూర్తిగా తెలియాలి. మా అబ్బడిని నువ్వు ప్రాణాలకు తెగించి ఎలా కాపాడావో మాకు చెప్పాలి' అన్నాడు హైమారెడ్డి.

ఎటువంటి సిచ్యుయేషన్‌లోనైనా చకచకా మాట్లాడగలిగిన వెట్టికి మాటలు కరువయ్యాయి.

'వన్స్ ఫర్ ఆల్... ఆ గ్రానైట్‌మైన్స్ గొడవకు మంగళం పాడేయాలి అన్నయ్యా, నువ్వు బండెక్కు' అన్నాడు రాకేష్ కూడా.

అప్పటికి కొంచెం తేరుకున్నాడు వెట్టి. 'సారూ... నాకు ఇక్కడ చాలాచాలా ముఖ్యమైన పనులు ఉన్నాయి. అవి పూర్తి అవకుండా నేను ఇక్కడి నుంచి కదిలితే కొంపలు అంటుకుపోతాయి. దయచేసి నన్ను ఒక నాలుగు రోజుల పాటు వదిలేయండి. నేను ఎవరినో మీకు తెలిసింది. మీరు ఎవరో నాకు తెలిసింది. కలుసుకోవటానికి ఎటువంటి అభ్యంతరం లేదు' అన్నాడు.

రెండు క్షణాలు ఆలోచించి తల ఊపాడు హైమారెడ్డి. 'తమ్ముడూ... మంచి హోటల్ చూసి మనకు గదులు బుక్‌చేయించు. ఈ అబ్బయ్య పనులు పూర్తి అయ్యేవరకూ ఇక్కడే ఉందాము. పూర్తి అయిన తర్వాత అందరము కలిసి ఊరికి పోదాము. ఈ లోపల మనం శివారెడ్డి విషయం కూడా తేల్చుకోవచ్చు' అన్నాడు.

వాళ్ళు ఏదో ఒక హోటల్లో బసచేసి తన పనులు పూర్తి అయ్యేవరకూ వెయిట్ చేస్తామని అనటం వరకూ ప్రశాంతంగానే విన్నాడు వెట్టి. శివారెడ్డి వ్యవహారం ప్రసక్తి వచ్చేసరికి చీమలు పాకినట్టు అయింది అతని ఒంటిమీద.

కారును ఆనుకుని నిలబడి ఉన్న రాకేష్ చెయ్యి పట్టుకుని, అందరికీ దూరంగా తీసుకు పోయాడు. 'బాబీ.. నువ్వు ఒక సాయం చెయ్యాలి' అన్నాడు.

'చెప్పు అన్నయ్యా... ఏం చేయాలి?' తడుముకోకుండా అడిగాడు అతను.

'శివారెడ్డి దగ్గరికి ఇప్పుడప్పుడే మీ నాయన్ని పోనీయకూడదు. ఒక పది రోజులపాటు అతన్ని మీ బాకీ విషయం కదిలించకూడదు. నువ్వు చెపితే మీ నాయన ఒప్పుకుంటాడా?' అడిగాడు వెట్టి.

మొఖమంతా కోపం చేసుకుని నవ్వాడు రాకేష్.

'ఎందుకు నవ్వటం?' ఆశ్చర్యంగా అడిగాడు వెట్టి.

'నేను అడిగితే మా నాయన కాదని అనటం ఇంతవరకూ జరగలేదు. కాని నీకు ఒక విషయం చెప్పాలి' అన్నాడు రాకేష్.

'ఏమిటది?' మరింత ఆశ్చర్యంగా అడిగాడు వెట్టి.

'అసలు శివారెడ్డిని బాకీ గురించి అడగమని ఒత్తిడి చేసి, ఫోను చేయించిందే నేను. ఇప్పుడు ఇక్కడికి రావటం కూడా నా ఒత్తిడి మూలకంగానే జరిగింది. శివారెడ్డి అనారోగ్యాన్ని గురించి మా నాయనకు తెలుసు. కొంచెం కులాసా చిక్కినతర్వాత మాట్లాడదామని అంటే నేను బలవంతం చేసి మనసు మార్చాను' నవ్వుతూనే చెప్పాడు రాకేష్.

తనకు మతిపోతున్నదేమోనన్న అనుమానం కలిగింది వెట్టికి. అన్నీ తెలుసని అనుకుంటున్న తనకు ఏమీ తెలియదేమోనని కూడా అనిపించింది.

'నీ సంగతి నువ్వు చూసుకోకుండా నా కోసం దారుణమైన రిస్కు తీసుకున్న నీకు చెప్పకూడని రహస్యం ఏదీ లేదు అన్నయ్యా... ఇప్పటిదాకా ఈ మాట నేను మా నాయనకి గాని, మా బాబయ్యకి గాని చెప్పలేదు. నీకే చెపుతున్నాను' అన్నాడు రాకేష్.

'ఏమిటి అది?' నీరసంగా అడిగాడు వెట్టి.

'శివారెడ్డి చెల్లెలుంది చూశావూ... తనని నేను ఇష్టపడ్డాను. కర్నూలులో చాలాసార్లు ఎదుటపడి మాట్లాడటానికి ప్రయత్నం చేశాను. కుదరలేదు. తను శివారెడ్డి చెల్లెలని తెలిసి ఒకరోజు ఇక్కడికి వచ్చాను. శివారెడ్డి మేనేజరు బాజిరెడ్డిని కలిశాను' చెప్పటం మొదలుపెట్టాడు రాకేష్.

తన కాళ్ళ కింద ఉన్న నేల కదులుతున్నదో, నిలబడే ఓపికలేక తనే తూలుతున్నాడో అర్థం కాలేదు వెట్టికి.

'కూర్చుని మాట్లాడుకుందాం బాబీ... నాకు నీరసం ముంచుకు వచ్చేస్తోంది' అంటూ అతని భుజాల్ని ఆసరాగా చేసుకుని నిలబడ్డాడు.

'ఏంటబ్బా.. ఏంటామాటలు? ఎంతసేపు?' హైమారెడ్డి గొంతులో అసహనం గట్టిగా వినిపించింది.

'మీరు వెళ్ళి హోటల్లో గదులు తీసుకోండి నాయనా. నేను, అన్నయ్య వెనకాలే వస్తాం' తల తిప్పి తనుకూడా బిగ్గరగానే అన్నాడు రాకేష్.

'నిన్ను ఒంటరిగా వదిలిపెడితే మళ్ళీ లేనిపోని తలనొప్పి...' అని సమాధానం చెప్పబోతూ ఆగి పోయాడు హైమారెడ్డి. 'మనమెవరమూ చేయలేని పని చేసి చూపించిన ఆ అబ్బయ్య తన దగ్గర ఉండగా భయం దేనికి? పదండిరా..' అంటూ ఒక వెహికల్‌లో కూర్చున్నాడు.

రెండో వెహికల్‌ని రాకేష్ కోసం రోడ్డు మీదనే వదిలి, కాలినడకన అతని వెహికల్‌ని అనుసరించారు హైమారెడ్డి జనం.

***

గ్లాసు మీద గ్లాసుగా నాలుగు గ్లాసులు పుచ్చుకుని, ఎర్రబడిన కళ్ళతో చుట్టూ చూశాడు బాజిరెడ్డి.

'ఏరా.. దొరికాడా వాడు?' అని అడిగాడు గుమ్మంలో నిలబడి ఉన్న ఒక అనుచరుడిని.

'ఇంకా లేదు సారూ! మన పఠాన్‌బాబు కూడా వెళ్ళాడు' అన్నాడు అతను.

చేతిలో ఉన్న ఖాళీ గ్లాసును ఎదుట ఉన్న గోడకేసి చాలా బలంగా విసిరాడు బాజిరెడ్డి.

ఖంగుమని శబ్దం చేసింది అది. ముక్కలు ముక్కలై కిందపడి పోయింది.

'ఒక్కడు... ఒక్కడంటే ఒక్కణ్ణి పట్టుకోవటానికి ఇంతమంది ఇన్నిరోజుల నించి తన్నుకు చస్తున్నారు. మిమ్మల్ని బతకనీయకూడదు. చంపి అవతల పారేయాలి' పళ్ళు కొరుకుతూ బిగ్గరగా అరిచాడు అతను.

టీపాయ్ మీద ఉన్న మందు సీసాను కూడా అతను గోడకు గురిపెట్టి విసురుతాడేమోనన్న అనుమానం కలిగింది గుమ్మంలో నిలబడి ఉన్న అనుచరుడికి.

'సిటీ మొత్తం జల్లెడ వేసి వెతుకుతున్నారు సారూ. తెల్లవారే లోపల వాణ్ణి పట్టుకోవడం గ్యారెంటీ' అన్నాడు చిన్నకంఠంతో.

అదే సమయంలో అక్కడికి వచ్చాడు ఇంకో మనిషి. 'సారూ... సంపంగి వచ్చింది. మీతో అర్జంటుగా మాట్లాడాలంట' అని రిపోర్టు చేశాడు.

ఎర్రబడిన కనుల్ని అరచేతులతో అద్దుకుంటూ తల ఊపాడు బాజిరెడ్డి.

గుమ్మం దగ్గరికి వచ్చింది సంపంగి. పమిటె చెంగును భుజాలచుట్టూ కప్పుకుంటూ నమస్కారం చేసింది.

'ఏమిటే సంపంగీ.. విశేషాలు ఏమిటి?' ముద్దముద్దగా అడిగాడు బాజిరెడ్డి.

'నేను మీ మనిషినని అందరికీ తెలిసిపోయినట్లుందయ్యా. మీకు ఫోను చేయటానికి వీలు లేకుండా పనులు చెప్పి చంపేస్తున్నారు. ఊపిరి తీసుకోవటానికి కూడా వీలులేకుండా పోతోంది. నేను బయటికి వచ్చేస్తానయ్యా... అక్కడ ఇంక పని చేయలేను' వినయంగా చెప్పింది.

'ఏంటే? ఏమైంది?' అడిగాడు బాజిరెడ్డి.

'ఇందాక ఆ వెట్టిగాడు లోపలికి వచ్చినప్పుడు, తిరిగి మీరు బయటికి తీసుకు పోతున్నప్పుడు కరెంటు పోయింది గదయ్యా' అన్నది ఆమె.

తల ఊపాడు బాజిరెడ్డి.

'అది కరెంటోళ్ళ పని కాదయ్యా. కావాలనే ఆ ప్రత్యూష మెయిన్ ఆఫ్ చేసింది' అన్నది ఆమె.

బాజిరెడ్డి మొఖంలో ప్రత్యక్షమైన కోపాన్ని చూసి బిత్తర పోయింది. గుమ్మం దగ్గరే ఉన్న అనుచరుడు కూడా అదిరిపడి ఒక అడుగు వెనక్కి వేశాడు.

'చంపేయాలిరొరేయ్. ఆ వెట్టిగాడినే కాదు, ఆ శంకరయ్య కూతుర్ని కూడా చంపి అవతల పారేయాలి. బతకనీయకూడదు' అంటూ గబుక్కున లేచి, ఎదుట ఉన్న టీపాయ్‌ని బలంగా తన్నాడు బాజిరెడ్డి.

టీపాయ్ ఎగిరి అవతల పడింది. దానిమీది మందుసీసా గోడకు తగిలి, అంతకుముందు విసిరిన గ్లాసు మాదిరిగానే పగిలిపోయింది.

'అరేయ్... నా గన్ను తీసుకురా. ఇవాళ అటో ఇటో తేలిపోవాలి' నడుము మీద చేతులు వేసుకుంటూ రంకె పెట్టాడు అతను.

'అయ్యా.. కాస్తంత నిదానించండి. అవతల ఉన్నది ఆడబిడ్డ.. మీకు కాబోయే కోడలికి నేస్తం. తొందరపడితే మనకే నష్టం' ధైర్యం చేసి చిన్నగా అన్నాడు అనుచరుడు.

'అవునయ్యా. పోయిపోయి ఒక ఆడదాని మీద గన్నులు గిన్నులు ఎందుకు? ఆ వెట్టిగాడిని ఏసేస్తే అంతా సర్దుకుంటుంది కదా' తను కూడా అన్నది సంపంగి.

ఇంకా ఇంకా రెచ్చిపోయి చిందులు తొక్కాల్సిన బాజిరెడ్డి సారు, ఏదో ఆలోచనలో పడినట్టు గమనించి ధైర్యం చేశాడు అనుచరుడు.

'సారూ... ఆ వెట్టి ఎవడోగాని వట్టి జలగమాదిరి ఉన్నాడు. ఎంతమంది వెంటపడినా దొరికినట్టే దొరికి జారిపోతున్నాడు. వాడి గురించి వదిలేయండి. ముందు పఠాన్‌బాబు పెళ్ళి జరిపించేయండి. పెళ్ళి జరిగిన తర్వాత వాడు చేయగలిగింది ఏమీ లేదు' అన్నాడు.

సుప్రసన్నమై పోయింది బాజిరెడ్డి మొఖం.

ఒక్కసారిగా 'భలే చెప్పావురా.. ముహూర్తాలు గిహూర్తాలు లేవు. రేపు పదింటికి పెళ్ళిళ్ళ రిజిస్ట్రార్‌ని తీసుకు పోయి ఆ పని పూర్తి చేయించేస్తాను. పఠాన్ బాబును వెంటనే పిలిపించు' అంటూ ప్రశాంతంగా కుర్చీలో కూర్చున్నాడు.

అవతలి గదిలో ఉన్న చీపురు తీసుకువచ్చి గదిని శుభ్రం చేసింది సంపంగి. 'అయ్యా నా సంగతి..' అంటూ గుర్తు చేసింది.

'ఏం ఫరవాలేదు. రేపు ఒక్కరోజు... నీ కష్టం తీరిపోతుంది. నువ్వు వెళ్ళి నీ పని చూసుకో' హుందాగా అన్నాడు బాజిరెడ్డి.

వెనక్కి వెళ్ళవలసిన అవసరం లేదని అంటాడన్న ఆశ ఆవిరైపోవటంతో, బిక్కుబిక్కుమంటూ వెనుతిరిగింది సంపంగి.

***

'మా బాకీ విషయం శివారెడ్డితో మాట్లాడాలని ఇక్కడికి వచ్చానే గాని నిజానికి అది నా ఉద్దేశం కాదు. ఆ మిషమీద శివారెడ్డి ఎదుటపడి, నా మనసులోని కోరికను అతనికి వినిపించాలని' కదిరిస్వామి గుడికి దగ్గరగా ఉన్న ఒక పెద్ద హోటల్‌లో తన కోసం తీసుకోబడ్డ ఏసీ గదిలో కూర్చుని వెట్టికి చెప్పాడు రాకేష్.

'అప్పటికే శివారెడ్డి బాగా డీలాపడి ఉన్నాడు కదా..' అన్నాడు వెట్టి.

తల ఊపాడు రాకేష్... 'అది తెలిసిన తర్వాత నేను చేసిన ఒకే ఒక తప్పు ఆ బాజిరెడ్డిని కలవటం' అన్నాడు.

వెట్టి చేతుల మీది వెంట్రుకలన్నీ మేకులు మాదిరి నిక్కబొడుచుకున్నాయి. 'అయ్య బాబోయ్' అన్నాడు అప్రయత్నంగా.

తల ఊపాడు రాకేష్.

'నేను హైమారెడ్డి మనిషిననీ, శివారెడ్డి చెల్లెల్ని వివాహం చేసుకోవటానికి ఇష్టపడుతున్నాననీ చెప్పాను. ఈ పెళ్ళి గనుక జరిగితే శివారెడ్డిని బాకీ చెల్లించమని అడిగే విషయంలో ఎంతో కొంత వెసులు బాటు ఖచ్చితంగా చూపించడం జరుగుతుందని బాజిరెడ్డికి చెప్పాను' జరిగింది తలుచుకుంటూ చెప్పాడు రాకేష్.

'ఆ తర్వాత నువ్వు బస చేసిన హోటల్‌కి పోతున్న సమయంలో బసవప్ప ప్రత్యక్షం అయ్యాడు. అవునా?' అన్నాడు వెట్టి.

తల అడ్డం తిప్పాడు రాకేష్.

'చౌడేశ్వరి గుడి దగ్గరికి వస్తే అన్ని విషయాలు వివరంగా మాట్లాడుకుందామని చెప్పాడు. నేను గుడ్డిగా గుడి దగ్గరికి పోయాను. అప్పుడు జరిగింది నువ్వు చెప్పిన పని' అన్నాడు.

'నువ్వు హైమారెడ్డి వారసుడివని బాజిరెడ్డికి తెలియదు. బసవప్పకి కూడా తెలియదు. నిన్ను,

## అసలు తమన్నా ఎంత అడిగింది?

**త**మన్నా కారణంగానే 'క్వీన్' రీమేక్ ఆగిపోయిందన్న వార్త బాగా హల్‌చల్ చేసింది. దీని మీద తమన్నా నేరుగా నోరు విప్పకపోయినా, ఆమె అభిమానులు మాత్రం నిర్మాత సత్యరాజ్ మీద చిర్రుబుర్రులాడుతున్నారు. ద్విభాషా చిత్రంగా రూపొందే ఈ సినిమాలో నటించడానికి తమన్నా రెండుకోట్లు (అసలు ఎంత? అన్నది స్పష్టత లేదట) అడిగిందన్న ప్రచారం బాగా జరిగింది. ఇంత మొత్తం తమ్ముకి ఇచ్చి సినిమా తీయలేమన్నది సత్యరాజ్ వాదన! నిజంగా తమన్నా అంత అడిగితే నష్టమేమీ లేదని అంటున్నారు. సినిమా మొత్తం పది పన్నెండుకోట్లలో(తమ్ము రెమ్యునరేషన్ సహా) అయిపోతుందనీ, రెండు భాషల్లో కలిపి ఇంత మొత్తం రాబట్టడం పెద్ద కష్టమేమీ కాదన్నది ఆమె అభిమానుల ముక్తాయింపు. ఈ సినిమా తీయకపోవడానికి కారణాలు వేరే ఉండవచ్చు కానీ, తమన్నా మీద అభాండాలు వేయడం ఎందుకన్నది వారి వాదన!

నన్ను పట్టుకుని చిత్రహింసలు పెట్టిన గ్రానైట్‌మైన్స్ జనానికి కూడా తెలియదు' అన్నాడు వెట్టి.

తల ఊపాడు రాకేష్.

పాంటుజేబులో నుంచి సిగరెట్ తీసి వెలిగించుకున్నాడు వెట్టి. గుండెలనిండా పొగ పీల్చుకుని బయటికి వదులుతున్న సమయంలో ఉన్నట్టుండి వచ్చింది అతనికి ఒక ఆలోచన. మొఖం మీద చిన్న నవ్వు ప్రత్యక్షం అయింది.

తన బెడ్ మీద తీరికగా పడుకుని ఉన్న రాకేష్‌కి విచిత్రం అనిపించింది అతని ప్రవర్తన.

'ఎందుకు నవ్వటం?' లేచి కూర్చుంటూ అడిగాడు.

'నువ్వు ఇంత జరిగిన తర్వాత కూడా శివారెడ్డి చెల్లెల్ని పెళ్ళిచేసుకోవాలని అనుకుంటున్నావా?' అడిగాడు వెట్టి.

'ఒకసారి ఆ ఆలోచన చేసినందుకే మోకాళ్ళు చచ్చుపడినంత పని అయింది. ఇంకోసారి అసలు మెడ మీద తలకాయ ఉండకపోవచ్చు. అయినాసరే ఆశ మాత్రం అలాగే ఉంది' అన్నాడు రాకేష్.




'నీ తలకాయకి నేను హామీ ఉంటాను. చేసుకుంటావా?' సిగరెట్‌ని యాష్‌ట్రేలో పడేస్తూ అడిగాడు వెట్టి.

మొఖమంతా నోరు చేసుకుని నవ్వాడు రాకేష్.

'చేసుకోవాలన్న కోరిక ఉండబట్టే మా నాయన్ని వెంటబెట్టుకుని వచ్చాను. శివారెడ్డి మనసులో ఏముందో తెలుసుకున్న తర్వాత మా నాయనకి, మా బాబయ్యకి చెపుదామని అనుకున్నాను' అన్నాడు.

'ముందే ఎందుకు చెప్పలేదు? కాదంటారని భయమా?'

'అదికాదు.. మా వాళ్ళు ఏదైనా ఒక నిర్ణయం తీసుకుంటే ప్రాణాలు పోయినా వెనక్కి తిరగరు. శివారెడ్డి తన చెల్లెల్ని నాకు ఇవ్వటానికి ఇష్టపడకపోతే లేనిపోని గోల మొదలు అవుతుంది. అది నాకు ఇష్టం లేదు' సీరియస్‌గా చెప్పాడు రాకేష్.

'ఓ.కే. శివారెడ్డి చెల్లెలు నిన్ను ఇష్టపడేటట్లయితే ఈ పెళ్ళి జరిపించే బాధ్యత నాది. సిద్ధంగా ఉండు' అన్నాడు వెట్టి.

'మేము ఇక్కడికి వచ్చిన తర్వాత చూచాయగా మాకు తెలిసింది, శివారెడ్డి చెల్లెల్ని బాజిరెడ్డి తన కొడుక్కి ఇచ్చి చేయాలని అనుకుంటున్నట్టు. లేనిపోని ఆశతో అనవసరంగా మా వాళ్ళని వెంటబెట్టుకుని వచ్చానేమోనన్న అనుమానం కలుగుతోంది' అన్నాడు రాకేష్.

'అవన్నీ నీకు అనవసరం. నీ మొఖం గనుక ఆ బిడ్డకి నచ్చేటట్లయితే రేపు ఈ పాటికల్లా మీరిద్దరూ హనీమూన్‌కి వెళ్ళే ఏర్పాట్లు నేను చేస్తాను' అంటూ ఒక్క క్షణం ఆగి, 'నీ ఫోటో ఏదైనా ఉందా?' అడిగాడు వెట్టి.

తన జేబులో నుంచి ఖరీదైన ఫోన్ తీసి అతనికి అందించి, సినిమా హీరో మాదిరి నడుము మీద చేతులు వేసుకుని నిలబడ్డాడు రాకేష్.

చిన్నగా నవ్వుతూ రకరకాల యాంగిల్స్‌లో పది ఫోటోలు తీశాడు వెట్టి. 'నీకు ఇష్టం అయిన దేవుళ్ళు గాని, దేవతలు గాని ఎవరైనా ఉంటే తలుచుకుంటూ పడుకో.. తెల్లవారిన తర్వాత ఫోన్‌చేసి చెపుతాను. ఎందుకైనా మంచిది మీ నాయనకి, బాబయ్యకి చెప్పి వాళ్ళ పర్మిషన్ కూడా తీసుకో' అంటూ ఆ గది గుమ్మం దగ్గరికి పోయాడు వెట్టి.

మూసి ఉన్న తలుపుమీద అతని చెయ్యి పడకముందే తెరుచుకున్నది అది. సీరియస్‌గా చూస్తూ లోపలికి వచ్చాడు హైమారెడ్డి.

జరగకూడనిది ఏదో జరగబోతున్నదని వెంటనే అనిపించింది వెట్టికి. 'ఆగండి సారూ... కొంచెం నిదానించండి. జరిగింది ఏమిటో పూర్తిగా తెలుసుకున్న తర్వాత–' అంటూ ఆపటానికి ప్రయత్నించాడు.

భుజం మీద చెయ్యివేసి బలంగా అవతలికి నెట్టాడు హైమారెడ్డి. వేగంగా తన బిడ్డడి దగ్గరికి పోయి చెంపమీద బలంగా కొట్టాడు.

తూలి బెడ్‌మీద పడిపోయాడు రాకేష్. నీరు నిండిన కనులతో దీనంగా చూశాడు.

'నువ్వు వట్టి చేతకాని చవటవి. శివారెడ్డి చెల్లెల్ని పెళ్ళి చేసుకోవాలని నీకు కోరికగా ఉన్నట్లయితే నాతో ఒక్కమాట చెప్పి ఉండాల్సింది. నీ అంతట నువ్వు పాడు ఆలోచనలు చేయటం వల్ల ఎన్ని బాధలు పడాల్సి వచ్చిందో తెలిసికూడా, మళ్ళీ అదే తప్పు చేస్తున్నావు. హైమారెడ్డితో వియ్యం అంటే కాదనే ధైర్యం ఈ ఇలాకాలో ఎవరికి ఉంది? ఎందుకు ఇన్ని మెలికలు?' కోపంగా అడుగుతూ చూశాడు వెట్టి మొఖంలోకి.

'మీరు కొంచెం ప్రశాంతంగా వింటానంటే కొన్ని మాటలు చెపుతాను. విశ్రాంతిగా కూర్చోండి' అన్నాడు వెట్టి.

'ఏరా, దెబ్బ గట్టిగా తగిలిందా?' బెడ్‌మీద కూర్చుంటూ తన బిడ్డడి భుజం మీద చెయ్యివేసి అడిగాడు హైమారెడ్డి.

కళ్ళల్లో ప్రత్యక్షం కాబోయిన నీటిని బలవంతంగా కళ్ళల్లోనే అదుముకుంటూ తల అడ్డం తిప్పి, ఆయన భుజం మీద తల ఆనించుకున్నాడు రాకేష్.

'నా బిడ్డడు నాకు ప్రాణం. అవసరం అయితే శివారెడ్డి చెల్లెల్ని బలవంతంగా బయటికి తీసుకువచ్చి పదిమందీ చూస్తుండగా పెళ్ళి జరిపిస్తాను' గంభీరంగా అన్నాడు హైమారెడ్డి.

'ఆ బిడ్డకు ఇష్టం అయితే ఎవరి బలవంతం అవసరం లేదు. తనే వచ్చి తాళి కట్టించుకుంటుంది. నేను చెప్పేది పూర్తిగా వినండి' అంటూ తను శివారెడ్డి దగ్గరికి రావటం దగ్గరనుంచి మొదలుపెట్టి ఆ తరువాత జరిగిన సంఘటనలన్నిటినీ వివరించాడు వెట్టి.

'బాజిరెడ్డి చేసిన పాడు పని కారణంగా శివారెడ్డి కుటుంబం చౌడేశ్వరి ఆగ్రహానికి గురి అయింది. రకరకాల బాధలు బరువులు ఆ కుటుంబాన్ని అల్లకల్లోలం చేస్తూ వస్తున్నాయి. లాగిపెట్టి కొడితే లేవటం చేతకాని ఆ బాజిరెడ్డి ఆటలు అప్రతిహతంగా కొనసాగటానికి  కూడా ఆ తల్లి ఆగ్రహమే కారణం' ఆఖరిలో అన్నాడు.

'అవసరం అయితే వందలకు వందల మందిని రప్పించి ఎంతమందినయినా నిలబెట్టి నరికించగలను. ఈ దేవతల విషయంలో ఎదురు పోరాటం మాత్రం నాకు చేతకాదు. ఎలా అబ్బయ్యా?' సాలోచనగా అడిగాడు హైమారెడ్డి.

'మీరు వేరే ఆలోచనలు చేయకుండా కామ్‌గా కూర్చోండి. అన్ని విషయాలు నేను చూసుకుంటాను' అన్నాడు వెట్టి.

'ఇన్ని మాటలు చెపుతున్నావు. ఇంతకీ నీ సంగతేంటి అబ్బయ్య. నువ్వు ఎవరివి?' ఉన్నట్లుండి అడిగాడు హైమారెడ్డి.

చిన్నగా నవ్వేశాడు వెట్టి. 'నేను ఎవరినో, నా సంగతేమిటో తర్వాత తెలుస్తుంది. ముందు మా బాబీ ప్రేమ వ్యవహారం ఎటుపోయి ఎటు వస్తుందో తేల్చుకోవాలి. ఆ బిడ్డ సామాన్యురాలు కాదు. ఆవులిస్తే పేగులు లెక్కబెట్టే రకం. నేను పోయి వస్తాను' అన్నాడు.

'జాగ్రత్త అబ్బయ్య... బాజిరెడ్డి ఎనకబట్టిండంటివి. గ్రానైట్‌మైన్స్ జనం వాడికి సాయం చేస్తున్నారంటివి' అంటూ ఏదో ఆలోచన వచ్చినట్టు చిటికె వేశాడు హైమారెడ్డి.

'ఏమిటి నాయనా?' అడిగాడు రాకేష్.

'వాళ్ళు ఈ అబ్బయ్యని చూసి మీదికి వచ్చేదాకా ఎందుకు ఆగటం? మనమే పోయి తుక్కుకింద కొట్టి వచ్చిన దారినే పంపించేస్తే ఒక పని అయిపోతుంది కదా..' అన్నాడు హైమారెడ్డి.

తల అడ్డం తిప్పాడు వెట్టి.

'వాళ్ళని వెనక్కి పంపించేస్తే పని అయిపోదు. అసలు ఆ మైన్స్‌నే మూయించేయాలి. అదీ అసలైన పని. అందుకు కొంచెం టైము ఉంది' అంటూ ఆ గదిలో నుంచి బయటికి వచ్చి, రాకేష్ తనకు ఇచ్చిన ఫోన్‌లో ఒక నంబర్ ప్రెస్ చేశాడు. 'హల్లో... ఎవరూ?' అంటూ విన వచ్చింది ప్రత్యూష కంఠం.

**(ఇంకా వుంది)**

# సుఖవ్యాధులుంటే జీవితం శిథిలం

**హెర్పిస్ సింప్లెక్స్ :** పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు కనిపిస్తాయి. దురద ఉంటుంది. నీటిపొక్కులు పగిలిపుండు పడుతుంది. ఈసమయంలో చికిత్స తీసుకో కపోతే ఇతరులకు సోకే ప్రమాదం ఉంది. శృంగారం ద్వారా సంక్రమించే ఈ వ్యాధిని హెర్పిస్ అని అంటారు. స్త్రీలలో కూడా యోని మీద చిన్న చిన్న పొక్కులలాగా వచ్చి ఎర్రగా మారి నొప్పిని కలిగిస్తాయి.

**గనేరియా :** మూత్రంలో మంట, మూత్రనాళం దగ్గర దురద, జిగురుగా ద్రవం కారడం వంటి లక్షణాలు కనిపిస్తాయి. ఒక్కొక్కసారి రక్తపరీక్షలో గనేరియా బయటపడకపోవచ్చు. కానీ మూత్రనాళంలో బాధ, మూత్రంలో మంట ఉంటుంది. కొందరిలో పొత్తికడుపు నొప్పి, వీర్యంలో మంట, రక్తం రావడం కనిపిస్తాయి.

**వెనీరియల్ వార్ట్స్:** పురుషాంగం మీద చిన్న క్యాలిఫ్లవర్ తరహాలో పులిపిరులు వస్తాయి. ఇవి గుత్తులు గుత్తులుగా తయారవుతాయి.

**షాంకరాయిడ్ పుళ్లు:** ఇది కూడా లైంగిక వ్యాధే. లైంగిక సంపర్కం తర్వాత 3 నుంచి 5 రోజులలో ఈ వ్యాధి బయటపడుతుంది. జననాంగం మీద రెండు, మూడు పుళ్లు ఏర్పడతాయి. ఇది మొదట చిన్న నీటి బుడగలాగా వచ్చి చీము ఏర్పడి పగులుతుంది. పుండు ఎర్రగా మారి నొప్పి వస్తుంది.

**హోమియో చికిత్స :** రోగనిరోధక శక్తి బలపడటం ద్వారా హెచ్ఐవి రోగుల్లో అవకాశ వాద వ్యాధులన్నీ దూరమ వుతాయి. వైరల్‌లోడ్ బాగా తగ్గిపోతుంది. గనేరియా, వెనీరియల్ వార్ట్స్, షాంకరా యిడ్ పుళ్ల కూడా హోమియో మందులతో సమూలంగా దూర మవుతాయి.

# పైల్స్ ఉంటే రోజూ నరకమేగా?

**పైల్స్, ఫిస్టులా** సమస్యలతో బాధపడే వారి సంఖ్య తక్కువేమీ కాదు. కాకపోతే, సమస్య మరీ తీవ్రమై భరించలేని స్థితికి వస్తే కానీ , చాలా మంది డాక్టర్‌ను సంప్రదించరు. సమస్య బాగా ముదిరిన తరువాత ఆపరేషన్‌కు వెళతారు. నిజానికి శస్త్ర చికిత్సల వల్ల తాత్కాలిక ఉపశమనం లభిస్తుందే తప్ప సమస్య సంపూర్ణంగా పోదు. వ్యాధి మూలాలను సమూలంగా తొలగిస్తే గానీ ఈ సమస్యలు పూర్తిగా కనుమరుగైపోవు. అలాంటి మూల వైద్యం చేయడంలో హోమియో వైద్యులు ఎంతో సిద్ధహస్తులు.

**యానల్ ఫిస్టులా (భగంద్రం) :** ఫిస్టులా రోగికి ప్రాణాంతకమేమీ కాకపోయినా, అది కలిగించే బాధ వర్ణనాతీతం. ఆ బాధల్లో ముఖ్యంగా చీము, రక్తం కలగలిసిన ద్రవం పిరుదులు, మలద్వారం వద్దనుంచి తరుచూ రావడం. భరించలేని నొప్పితో పాటు జ్వరంగా కూడా ఉంటుంది. కొందరికి మలంతో పాటే రక్తమూ రావచ్చు.

**అర్శమొలలు(పైల్స్) :** మలద్వారం పక్కన ఉండే దమనులు ఉబ్బిపోవడాన్నే అర్శమొలలు అంటారు. ఈ సమస్య ఉన్న వారిలో మల విసర్జన సమయంలో రక్తం పడుతుంది. కొన్నిసార్లు రక్తం మలంతో కలిసి వస్తుంది.

**హోమియో వైద్యం :** పైల్స్‌కు సంబంధించిన వైద్యంలో హోమియోలో ఒక విలక్షణమైన విధానం ఉంది. అందుకే ఇక్కడ పైల్స్ సమస్య శాశ్వతంగా, సంపూర్ణంగా తగ్గిపోతోంది. ఫిస్టులా లోనూ ఆ మార్గాన్ని మూసి వేయడమే కాకుండా, హోమియో మందులు సమస్య మరోసారి రాకుండా చేస్తాయి.

**Dr. K Ravikirane**
M.D.,M.sc(psych), P.G(virology)LONDON
గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ ఇన్ మెడిసిన్
**మాస్టర్స్ హోమియోపతి**
అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్,
విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి
ఫోన్ : 7842 106 106, 9032 106 106
V6లో ప్రతి మంగళవారం మధ్యాహ్నం 2:30కి
సాక్షిలో ప్రతి శనివారం మధ్యాహ్నం 2:30కి
10టీవీలో ప్రతి ఆదివారం మధ్యాహ్నం 4:30కి డాక్టర్‌గారి లైవ్ కార్యక్రమం ఉంటుంది.



# మైగ్రేన్ తలనొప్పి మళ్లీ రాదు

**తలనొప్పి** వచ్చిందంటే చాలు తగ్గే వరకు మామూలు మనిషి కాలేరు. రోజూ నరకం అనుభవిస్తారు. వెలుతురు చూడలేరు, చిన్న శబ్దాలను వినలేరు. తలనొప్పిఅంత తీవ్రంగా ఉంటుంది. మరి కొందరికి రెండు, మూడు రోజులకొకసారి తలనొప్పి వస్తూనే ఉంటుంది. తలనొప్పితో పాటు వాంతులు, తలతిరగడం వంటి లక్షణాలుంటాయి. ఏ పని చేసుకోలేకపోతారు. నెలలో 10 రోజులు ఆఫీసుకు సెలవు పెట్టాల్సి వస్తుంది. ఏదైనా పనిచేస్తున్నప్పుడు తలనొప్పి మరింత తీవ్రమవుతుంది. తీవ్రమైన తలనొప్పి వల్ల ఏ పనీ చేసుకోలేకపోతారు వికారం, వాంతులు, వంటి లక్షణాలు ఉంటాయి.

**కారణం ఏమై ఉంటుంది? :** సైనసైటిస్‌తో బాధపడే వారిలోనూ తలనొప్పి ఉంటుంది. తీవ్రమైన ఒత్తిడికి గురయ్యే వారిలోనూ తలనొప్పి ఉంటుంది. కాబట్టి ముందుగా కారణాలను తెలుసుకునే ప్రయత్నం చేయాలి.. మెదడులో కొన్ని రకాల కెమికల్స్ విడుదల కావడం, రక్తనాళం ఎన్‌లార్జ్‌మెంట్ కావడం వంటివి తలనొప్పికి కారణమవుతుంది. అలర్జీ, లైట్, పెర్‌ఫ్యూమ్, స్ట్రెస్, స్మోకింగ్, ఆల్కహాల్, సమయానికి భోజనం చేయకపోవడం వంటి కారణాలు అందులో ఉంటాయి.

**హోమియో చికిత్స తరువాత :** మైగ్రేన్ సమస్యకు ఇతర చికిత్సా విధానాల్లో పరిష్కారం లేదనే చెప్పవచ్చు. ఇతర చికిత్సల్లో లక్షణాలు తగ్గించేందుకు చికిత్స ఇస్తారే తప్ప మూలకారణాన్ని తొలగించేలా చికిత్స ఉండదు. నాలుగు రోజుల తరువాత మళ్లీ మామూలే అవుతుంది. కానీ హోమియో చికిత్స అలా కాదు. మూలకారణాన్ని తొలగిస్తుంది. మైగ్రేన్‌కు కారణమవుతున్న నరాలను సాధారణ స్థితికి తీసుకువస్తుంది. కెమికల్స్ విడుదలను అడ్డుకుంటుది. ఫలితంగా మైగ్రేన్ సమస్య శాశ్వతంగా తగ్గిపోతుంది. సమస్య మళ్లీ పునరావృతం కావడం అంటూ ఉండదు.

# హెపటైటిస్ బాధ పూర్తిగా పోయింది

**కాలేయ** వ్యాధులలో అత్యంత ప్రాణాంతకమైనది, తెలియకుండా వ్యాపించే జబ్బు హెపటైటిస్. ఈ వైరస్ ముఖ్యంగా రక్తం ద్వారా వ్యాపిస్తుంది. వైరస్ ఉన్న రక్తాన్ని ఎక్కించడం, డ్రగ్స్ అలవాటు ఉన్న వారు ఒకరు ఉపయోగించిన నీడిల్స్ మరొకరు ఉపయోగించడం ప్రధాన కారణంగా చెప్పుకోవచ్చు. తల్లి నుంచి శిశువుకు కూడా సంక్రమించే అవకాశం ఉంది. లైంగిక సంబంధాల ద్వారా కూడా వ్యాపిస్తుంది.ఆకలి లేకపోవడం, వాంతి వస్తున్నట్లుగా ఉండటం, ఒళ్లంత నొప్పులు, మూత్రం పచ్చగా రావడం జరుగుతుంది. లో గ్రేడ్ ఫీవర్, పొట్ట పైభాగంలో నొప్పి, జాండిస్ వంటి లక్షణాలు కనిపిస్తాయి. హెపటైటిస్ బీ వ్యాధి చాలా ఆలస్యంగా బయటపడుతుంది. కొన్ని సందర్భాలలో సంవత్సరాల తర్వాత బయటపడవచ్చు. వీరిలో కామెర్ల వ్యాధి తగ్గకుండా అలాగే ఉంటుంది. వాంతులు, ఒళ్లంతా దురదలు, కొన్నిసార్లు విరేచనాలు, కడుపు ఉబ్బరంగాఉండటం, పొట్టలో నొప్పి, రక్తనాళాలు వాచిపోవడం, కిడ్నీకి సంబంధించిన సమస్యలు, ప్లేట్‌లె ట్స్ కౌంట్ పడిపోవడం, తలనొప్పి, రక్తహీనత, రక్తకణాల సంఖ్య క్రమంగా పడిపోవడం జరుగుతుంది.

ఈ వ్యాధి కొన్ని సంవత్సరాల తర్వాత బయటపడినట్లయితే దాన్ని క్రానిక్ ఇన్‌ఫ్లమేషన్ ఆఫ్ లివర్, లేదా క్రానిక్ హెపటైటిస్ అంటారు. దీని వల్ల కామెర్లు వస్తాయి.

**హోమియో చికిత్స**

కాలేయానికి ఉన్న ప్రధాన లక్షణం ఏమిటంటే తనకుతానుగా రికవరీ అయ్యే అవకాశం ఎక్కువగా ఉంటుంది. చనిపోయిన కణాలను మళ్లీ పుట్టించగలదు. హోమియో వైద్యం ఇందుకు అద్భుతంగా పనిచేస్తుంది. హెపటైటిస్‌ను సమూలంగా పారదోలే సత్తా హోమియో మందులకు ఉంది.

ADVT




# భూదేవి విజ్ఞప్తి:శంతనుని జననం

**హరివంశం పవిత్రగాథను జనమేజయునికి తిరిగి చెప్పసాగాడిలా వైశంపాయనుడు. మహారాజా! శ్రీమన్నారాయణుడు ఆ రకంగా యోగనిద్రా పరవశుడైన వేళ కృత త్రేతాయుగాలు రెండూ గడచిపోయాయి. మూడవయుగమైన ద్వాపరం గడచినకొలదీ ప్రజల భారం మోయలేక భూదేవి గొంతెత్తి ఆక్రోశించింది. దేవతలు ఆ ఆక్రోశం విని జాలి చెందారు. భూదేవి రోదనను బ్రహ్మకు విన్నవించారు. అప్పుడు దేవతలుసహా బ్రహ్మ, శ్రీమహావిష్ణువును సమీపించి, అతన్ని భక్తి ప్రపత్తులతో ప్రస్తుతించాడు. స్తోత్రాలు ఆలకించి దేవాధిదేవుడు మేలుకున్నాడు. మెల్లమెల్లగా కళ్ళు తెరచి తనని సమీపించిన దేవతలను చూశాడు. ఆశ్చర్యపోయాడు. అడిగాడిలా.**

మహామహులంతా మూకుమ్మడిగా ఇక్కడికి రావడానికి కారణం ఏమిటి? లోకాలకు ఎలాంటి ఆపదా కలగలేదు కదా? రాక్షసాధములు తిరిగి విజృంభించలేదుకదా?

ఏం చెప్పాలో, ఎలా ప్రారంభించాలో తెలియక చేతులు రెండూ జోడించి ముందు విష్ణువుకి నమస్కరించాడు బ్రహ్మ. తర్వాత విన్నవించాడిలా.

పురుషోత్తమా! మా విన్నపాన్ని కరుణార్ద్రహృదయంతో నువ్వు ఆలకించాలి. భూలోకంలో రాజులంతా పరమధార్మికదృష్టితో పరిపాలిస్తున్నారు. ప్రజలను కన్నబిడ్డల్లా చూసుకుంటున్నారు. యుద్ధాలు లేవు. న్యాయ సత్యాలను విడనాడడం లేదెవరూ. పంటలో ఆరవపాలు మాత్రమే పన్నుగా స్వీకరిస్తున్నారు. అలాగే మిత్రులను, బాంధవులను, అమాత్యులను సదా పోషిస్తున్నారు. యజ్ఞ యాగాదులతో దేవతలకు, భూదేవతలకు, పితృదేవతలకు మనస్సంతృప్తి కలిగిస్తున్నారు. సకలవర్ణాలవారు శ్రద్ధగా తమతమ ధర్మాలను నిర్వర్తిస్తున్నారు. దాంతో రోగాలుగానీ, ముసలితనంగానీ, మృత్యువుగానీ ప్రజల్ని హింసించడం లేదు. ఈ కారణంగా లోకంలో మానవులు అత్యధికంగా పెరిగిపోయారు.

అంతేకాదు స్వామీ! ఏ నగరాన్ని పరిశీలించినా అక్కడి రాజుల పదాతి గజాశ్వబలాలు కోట్ల కొలదిగా పెరిగిపోయి ఉన్నాయి. అలాగే పిల్లాపాపలతో జనపదాలసంఖ్య కూడా మించిపోతున్నది. మానవలోకం యావత్తు కృతయుగంలో అభివృద్ధి చెందినట్టుగా చెందుతోంది. జనభారాన్ని భూదేవత భరించలేకపోతోంది. గొంతెత్తి ఆక్రోశిస్తోంది. తాను కదలలేనిదైనా, విపరీతమైన శోకంతో సర్వదా సంచరిస్తున్నది. అని ఆగాడు బ్రహ్మ. కూడా ఉన్న దేవతలవైపు చూశాడు. వారంతా చెప్పమన్నట్టుగా చేతులు జోడించారు. అప్పుడు మళ్ళీ చెప్పసాగాడిలా బ్రహ్మ.

దేవాధిదేవా! సూక్ష్మంగా అదీ విషయం. ధర్మానికి హాని కలగకుండా అత్యధిక సంఖ్యలో ఉన్న రాజులను సంహరించి, భూభారాన్ని తగ్గించాల్సిందిగా వేడుకుంటున్నాం. నువ్విక ఈ యోగనిద్ర చాలించి, మేరుపర్వతానికి విజయం చేయాల్సిందిగా కోరుకుంటున్నాం. మేరుపర్వతంపై నువ్వు కొలువుదీరి, భూభారాన్ని తగ్గించడంలో మా పాత్రని ఆజ్ఞాపించాల్సిందిగా శిరసువంచి పాదాభివందనం చేస్తున్నాం.

బ్రహ్మ ప్రార్థనంతా విని లేచి కూర్చున్నాడు విష్ణువు. నాలుగు హస్తాలలో గల శంఖచక్రగదాఖడ్గాలను ఒకసారి చూసి, వాటిని సరిజేసుకున్నాడు. గరుత్మంతుణ్ణి అధిరోహించాడు. తనని విష్ణువు అధిరోహించగానే రెక్కలల్లార్చి బయల్దేరాడు గరుత్మంతుడు. అతన్ని వేలకొలది విమానాల్లో వేల్పులు అనుసరించారు.

మేరుపర్వతానికి చేరుకున్నాడు విష్ణువు. గరుత్మంతునిపై నుంచి కిందికి దిగాడు. అక్కడ విశ్వకర్మ నిర్మించిన సభాభవనంలోనికి నేరుగా నడిచాడు. ఆ భవనంలోని సమున్నత సింహాసనంపై ఆసీనుడయ్యాడు. ఆసరికే అక్కడ అమరులు, యక్షులు, గంధర్వులు, ఉరగలు, విద్యాధరులు మొదలైన వారంతా వారి వారి స్థానాల్లో సుఖాసీనులై భయభక్తులతో విష్ణువునే తదేకంగా చూడసాగారు. ఆయన ఆనతికోసం నిరీక్షించసాగారు.

అంతలో అక్కడికి భూదేవత నడవలేక నడవలేక నడచి వచ్చింది. వచ్చి ఆయాసపడుతూ నిలిచింది. ఆమెను చూసి సభాసదులంతా జాలి చెందారు. పాపం అంటూ కన్నీరు పెట్టుకున్నారు. అయ్యయ్యో అని పలవించారు. ఎంత కష్టం! ఎంత కష్టం అంటూ గోలగోల చేశారు. వారిని వాయుదేవుడు వారించి, నిశ్శబ్దంగా ఉండమన్నట్టు చూశాడు. దాంతో అంతా ఊరుకున్నారు. అప్పుడు భూదేవితో అన్నాడిలా వాయుదేవుడు.

తల్లీ! నువ్వు ఇక్కడికి ఎందుకు వచ్చిందీ అంతా వివరంగా చెప్పు!

తప్పకుండా అంది భూదేవి. విష్ణువును చూసింది. చేతులు జోడించి నమస్కరించిందతనికి. తర్వాత అందరినీ చూస్తూ చెప్పసాగిందిలా.

మహనీయులారా! విష్ణుదేవుడు, బ్రహ్మదేవుడు సహా మీరంతా కూడా నా దీనగాథ వింటారని ఆశిస్తున్నాను. చరాచర ప్రాణికోటిని సర్వదా భరించాల్సిందిగా నన్ను ఈ బ్రహ్మదేవుడు ఆజ్ఞాపించాడు. భరిస్తూ వచ్చాను. కొంతకాలానికి జగత్తుయావత్తు మహాప్రళయంలో జలధిలో మునిగిపోయింది. ఆ సమయంలో విష్ణువు కర్ణేంద్రియాల నుండి మధుకైటభులు అనే ఇద్దరు రాక్షసులు జన్మించారు. జన్మించినంతనే ఇద్దరూ ఘోర తపస్సు ఆరంభించారు. నిశ్చలంగా నిలిచి, నియమనిష్ఠ కొనసాగించారు. కొద్దిరోజులు గడిచాయి. అప్పుడు మహావాయుప్రవాహం వారి నవరంధ్రాల్లోనూ ప్రవేశించి, వారి శరీరాలను పెద్దవి చేశాయి. వాయుప్రవాహం ఇంకా కొనసాగడంతో వారి శరీరాలు పెరిగి పెరిగి సకల దిగంతాలకూ వ్యాపించారు. బ్రహ్మదేవుడు గమనించాడది. వారిని సమీపించి, వారి శరీరాలను పరిశీలించి చూశాడు. ఒకరి శరీరం మృదువుగా ఉంది. వేరొకరి శరీరం కఠినంగా ఉంది. అందుకనుగుణంగానే ఆ ఇద్దరికీ మధువు, కైటభుడు అని పేర్లు పెట్టాడు.

కొంతకాలం గడిచింది. బరువైన శరీరాలతో మధుకైటభులిద్దరూ ఆ జలధిలోనే చాలా కాలం పాటు నిద్రించారు. తర్వాత మేలుకున్నారు. మేల్కొని తమతో పోరాడగలవాడు ఉన్నాడా? ఉంటే ఎక్కడ ఉన్నాడంటూ జలధి నలువైపులా అన్వేషించారు. కొద్ది దూరంలో వారికి బ్రహ్మదేవుడు కనిపించాడు. అడుగడుగో బ్రహ్మదేవుడు అంటూ మధుకైటభులు రావడంతో భయపడి, బ్రహ్మదేవుడు పరుగుదీశాడు. వెళ్ళి, శ్రీహరినాభిపద్మమధ్యంలో దాగున్నాడు. అదే అవకాశంగా విష్ణువు, మధుకైటభుల్ని సంహరించేందుకు సాయుధహస్తుడై నిలిచాడు. సాయుధహస్తుడై విష్ణువు నిలబడడంతో తమతో యుద్ధం చేసేందుకే అతను అలా సర్వసన్నద్ధంగా ఉన్నాడంటూ ఆనందించి మధుకైటభులు అతనితో ఎడతెగని పోరాటం ప్రారంభించారు. ఆ పోరాటం అనేక వేల దివ్యసంవత్సరాల పాటు సాగింది. ఎన్ని సంవత్సరాలైనా విష్ణువు అలసిపోవడం లేదు. పైగా ఉత్సాహంతో ఉరుకుతున్నాడు.

**భూమాత రోదన చూసి బ్రహ్మసహా దేవతలంతా భరించలేకపోయారు. శ్రీమహావిష్ణువును శరణువేడారు. దాంతో ఆ భాగవతోత్తముడు గరుత్మంతునిపై ఆశీనుడై మేరుపర్వతం చేరుకున్నాడు. వేలకొలది విమానాల్లో వేల్పులు అతన్ని అనుసరించారు. మేరుపర్వతంపై విశ్వకర్మ నిర్మించిన భవనంలో సింహాసనంపై ఆశీనుడయ్యాడు. అసలు విష్ణువు అక్కడికి ఎందుకెళ్ళాడు? అక్కడ ఏం జరిగింది?**

తాము అలసిపోతున్నారు. అంటే తమకిక ప్రాణ హాని తప్పదనుకున్నారు మధుకైటభులు. అప్పుడు విష్ణువుతో అన్నారిలా.

విష్ణుదేవా! నీ పరాక్రమానికి తిరుగులేదు. నువ్వు మహాబలవంతుడివి. నీ చేతిలో మేము మరణించడం మాకు ఆనందమే! అయితే మా ఇద్దరినీ నువ్వు నీరులేని చోట సంహరించాలి.

సరేనన్నట్టుగా తలూపి, మధుకైటభుల్ని బాహుమూలల్లో బంధించాడు విష్ణువు. గట్టిగా నొక్కి వారిని హింసించి, వధించాడు. చనిపోయిన వారిద్దరినీ సముద్రమధ్యంలోనికి విసిరేశాడు. ఆ విసురులో తరంగాల తాకిడి కారణంగా మధుకైటభుల శరీరాలనుండి ప్రవహించిన మేదస్సు (కొవ్వు) తెట్టుకట్టింది. అదే తర్వాత తర్వాత భూతలంగా మారింది. వారి మేదస్సు వల్ల పుట్టిన కారణంగానే నన్ను అంతా 'మేదిని' అన్నారు.

సాగరగర్భంలో మునిగి ఉన్న నన్ను ఈ మహావిష్ణువే వరహావతారంలో సముద్ధరించాడు. త్రివిక్రమావతారంలో ఒకే ఒక అడుగుతో నన్ను ఆక్రమించుకున్నాడు. అనేకదశలలో అనేకవిధాల నా ప్రాణేశ్వరుడు నాకు అభ్యుదయం కలిగించాడు. విష్ణువు ఒక్కడే నాకు దిక్కు. నాకు మరో దిక్కులేదు. ఈ మహాదేవుడు ఆధారశక్తి అనుగ్రహించిన కారణంగానే చరాచరాలన్నిటినీ నేను భరిస్తున్నాను. పరశురాముడు క్షత్రియులందరినీ నిర్మూలించి, రక్తమాంసాలతో నిండిపోయి ఉన్న నన్ను కశ్యపమహామునికి యజ్ఞదక్షిణగా సమర్పిస్తే, నేను ఆ మహామునిని ప్రార్థించానిలా.

మహాత్మా! నా పాలకులంతా మరణించడంతో నేను విధవనై ఉన్నాను. పాడుబడ్డాను. కరుణించి నాకు ఓ అధిపతిని ప్రసాదించు.

నా అభ్యర్థనను అంగీకరించాడు మహాముని. అప్పుడు మనువును నాకు ఏలికగా నియమించాడు. మనువు ధర్మమార్గంలో పరిపాలనం కొనసాగించాడు. తర్వాత అతని వంశీయులంతా మనువునే అనుసరించి నన్ను పాలించి, స్వర్లోకం చేరుకున్నారు. ఈ విషయాలన్నీ మీ అందరికీ తెలిసినవే! ఇప్పుడు అసంఖ్యాకంగా అభివృద్ధి చెందిన రాజవంశీయుల భారం నన్ను క్రుంగదీస్తున్నది. ఈ బరువు మోయలేకున్నాను. దీనిని తొలగించగలిగితేనే నేను బతికి బట్టకట్టగలను. విష్ణుదేవుడే ఇందుకు పూనుకోవాలి. ఆ మహాదేవుడు తలచుకుంటే నేను హాయిగా జీవించగలను. లేదంటే కష్టం. దీనిని గమనించి మీరంతా తగిన విధంగా స్పందిస్తారని ఆశిస్తున్నాను.

భూదేవి దారుణాక్రోశానికి సభాసదులంతా జాలి చెందారు. బ్రహ్మదేవుని సమీపించారు. విన్నవించారిలా.

బ్రహ్మదేవా! ఈ భూదేవి దుఃఖం మాకు కన్నీరు తెప్పిస్తున్నది. ఆమె అలా రోదిస్తుంటే చూస్తూ ఊరుకోవడం మనకు మంచిది కాదు. అఖిలలోకస్రష్టవు నువ్వు. ఆజ్ఞాపించు! నువ్వెలా చెబితే అలా మేమంతా భూలోకంలో జన్మిస్తాం. శ్రీమహావిష్ణువు, మహేశ్వరుడు, కుమారస్వామి, దేవేంద్రుడు, వరుణుడు, యముడు, చంద్రుడు, సూర్యుడు, సిద్ధులు, సాధ్యులు, యక్షులు, రాక్షసులు, గరుడులు, గంధర్వులాదిగా మా మా అంశలతో మేము భూతలంపై అవతరించేందుకు అనుగ్రహించు. తర్వాత మాలో మాకే కలతలు సృష్టించి, ప్రజాభారం తొలగించేందుకు కటాక్షించు.



భూభారనివారణకు దేవతల ప్రార్థనే సరైనది అనుకున్నాడు బ్రహ్మ. ఆనందించాడు. చెప్పాడిలా.

చాలాయేళ్ళ క్రితం ఒకనాటి సాయంకాలం కశ్యపమహామునితో నేను వేదాంతగోష్ఠి జరుపుతున్నప్పుడు చంద్రోదయం అయింది. ఒకపక్క చంద్రుడు, మరోపక్క గంగాసమాగమంతో సాగరుడు ఉప్పొంగిపోయాడు. పొంగిపొర్లిపోయాడు. పొర్లిపొర్లి నేనూ, కశ్యపమహామునీ కూర్చున్న చోటును ముంచెత్తాడు. మాకు ఆందోళన కలిగించాడు. గమనించి, సముద్రుణ్ణి నేను హెచ్చరించాను. తనకిది తగదన్నాను. శాంతించమన్నాను. నా మాటలకు సముద్రుడు పరమప్రశాంతుడై మానవాకృతి ధరించి నా ముందు నిల్చున్నాడు. వీరక్షత్రియుడిలా సాక్షాత్కరించాడు. అతని రాజసం గుర్తించి, ముందుముందు సముద్రుని వల్ల ఒక దేవకార్యం నెరవేరనున్నదని గ్రహించాను. అన్నానిలా.

సముద్రా! రాజసంతో మమ్మల్ని ముంచెత్తావు. ఆ రాజసంతోనే భూలోకంలో భూపతివై జన్మించు.

ఆందోళన చెందాడు సముద్రుడు.

నా హెచ్చరికతో శాంతించి మానవాకృతి ధరించి నా ముందు నిలుచున్నావు. ఈ కారణంగా భవిష్యత్తులో నిన్ను 'శంతనుడు' అని వ్యవహరిస్తారు. గంగాదేవి ఇప్పటిలాగే అప్పుడూ నీ భార్య అవుతుంది అన్నాను.

కకావికలుడయ్యాడు సముద్రుడు. గంగసహా నాకు నమస్కరించి ప్రార్థించాడిలా.

దేవా! ఇది పర్వసమయం. గాలి చెలరేగింది. ఆపై చంద్రోదయం అయింది. ఇన్ని కారణాలతో ఉప్పొంగిపోయాను. ఇదంతా సహజంగా జరిగింది. అంతేగాని గర్వంతో నేను ప్రవర్తించలేదు. అయినా నేను తప్పు చేశాననుకుంటే నా తప్పు క్షమించి, నన్ను మానవమాత్రుణ్ణి చెయ్యకు.

సముద్రా! మానవజన్మ మనకెందుకని నువ్వు ఆందోళన చెందనవసరం లేదు. అది లోకహితార్థ కార్యం. కొంతకాలానికి వసిష్ఠుని శాపాగ్నికి గురైన వసువుల్ని, గంగాదేవి గర్భంలో జనింపజేసి, వారికి శాపవిముక్తి కలిగించేది నువ్వే! అలాగే సత్యవతీదేవితో కలసి వంశోద్ధారకులైన కుమారులను కని, స్వర్లోకం చేరుకుని, తిరిగి నిజస్వరూపం స్వీకరిస్తావు అని అభయం ఇచ్చాను. ఆ శంతనుని భావి సంగ్రహగాథ కూడా వివరిస్తాను, వినండి అన్నాడు బ్రహ్మ. వినేందుకు ఆసక్తి కనబరిచారు దేవతలు. చెప్పసాగాడిలా బ్రహ్మ.

శంతనునికి విచిత్రవీర్యుడు జన్మిస్తాడు. అతనికి ధృతరాష్ట్ర, పాండురాజులు జన్మిస్తారు. ధృతరాష్ట్రునికి నూరుగురు, పాండురాజుకి అయిదుగురు పుత్రులు జన్మిస్తారు. ధృతరాష్ట్రుని కుమారులను కౌరవులంటారు. పాండురాజు కుమారులను పాండవులు అంటారు. కురుపాండవుల మధ్య రాజ్యాధికారంకోసం తీవ్ర కలహం చెలరేగుతుంది. పెద్ద యుద్ధం జరుగుతుంది. ఆ యుద్ధంలో భూతలంపై ఉన్న రాజులంతా పాల్గొని ప్రాణాలు కోల్పోతారు. రాజులేకాదు, అసంఖ్యాకులైన వీరభటులుసహా అనేక గజాశ్వసమూహాలు నశిస్తాయి. దాంతో భూదేవి భారం తగ్గుతుంది. ఆనాటితో ద్వాపరయుగం ముగుస్తుంది.

కలి అంశతో గాంధారి పెద్దకొడుకుగా దుర్యోధనుడు, ధర్మదేవత అంశతో కుంతి పెద్దకొడుకుగా ధర్మరాజు జన్మిస్తారు. వారిద్దరే కురుక్షేత్రసంగ్రామానికి నాంది పలుకుతారన్నాడు బ్రహ్మ. భారత యుద్ధం కళ్ళకు కట్టిందేమో! కళ్ళుమూసుకున్నాడతను. కాసేపు మౌనం వహించాడు.

—అరణి



కుల్‌భూషణ్ జాదవ్

# పాఠం నేర్వని పాకిస్థాన్

**జాదవ్‌కు మరణశిక్ష విధించిన పాకిస్థాన్ దీనిపై భారత్ నుంచి వీలైనంతగా రాజకీయ ప్రయోజనాన్ని, దౌత్యపరమైన ప్రతిఫలాన్ని చేజిక్కించుకోవడానికి ప్రయత్నిస్తోంది.**

గూఢచారి అని ముద్ర వేసి ఉరి శిక్ష విధించిన కుల్‌భూషణ్ జాదవ్‌ను పాకిస్థాన్ ఇప్పట్లో ఏమీ చేయకపోవచ్చు. గతంలో చోటు చేసుకున్న కొన్ని పరిణామాలను దృష్టిలో పెట్టుకుని ఆలోచిస్తే అతన్ని ఉరి తీయడానికి పాకిస్థాన్ తొందరపడకపోవచ్చు. అలా అని అతను ఎక్కువ కాలం జైలులోనూ ఉండకపోవచ్చు. జాదవ్‌కు ఉరి శిక్ష విధించడం మీద ఇప్పుడు ప్రపంచ దేశాలన్నిటి దృష్టీ పడడంతో, పాకిస్థాన్ అతని విషయంలో న్యాయవ్యవస్థకు సంబంధించిన ప్రక్రియను మరికొంతకాలం పాటు పొడిగిస్తూ పోయే అవకాశం ఉంది. ఇదంతా తూతూ మంత్రపు వ్యవహారమేనని అందరికీ తెలుసు. అయినా పాకిస్థాన్ 'చట్టం తన పని తాను చేసుకుపోతుం'దనే మిషతో దీన్ని కొంతకాలం పాటు పొడిగించే అవకాశమే ఎక్కువగా ఉంది. చివరికి తనకు అనుకూలమైన వాతావరణంలో అతన్ని స్వదేశానికి తిరిగి పంపొచ్చు.

అయితే, స్వదేశంలోనే కాక, విదేశాల్లోనూ రాజకీయంగా వీలైనంత లబ్ధి పొందకుండా మాత్రం పాకిస్థాన్ అతన్ని విడుదల చేసే అవకాశం లేదు. పైగా ఇది పాకిస్థాన్‌లో ఎన్నికలు జరగబోతున్న సమయం కూడా. అంతేకాదు, దౌత్యపరంగా భారత్ నుంచి వీలైనంత ప్రతిఫలం పొందాలన్నది కూడా దాని కుట్రపూరిత వ్యూహం అయి ఉండొచ్చు. ఇంతకన్నా జాదవ్‌ను ఉరి తీయడమే మంచిది అన్న పరిస్థితి కూడా కల్పించవచ్చు. గతంలో వాస్తవ, ఊహాజనిత గూఢచారుల విషయంలో ఏం చేసిందో అతని విషయంలోనూ అదే చేయవచ్చు. ఉదాహరణకు, కశ్మీర్ సింగ్, సూర్జిత్ సింగ్, రవీంద్ర కౌశిక్, సరబ్‌జిత్ సింగ్ వంటి వారి విషయంలో జరిగినట్లు జాదవ్ విషయంలోనూ చేయవచ్చని భారతీయ అధికారులు ఊహాగానాలు చేస్తున్నారు. పాకిస్థాన్ జైళ్లలో 35 నుంచి 41 సంవత్సరాల పాటు మగ్గి కశ్మీర్ సింగ్, సూర్జిత్ సింగ్‌లు స్వదేశానికి జీవచ్ఛవాలుగా తిరిగి వచ్చారు. చాలాకాలం పాటు పాకిస్థాన్ జైళ్లలో దుర్భర జీవితం గడిపిన రవీంద్ర కౌశిక్, సరబ్‌జిత్‌లు చివరికి అతి భయంకరంగా మృత్యువు పాలయ్యారు.

జాదవ్ విషయంలో ఇలా జరగకూడదని భారత్ భావిస్తోంది. భారత్ గనుక ఆచితూచి వ్యవహరించని పక్షంలో పాకిస్థాన్ తప్పకుండా ఇలాగే చేస్తుందనడంలో సందేహం లేదు. జాదవ్‌కు అపిలేట్ మిలిటరీ కోర్టుకు వెళ్లడానికి అనుమతించే అవకాశం ఉంది. అక్కడ విజయం సాధించకపోతే హైకోర్టుకు వెళ్లవచ్చు. అక్కడ నుంచి కూడా నిర్దోషిగా బయటపడకపోతే, అతను పాకిస్థాన్ అధ్యక్షుడి క్షమాభిక్షకు పిటిషన్ పెట్టుకునే అవకాశం ఉంటుంది. అసలు సమస్య ఇక్కడే ఉంది. అధ్యక్షుడి దగ్గర అతని విషయం ఎంత కాలానికీ ఎటూ తేలకపోవచ్చు. ఒకపక్క జాదవ్ జైల్లో మగ్గుతుండగా పాకిస్థాన్ మాత్రం తాము ఓ పద్ధతి ప్రకారం (న్యాయం తన పని తాను చేసుకుపోతోంది) వ్యవహరిస్తున్నామనీ, అప్పటికీ జాదవ్ విషయంలో ఔదార్యంతోనే ఉంటున్నామనీ భారత్‌కూ, ఇతర దేశాలకూ చెప్పుకుంటూ ఉంటుంది. ఇదీ పాకిస్థాన్ కుటిల రాజనీతి!

## మొదటి నుంచీ ఇంతే!

సుమారు 1974 ప్రాంతంలో, పాకిస్థాన్ సైనిక దళాల గూఢచారి వ్యవస్థ (ఐఎస్ఐ) 32 ఏళ్ల కశ్మీర్ సింగ్‌ను పెషావర్ రావల్పిండి రహదారి మీద నిర్బంధంలోకి తీసుకుంది. అతను గూఢచర్యం చేస్తున్నాడని ఆరోపణలు చేసింది. అతనిపై సైనిక న్యాయస్థానం విచారణ జరిపి, అతనికి మరణ శిక్ష విధించింది. నిజానికి అతను గూఢచారి అనడానికి పాకిస్థాన్‌కు ఎటువంటి సాక్ష్యాధారాలూ లభించలేదు. రెండేళ్ల తరువాత సివిల్ కోర్టు ఈ శిక్షను ధ్రువీకరించింది. వివిధ పాకిస్థానీ జైళ్లలో సుమారు 35 ఏళ్లు గడిపిన తరువాత అతని క్షమాభిక్ష పిటిషన్ అప్పటి పాకిస్థాన్ అధ్యక్షుడు పర్వేజ్ ముషరఫ్ దృష్టిలో పడింది. ఇదంతా చూసి 'దిగ్భ్రాంతి'కి గురైన ముషరఫ్ 2008లో అతన్ని విడుదల చేశాడు. అప్పటికి అతని వయసు 67 సంవత్సరాలు. తనను 17 ఏళ్లపాటు సంకెళ్లతో ఏకాంతంగానే జైల్లో ఉంచినట్టు అతను ఆ తర్వాత చెప్పాడు. అతను గూఢచర్యం చేస్తూ పట్టుబడిన విషయం నిజమే.

ఇక సూర్జిత్ సింగ్ విషయానికి వస్తే, 1971 యుద్ధం సందర్భంగా పాకిస్థానీలు అతన్ని పట్టుకున్నారు. గూఢచర్యానికి పాల్పడ్డాడనే ఆరోపణలతో అతన్ని జైలులో నిర్బంధించారు. అతనిపై విచారణ జరిపి అతనికి మరణ శిక్ష విధించారు. 1974లోనే అతను చనిపోయాడని అంతా అనుకున్నారు. కానీ, సైనిక న్యాయస్థానం అతనికి 1985లో ఉరిశిక్షను ధ్రువీకరించింది. నాలుగేళ్ల తర్వాత పాకిస్థాన్ తాత్కాలిక అధ్యక్షుడు గులాం ఇషాక్ ఖాన్ అతని మరణ శిక్షను జీవిత ఖైదుకు తగ్గించారు. 2012 జూన్‌లో అప్పటి పాకిస్థాన్ అధ్యక్షుడు ఆసిఫ్ అలీ జర్దారీ అతనికి క్షమాభిక్ష ప్రసాదించారు. పాకిస్థాన్ జైళ్లలో సుమారు 41 ఏళ్లు మగ్గిన సూర్జిత్ ఆ క్షమాభిక్షతో విడుదలయ్యారు. రవీంద్ర కౌశిక్ కేసు కూడా ఇంతే. అతను 1983లో పట్టుబడ్డాడు. పాకిస్థాన్ సైనిక న్యాయస్థానం రెండేళ్ల విచారణ తరువాత అతనికి మరణ శిక్ష విధించింది. ఆ తరువాత అతని మరణ శిక్షను జీవిత ఖైదుకు తగ్గించారు. కానీ, అతను 1999లో 'క్షయ, గుండెపోటు' కారణంగా జైల్లోనే మరణించాడు.

1990 ప్రాంతంలో లాహోర్‌లోనూ, ఫైసలాబాద్‌లోనూ బాంబు దాడులకు పథక రచన చేసినట్టుగా ఆరోపించి సరబ్‌జిత్‌ను అరెస్టు చేశారు. 1991లో అతనికి మరణ శిక్ష విధించినప్పటికీ అతన్ని ఉరి తీయలేదు. 2013 ఏప్రిల్‌లో అతను లాహోర్ జైల్లో మర




- రాజశుక

ణించాడు. అతను ఎలా మరణించాడన్నది భారతీయ ఇంటెలిజెన్స్ అధికారులకు సైతం ఇంతవరకూ అంతుబట్టలేదు. గూఢచర్యం చేస్తున్నారనే ఆరోపణతో బల్వీర్ సింగ్, వినోద్ సాహ్నీ, సూరమ్ సింగ్, డేనియల్, రామ్‌రాజ్, గుర్‌బక్ష్ రామ్, రామ్ ప్రకాశ్‌లను కూడా అరెస్టు చేసి, దారుణ శిక్షలు విధించారు కానీ, పది పన్నెండేళ్ల తరువాత వీళ్లందరినీ విడుదల చేశారు.

## జాదవ్ కేసు భిన్నం

వీరందరి కంటే జాదవ్ కేసు భిన్నమైంది. ఇతర కేసుల్లో మాదిరిగా కాకుండా ఇక్కడ జాదవ్ రీసెర్చ్ అండ్ ఎనాలిసిస్ వింగ్ (రా) తరపున గూఢచర్యం నిర్వర్తిస్తున్నాడనడానికి ఆధారాలేమీ లేవు. నిజానికి గూఢచర్యం నిర్వర్తించడానికి అతను రా ప్రతినిధే అయి ఉండనక్కర లేదు. అయితే, జాదవ్ గూఢచారి అనడానికి మాత్రం ఎటువంటి ఆధారాలూ లేవు. అతను ఏవిధంగా చూసినా గూఢచారి కాడు. అయితే, అతను తాను గూఢచారినన్న విషయం ఒప్పుకున్నాడని పాకిస్థాన్ వాదిస్తోంది. అతను బలూచిస్థాన్ సమీపంలోని మాష్కెల్ ప్రాంతంలో అనుమానాస్పదంగా తిరుగుతుండగా 2016 మార్చి 3న తాము అరెస్టు చేసినట్టు పాకిస్థాన్ ఆరోపించింది. పాకిస్థాన్‌లో జర్మనీ రాయబారిగా పనిచేసిన గుంటెర్ ములాక్ కూడా దీన్ని ఖండిస్తున్నారు. ఆఫ్ఘనిస్థాన్, బలూచిస్థాన్ సరిహద్దుల్లో తాలిబన్లు జాదవ్‌ను పట్టుకుని ఐఎస్‌కి 'అమ్మేశారని' ఆయన వెల్లడించారు.

ఇరాసలో సరుకు రవాణా వ్యాపారం చేస్తున్న జాదవ్‌ను ఏదో విధంగా పాకిస్థాన్ పట్టుకుని, అతని మీద గూఢచర్యం ఆరోపణలు చేసి, అమానుష పద్ధతుల్లో విచారణ జరిపి మరణ శిక్ష విధించిందని కొన్ని విదేశాలు కూడా భావిస్తున్నాయి. జాదవ్ విషయంలో పాకిస్థాన్ అన్ని దౌత్యపరమైన నియమ నిబంధనలకు, నీతి నియమాలకు విరుద్ధంగా వ్యవహరించి మానవ నాగరికతకే మచ్చ తెచ్చే విధంగా నడుచుకున్నట్టు కనిపిస్తోంది. నిజానికి జాదవ్ ఓ గూఢచారి అని పాకిస్థాన్ నిరూపించలేకపోయింది. అతను బలూచిస్థాన్ తిరుగుబాటుదార్లను కలుసుకుని నేర సంబంధమైన చర్యలను ప్రోత్సహించినట్టు పాకిస్థాన్ పేర్కొంది. చివరికి ఈ ఆరోపణలను కూడా అది నిరూపించలేకపోయింది.

**భారత్, పాకిస్థాన్ సరిహద్దుల మధ్య ఉద్రిక్తతలు వీలైనంత తగ్గించడానికి అవసరమైతే మధ్యవర్తిత్వం నెరపుతామంటూ ఆమెరికా ప్రకటన చేసిన వారం రోజులకే జాదవ్‌కు పాకిస్థాన్ న్యాయస్థానం మరణశిక్ష విధించింది. భారత్ కూడా ఉగ్రవాద చర్యలకు పాల్పడుతోందని అమెరికాకు చెప్పడమే పాకిస్థాన్ ఉద్దేశంగా భావించవచ్చు. మరి ఈ సమయంలో మన కర్తవ్యం ఏమిటి?**



సరబ్‌జిత్‌సింగ్


సూర్జిత్‌సింగ్


కశ్మీర్‌సింగ్

## శిక్షపై అనుమానాలు

జాదవ్‌ను అరెస్టు చేసి, మరణశిక్ష విధించిన సమయం సందర్భం అనేక అనుమానాలకు ఆస్కారం కల్పిస్తోంది. అతన్ని అరెస్టు చేసినట్టు అది గత ఏడాది ప్రకటించింది. ఆ సమయంలో ఓ బృందం ఉగ్రవాదులు దాడి చేసిన పఠాన్‌కోట్ సైనిక స్థావరాన్ని సందర్శించాల్సి ఉంది. ఈ అరెస్టుకూ, ఆ సందర్శనకూ ఏమైనా సంబంధం ఉందా అని ఇప్పుడు చాలామంది ఆలోచిస్తున్నారు. ఆ బృందం పఠాన్‌కోట్‌కు వెడితే, పాక్ సరిహద్దుల్లో ఉగ్రవాద ధోరణులకు పాల్పడుతోందంటూ భారత్ చేస్తున్న ఆరోపణలకు బలం చేకూరుతుందని పాక్ సైనికాధికారులు భావించి ఉండాలి. భారత్ కూడా ఇటువంటి ఉగ్రవాద చర్యలకు పాల్పడుతోందనే అభిప్రాయం కలిగించడానికే పాక్ సైనికాధికారులు జాదవ్ అరెస్టును ప్రకటించి ఉండాలి. మరో విషయం ఏమిటంటే, భారత దేశ సరిహద్దుల్లో నేపాల్‌లోని లుంబిని దగ్గర పాకిస్థాన్ మాజీ సైనికాధికారి మహమ్మద్ హబీబ్ జహీర్ అకస్మాత్తుగా అదృశ్యమయ్యారు. అతన్ని భారతీయ అధికారులే నిర్బంధించి ఉంటారని పాకిస్థాన్ భావించింది. నిజంగా అతన్ని గనుక పట్టుకుని ఉంటే, తమ గూఢచర్య వ్యవహారాలు బయటపడతాయని పాక్ సైనికాధికారుల్లో ఆందోళన మొదలైంది. అతన్ని అడ్డం పెట్టుకుని భారత్ జాదవ్ విడుదలకు డిమాండ్ చేసే అవకాశం ఉందని కూడా వారు భయపడ్డారు. అందుకనే ఈ 'అదృశ్యం' జరిగిన నాలుగు రోజులకే హడావిడిగా జాదవ్‌కు మరణ శిక్షను ప్రకటించారని భారతీయ అధికారులు అనుమానిస్తున్నారు.

ఇక్కడ మరో విషయం కూడా ఉంది. భారత్, పాకిస్థాన్ సరిహద్దుల మధ్య ఉద్రిక్తతలను వీలైనంతగా తగ్గించడానికి అవసరమైతే మధ్యవర్తిత్వం నెరపుతామంటూ అమెరికా ప్రకటించిన వారం రోజులకే జాదవ్‌కు పాకిస్థాన్ మరణ శిక్ష విధించింది. భారత్ కూడా ఉగ్రవాద చర్యలకు పాల్పడుతోందని అమెరికాకు చెప్పడమే పాకిస్థాన్ ఉద్దేశంగా భావించవచ్చు.

మొత్తానికి భారత్, పాకిస్థాన్‌ల సుమారు 70 ఏళ్ల వైరానికి జాదవ్ బలిపశువుగా మారినట్టు కనిపిస్తోంది. దేశ ప్రజలంతా ఒక్క తాటి మీద నిలిచి, కేంద్ర ప్రభుత్వంమీద తీవ్రఒత్తిడి తెస్తే తప్ప అతన్ని విడుదల చేయడం సాధ్యం కాదు. జాదవ్‌ను ఉరి తీసే పక్షంలో తీవ్ర పరిణామాలు తప్పవని పాకిస్థాన్‌ను కేంద్ర ప్రభుత్వం గట్టిగా హెచ్చరించి, కార్యాచరణలోకి దిగాల్సిన అవసరం కూడా ఉంది. పాకిస్థాన్ రాజకీయ ప్రయోజనాల కోసం చూసుకుంటోందని, అందువల్ల ఇప్పట్లో జాదవ్‌ను ఉరి తీసే అవకాశం లేదన్న వాదన నిజం కావచ్చు. కానీ, ఇది భారత్ కాలయాపన చేస్తూ కూర్చోవాల్సిన సమయం కాదు. పాకిస్థాన్ అతనికి ఉరి శిక్ష విధించడమంటే భారత్‌ను రెచ్చగొట్టడమే. భారత్ తన కార్యాచరణను ఆలస్యం చేసిన కొద్దీ పాకిస్థాన్ దీన్ని మన బలహీనతగా భావించవచ్చు. దిగ్భ్రాంతులు, ఖండనలు జారీ చేసినంత మాత్రాన పాకిస్థాన్ తన వైఖరి మార్చుకుంటుందనుకోకూడదు.

నవ్య

# గొంగళి పురుగు

అడపా చిదానందమూర్తి



**గత సమ్మర్‌లో వేకువజామునే ఒకరోజు విశాఖలో మొదలైన మా సికింద్రాబాద్ రైలు ప్రయాణం సాయంకాలం నాలుగింటివరకూ ఒక మోస్తరు బాగానే సాగింది. ఎప్పుడైతే మా థర్డ్ ఏసిలో ఎసి పని చెయ్యకుండా మారాం చేసిందో అప్పుడే మొదలయ్యాయి ఆ బోగీలో కష్టాలన్నీ. కంపార్ట్‌మెంట్ నిండా సఫకేషన్, పైగా సీలింగ్ ఫాన్ విసురుతున్న వేడిగాలి మండుతున్న కొలిమినుండి వస్తున్నట్టుంది. ఏసి ఆగిపోయి అరగంటైనా రెస్టోర్ చెయ్యడానికి ఎవరూ రావడం లేదు.**

ఎండిపోయిన చెరువులో చేపపిల్లల్లా పెద్దలూ పిన్నలూ విలవిలలాడుతున్నారు. నేను నాలుగేళ్ళ మా లావణ్యను లాలిస్తూ, బుజ్జగిస్తూ నానాయాతనా పడుతున్నాను. ఓపిక నశించి దిక్కులు చూస్తుండగానే సాయంత్రం ఆరు దాటింది. కాసేపటిలో సికింద్రాబాద్ అవుటర్‌లో ట్రైన్ మెల్లగా ముందుకు పోతుంటే అందరూ క్యూ కడుతున్నారు. మామయ్యగారు రెండు సూట్‌కేసులు మోసుకుంటూ బండి దిగి పాపని అందుకున్నారు.

ప్లాట్‌ఫాం బెంచీపై కూలబడగానే ఒక్కసారిగా ప్రాణం లేచి వచ్చినట్లయింది. దగ్గరలో ఉన్న వాష్ బేసిన్‌లో నేనూ, మా పాప ఫ్రెష్ అయ్యాం కాని ప్రయాణ బడలిక వదలలేదు. కొత్త వాటర్ బాటిల్ తెచ్చుకుని చల్లటి నీటితో ఉపశమనం పొందాం. మావారింకా స్టేషన్ చేరుకోలేదు. "ఇదిగో వచ్చేస్తున్నాను, టాంక్‌బండ్ దాటాను" అని ఫోన్ చేసి అరగంట దాటినా మనిషి కనిపించటం లేదు. మాతో దిగినవారంతా హాయిగా ఇళ్ళకు వెళ్ళిపోయారు. మామయ్యగారు లైసెన్స్ కూలీ కోసం వెతుకుతుంటే మేము వెనక్కు చేరబడ్డాం.

ఏవో మాటలు వినబడుతుండగా లేచాను. కూలీ దొరికినట్లున్నాడు. మా లగేజి బయట పార్కింగ్ వద్దకు చేర్చాలని కూలీతో చెప్తుండగా నేను అటువైపు చూశాను. ఆ కూలీ అవతారం చూసి అవాక్కయ్యాను. నల్లని ముఖంతో విక్ర

తంగా అచ్చం దొంగలా కనబడుతున్నాడు. పైగా లైసెన్స్ కూలీలు సాధారణంగా వేసుకునే ఎర్రరంగు బట్టలైనా లేవు. మొత్తానికి నాకు సదభిప్రాయం కలగటం లేదు.

నాకు భయం వెయ్యడానికి కారణం ఉంది. మా రెండు పెట్టెల్లో నగలు, డబ్బు, జరీ చీరలూ అవీ ఉన్నాయి మరి. ఇప్పుడెలా? వీడెవడో మామయ్యను బోల్తా కొట్టించినట్టుంది. ఆపుదామనుకునే లోపలే మామయ్య మా రెండు పెట్టెల్నీ వాడి తల మీద ఎక్కించేశారు. నాకేదో అపశకునం బాణంలా గుచ్చుకుంది. అయినా మామయ్యకు అంత తొందరేమిటో? ఆదరాబాదరాగా నావైపు తిరిగి "అమ్మా! ఈ సామాన్ల వెనకే ఉండు. వాడిని ఒక కంట కనిపెడుతూ ఉండు సుమా" అని కూలీకి వినపడని మందస్వరంతో హెచ్చరిస్తుంటే నాకు భయం రెండింతలు కాక ఏమవుతుంది?

నేను మామయ్యవైపు తిరిగి ఉన్న సమయంలో కూలీవాడితో మా లావణ్యకు స్నేహం ఎలా కుదిరిపోయిందోగానీ 'మిత్రలాభం' కథలో లఘుపతనకము, హిరణ్యకుడిలా ఫ్రెండ్స్ అయిపోయారు. వాడు ముసిముసి నవ్వులు పూయిస్తూ దీన్ని ముద్దు చేస్తుంటే నాకు కంపరమెత్తింది. భయం

**నల్లటి ముఖంతో దొంగలా ఉన్నాడతను. మురికిబట్టలు. పోర్టర్ యూనిఫాం కూడా వేసుకోలేదు. వద్దని చెప్పేలోపే ఆమె మావగారు లగేజీ అతడినెత్తికెత్తారు. ఆమె పాపను కూడా ఆకట్టుకుని మరో చేత్తో ఎత్తుకుని నడుస్తున్నాడు. యాంత్రికంగా అతణ్ణి అనుసరించక తప్పలేదామెకు. ఆమెలో ఎన్నెన్నో భయాలు. అనుకున్నంతా అయింది. ఆ కూలీ వేగంగా నడిచి జనంలో కలిసి మాయమై జాడ లేకుండా పోయాడు! అప్పుడామె ఏం చేసింది?**

లేకుండా ఉత్సాహంగా తల్లి వెనక కోడిపిల్లలా రెస్పాన్స్ ఇచ్చేస్తోంది. వాడు తలపై ఉన్న బరువు బ్యాలెన్స్ చేసుకుంటూ చేతులు చాచి మరీ "దామ్మా! నేనెత్తుకుంటాను" అనగానే ఒక్కసారిగా జంప్ చేసుకుంటూ వాడి ఒడిలో ఇమిడిపోయింది. ఆ ఊపులో నేను అదిరిపోయి తెల్లబోయిన అవయవాలను నిలదొక్కుకున్నాను.

పాపను సునాయాసంగా ఒక చేత్తో ఎత్తుకుని పైనున్న సామాన్లు సర్దుకుంటూ "పదండి అమ్మగారు" అంటూ పక్కకు తిరిగాడు. నన్నెవరో ముందుకు తోసినట్లు యాంత్రికంగా కదిలాను. అప్పుడే వెనకున్న ప్లాట్‌ఫాంను శరవేగంతో దాటుతున్న గూడ్స్ ట్రైన్ నా గుండెల మీదుగా పరిగెత్తుతున్నట్లనిపించింది. ఆ ఒక్కనిమిషం నా మైండ్ బ్లాంక్ అయి చిమ్మచీకట్లు కమ్మాయి. ఎన్నోసార్లు ప్రయాణాలు చేశానుగానీ ఇంత బలహీనంగా ఎప్పుడూ లేను. మావారిపై విపరీతమైన కోపం దూసుకు వస్తోంది.

నన్ను నేను సంబాళించుకుంటూ నడుస్తున్నంతలో వాడప్పుడే పదడుగుల దూరంలో కనబడుతున్నాడు. అత్యంత చాకచక్యం కనబరుస్తూ వచ్చే పోయేవారిని సులభంగా తప్పించుకుంటూ అతివేగంతో 'సర్ర్' మంటూ నాగుపాములా దూసుకుపోతున్నాడు. కొంచెం మెల్లగా నడవమని చెబుదామనుకుంటే ఎంతకీ అవకాశం దొరకటం లేదు. లెక్కలేనన్ని సందేహాలతో మనసంతా కకావికలమైపోతోంది. కళ్ళింతలు చేసుకుని కూలీని అనుసరిస్తున్నాను. నీటిలో పడ్డ నూనె చుక్కలా భయం మనసంతటా ఆవరించింది.

ఊరూ పేరూ తెలియని కూలీ చేతిలో నా కూతురిని ఎలా వదిలేయగలిగాను? ఎందుకు నేను ప్రతిఘటించలేకపోయానో అర్థం కావటం లేదు. మా శ్రీవారికి ఫోన్ చేద్దామంటే సెల్ నా దగ్గర లేదు. మామయ్యగారొకరు... అతని గాబరాలో నా బ్యాగ్ తిరిగి ఇవ్వడం మరచిపోయారు. కొద్దిపాటి దూరంలో కూలీ కనిపిస్తున్నాడు కాబట్టి సరిపోయింది. కనబడకపోతే నేనేమైపోదునో!

రెండు నెలల క్రితం నేను చూసిన హృదయ విదారక దృశ్యం నా మనోఫలకంలో ముందుకొచ్చి నిల్చుంది. ఆ రోజు ఆదివారం మల్టీప్లెక్స్‌లో సినిమా చూసి మేము తిరిగి వస్తుండగా ట్రాఫిక్ జంక్షన్‌లో మా కారు అందరితోపాటు ఆగింది. అప్పుడే ఎవరో నడివయస్కురాలు మాసిన బట్టలతో ఆ పసిబిడ్డను ఎత్తుకుని అందరి దగ్గరా చెయ్యి చాపుతోంది. ఆ పసివాడికి రెండు మూడేళ్ళు ఉంటాయి. లేత బుగ్గలు ఎండకు కందిపోయి ఎరుపెక్కాయి. చూస్తుంటే నా కడుపు తరుక్కుపోయింది. అనాలోచితంగా నా చేతులు బ్యాగ్ జిప్పు లాగాయి, నూరురూపాయిలైనా ఇద్దామని. హఠాత్తుగా నా చెయ్యి మీద మా శ్రీవారు ఒక దెబ్బవేసి నన్ను వారించారు. ఆ దృశ్యాన్ని ఎన్నోసార్లు ఆయన చూసి బోగట్టా చేశారట. ఎక్కడినుంచో ఎత్తుకొచ్చిన పిల్లల్నే అలా వాడుకుంటారట. వారిని గమనించే వారికి అనుమానం రాకుండా కావలసిన రికార్డులు ఎలాగో సమకూర్చుకుంటారట. ఆ పసివాడు ఎప్పుడూ పడుకునే ఉంటాడు. అలా అయితేనే వాళ్ళ పనికి అంతరాయం కలగకుండా ఉంటుంది. ఇలాంటి దృశ్యం చూసినపుడు మానవీయ దృక్పథంతో మనలో జాలి, దయ పుట్టుకొచ్చి మనం డబ్బులిస్తామని వారికి తెలుసు.

మరికొంతమంది పిల్లలు లేని దంపతులకు కాకమ్మ కబుర్లు చెప్పి పిల్లల్ని అమ్మేస్తుంటారు. ఈ నేపథ్యంలో ఒకరి దుఃఖానుభూతి మరొకరికి అదృష్ట దేవతలా కనిపిస్తుంది. ఇంకా కొంతమంది



## ఆమె మాటలు జోకులయ్యాయి

*బాలీవుడ్ సెక్సీ హీరోయిన్ నర్గీస్ ఫక్రీ సడెన్‌గా సినిమాలు తగ్గించుకుంటున్నాను అంటూ ఓ బాంబ్ పేల్చింది. ఇక మీద సంవత్సరానికి ఒక సినిమా మాత్రమే చేస్తుందట! ఈ నిర్ణయం వెనుక ఉన్న కారణం వింటే ఎవరికైనా వెంటనే నవ్వు వచ్చేస్తుంది. సినిమా ఒక్కటే జీవితం కాదంటూ వంట తనకు అత్యంత ఇష్టమైన పని అంటోంది. ఆ తరువాత ట్రావెలింగ్ అంటే ప్రాణం అట! వీటి కోసమే సినిమాలు తగ్గించుకుంటున్నాను అంటున్న ఆమె మాటలు చూసి బాలీవుడ్ జనాలు నవ్వుకుంటున్నారు. సినిమాలు చేస్తూ కూడా ఈ రెండుపనులూ చేయవచ్చనీ, అవకాశాలు లేక సినిమాలు చేయడం లేదు అని చెప్పడానికి బదులు ఇలాంటి కహానీలు వినిపిస్తోందని అంటున్నారు. సినిమాలు తగ్గిన విషయాన్ని ఏదో విధంగా కవర్ చేద్దామనుకున్న నర్గీస్ ఆలోచన ఇలా బెడిసి కొట్టిందట!*

ముక్కుపచ్చలారని పసికందులను సేకరించి రహస్య స్థావరంలో పెంచుతారు. కొంతమందిని మూగ వారిగాను, గుడ్డివారిగాను, కుంటివారిగాను నేర్పుగా తయారు చేస్తారు. పిల్లలను తిట్టి, కొట్టి భయపెట్టి ప్రజల మధ్యకు పంపి డబ్బు దండుకు తెమ్మంటారు. పారిపోకుండా వారిని ఒక కంట కని పెడుతుంటారు. ఇదొక వ్యాపారం. దీని వెనకాల కొందరు ఆకతాయిలు కథను రక్తి కట్టిస్తారు. ఈ పిల్లలే కొన్నాళ్ళకు సమాజంలో చీడ పురుగులు అవుతారు. అప్పుడు వారిని పోలీసులు పట్టుకుని దండిస్తారు. చిన్నప్పుడే పిల్లలు మాయం అవ కుండా చూసే బాధ్యత ఎవరు తీసుకుంటారో!

మావారు చాలా విషయాలు సేకరించారు. ఇలాంటి వారిని ప్రోత్సహించవద్దంటున్నారు. వీరికి దయ చూపించి డబ్బు ఇస్తే అది అపాత్రదానమే అవుతుంది. వీరి గుంపును సమర్థించుకుంటూ పోతే మరెన్నో గుంపులు తయారవుతాయి. అలాగే పసిపిల్లలను పోగొట్టుకున్న కుటుంబాలు సమా జంలో పేరుకు పోతాయి. ఇలాంటి సంఘటనలు జరగకుండా ప్రారంభంలోనే అడ్డుకోవాలని సంకల్ప మున్నవారంతా ముందుకి రావాలి.

మని వేగం మరింతగా పెంచాను, కానీ మస్తిష్కం నా ఆధీనంలో ఉండటం లేదు. ఆలోచనల దాడి తగ్గటం లేదు.

ఒక న్యూస్ పేపర్‌లో ఎప్పుడో నేను చదివిన వార్త మనసులో మెదిలింది. మా ఇంటికి దగ్గరలోనే ఒక ఆసుపత్రిలో రాత్రి పుట్టిన బేబీ తెల్లవారేసరికి ఉయ్యాలలో కనిపించలేదు. సిబ్బందిలోనివారే బయటివారికి సహకరించినట్లు తేలింది. ఇలాంటివి జరిగిపోయిన తర్వాతే పత్రికలవారికీ, పోలీసులకూ తెలుస్తుంది. అలా జగరకుండా ఉండడానికి ఏ ఏర్పాట్లు ఉండవా? ఆ తల్లి మానసిక పరిస్థితి ఎలా ఉంటుందో అని ఊహించాలంటేనే భయమేస్తుంది నాకు.

నవమాసాలూ కఠిన దీక్షావ్రతం చేసి జన్మ నిచ్చిన చిన్నారులను కసాయితనంతో తల్లినుండి మాయం చేసి ఎత్తుకుపోయినవారు పురాణాల్లో చూపించిన దానవుల ప్రతిరూపాలై ఉంటారు. దేవ తలను హతమార్చబూనిన వారిని దశాయుధాలతో సంహరించిన జగన్మాత, మీలోనే ఇలాంటి దానవులు న్నారు సుమా అని మనల్ని హెచ్చరిస్తున్నా మనకు అర్థం కాదు. అవన్నీ కట్టు కథలుగా భ్రమలో పడి బలి పశువులమవుతున్నాం. ఇలాంటి నేరాలు అరి




ఎవరో వీల్ చైర్‌లో నా దారికడ్డం రాగానే ఒక్క సారిగా ఏదో గుర్తొచ్చి తల పైకెత్తి చూశాను. కూలీ ఆ చివరలో ఉన్న ఫుట్ ఓవర్ బ్రిడ్జికి దగ్గర్లో ఉన్నాడు. నేను వెనకాల వస్తున్నానా లేదా అన్న ధ్యాస అతనికి ఉన్నట్లు లేదు. ఎలాగో తప్పించు కుని అందరి కళ్ళూ కప్పి పారిపోదామని అనుకుంటు న్నాడో ఏమో. నా కంఠంలోని ప్రాణం ఎగిరిపో యినా సరే నేను వాడిని వదిలేది అసంభవం. నేను ఎదురొచ్చేవారిని చేతులతో నెట్టుకుంటూ ముందుకు పోతుంటే ఎవరివో కామెంట్లు వినిపిస్తున్నాయి. నేనెవరినీ పట్టించుకోకుండా గమ్యం చేరడానికి ప్రయత్నిస్తున్నాను. వాడు కనిపిస్తున్నాడు కాబట్టి ధైర్యం వచ్చింది.

వాడు కనిపిస్తూ మధ్యలో మాయమవుతూ నన్ను తికమక పెడుతూ బయటకు వెళ్ళే బ్రిడ్జి మెట్లెక్కబోతున్నాడు. మా లావణ్యను ఇంకా నవ్విస్తు న్నాడు గాబోలు అది చేతులు ఊపుతూ తలాడి స్తోంది. హమ్మయ్య! అనుకున్నాను. దగ్గరగా పోదా

కట్టే సెక్యూరిటీ వ్యవస్థను బలోపేతం చెయ్యమని ఫోర్స్ చెయ్యాలి, నాయకులను. ఇదిగో నేను మళ్ళీ నా స్వంత ప్రాబ్లమ్ పక్కనపెట్టి ఏవేవో ఆలోచిస్తూ కూలీని మానిటర్ చేయలేకపోతున్నాను. కుక్కతోక పట్టుకుని గోదావరిలో ఈత కొట్టినట్లు ఉంది నా స్థితి. బాగా పరికించి చూశాను. ఫస్ట్ ప్లాట్‌ఫాంలో దిగడానికి రెండువైపులా మెట్లున్నాయి. వాడెటు వైపు దిగిపోయాడో. నాలో ఆందోళన మళ్ళీ మొద లైంది. అలాంటి చోట్ల అనేక మార్గాలుంటాయి బయటకు పారిపోవడానికి. పాప వాడి దగ్గర ఉండిపోవడం నన్ను తీవ్రంగా ఇబ్బంది పెడు తోంది. ఏం చెయ్యడానికీ తోచక శక్తినంతా కూడబెట్టు కుని బిగ్గరగా “ఏయ్ కూలీ! అమ్మా లావణ్యా” అంటూ అరిచాను. జనాల గోలలో నా మాటలు నీటిలో పాలలా కలిసిపోయాయి.

దొంగతనాలు చేసేవారికి సహకరించే దొంగలు అన్నిచోట్లా ఉంటారని ఆసుపత్రి ఘటన మళ్ళీ మళ్ళీ నాకు గుర్తుకొస్తోంది. వాడికీ ఎవరైనా ఉంటా

రేమో? కంగారుగా నడుస్తూ చివరివరకూ వెళ్ళి ఆగిపోయాను. ఎటువైపు దిగాలో డిసైడ్ చెయ్యడా నికి ఊగిసలాడుతూ ఏమైతే అయిందిలే అను కుంటూ మెయిన్ గేటువైపే దిగసాగాను.

నా మనసులోని నిరాశాభావాలు పీడిస్తుంటే శరీరంలో రక్తప్రవాహం స్తంభించినట్లనిపిస్తోంది. నా సర్వస్వం మోసుకుపోతున్న కూలీ కనుచూపు మేరలో ఎక్కడా కనిపించడం లేదు. నా పరధ్యానం నా కొంప ముంచినట్లుంది అనుకుంటూ వెనక్కు తిరిగి రెండోవైపు పరిగెత్తాను. నేనందరి దృష్టిలో పిచ్చి దానిలా కనిపిస్తున్నానేమో అనిపించింది.

బరువెక్కిన తలతో నేను తూలి కింద పడ బోయే తరుణంలో ఎదురుగా మావారు వచ్చి నన్ను పొదివి పట్టుకున్నారు. నేను పూర్తిగా వాలిపోయి “లావణ్య” అంటూ ఏదో చెప్పబోయి ఊపిరి అందక మాట్లాడలేకపోయాను. అంతలో వాటర్‌బాటిల్‌లోని చల్లని శీతల జలం నా ముఖాన్ని కెరటంలా తాకింది.

మావారు కర్చీఫ్‌తో నా ముఖం ఒత్తుతుండగా కళ్ళు విప్పాను. అప్పుడే మామయ్యగారు పాపను ఎత్తుకుని ఎదురుగా వచ్చారు. ఆ వెనుకనే దీనంగా నిల్చున్న కూలీ కనిపిస్తున్నాడు. కలా నిజమా అను కున్నాను. నేను కనిపించడం లేదని స్టేషన్ మైకులో ఎనౌన్స్‌మెంట్ చేయిద్దామని వెళితే ఆ కూలీని వదల కుండా ఉంచమన్నారట. టచ్‌మినాట్ మొక్కలా సిగ్గుతో ముడుచుకుపోవడం నా వంతైంది. రూప భ్రమ అనాలోచితంగా నాలో రేపిన ఊహాగానం, నన్నెంత దుఃఖపెట్టిందో అర్థమైంది. అవును మని షిలో దాగివున్న నిజ వ్యక్తిత్వం అతని రూపంలో ఎలా కనిపిస్తుంది?

అతనికి కొంచెం ఎక్కువ డబ్బులిచ్చి పంపించ మన్నాను మా ఆయనతో. కానీ ఆశ్చర్యంగా నా అంచనా తారుమారైంది. అతను డబ్బు తీసుకో లేదు. అతను నా కూతురువైపు ఆర్తిగా చూస్తూ తలపై మృదువుగా తన కుడిచెయ్యి వేసి “ఎప్పుడో ఎవరో మాయం చేసి తీసుకుపోయిన నా ముద్దుల కూతురును మీ లావణ్యలో చూసుకుని మురిసిపో యానమ్మా! తనతో ఆనందంగా గెంతుతూ స్టేష నంతా తిరుగుతూ ఆడుకున్నాను. మీరు వెనకనే వస్తున్నారని కూడా మర్చిపోయాను. ఈ దివ్యమైన స్వప్న, ఈ సంతృప్తి నా జీవితకాలం జ్ఞాపకముం చుకుంటాను. ఇరవై సంవత్సరాల క్రితం మాయ మైన నా కన్నతల్లి ఇప్పుడెక్కడ ఎలా ఉందోనన్న రంపపు కోతను నేనెట్లా భరించనమ్మా! అమ్మా నాన్నలను వదలి చిన్నారులు మాయం కాకూడదని ఆ కనకదుర్గను వేడుకుంటున్నానమ్మా” అంటూ సజల నేత్రాలతో వెక్కి వెక్కి ఏడుస్తూ జనవాహి నిలో కలిసిపోయాడు. గొంగళి పురుగులా కనిపిం చిన కూలీ ఇప్పుడు పంచవన్నెల సీతాకోకచిలుకై నా మనోమందిరంలో ఎగరసాగాడు.

**సెల్: 09880249218**

## సరదాగా....

### నేను చేసిందదే!

ఒక వ్యక్తి తన డబ్బులు తీసుకోవడానికి ఫ్రెండ్ ఇంటికి వెళ్ళాడు. డోర్ బెల్ మోగించాడు. ఆ శబ్దం విని ఒక పిల్లాడు బయటకు వచ్చాడు.

వ్యక్తి: బాబు.. మీ నాన్న ఇంట్లో ఉన్నారా..?

పిల్లాడు: లేరు అంకుల్.. ఏదో కొనుక్కోవాలని బయటకు వెళ్ళారు.

వ్యక్తి:పోనీ మీ అన్నయ్య ఉన్నాడా? తనను పిలువు!

పిల్లాడు: లేడంకుల్.. అన్నయ్య కూడా క్రికెట్ ఆడుకోవడానికి వెళ్లాడు.

వ్యక్తి: కనీసం మీ అమ్మయినా ఇంట్లో ఉండి ఉంటుంది కదా.. ఆమెనైనా పిలువు బాబు!

పిల్లాడు: అమ్మ కూడా కిట్టీ పార్టీకి వెళ్ళింది. అందరూ రాత్రివరకు తిరిగి రారు.

వ్యక్తి: ఆ మాటలన్నీ విని, మరి నువ్వెందుకు ఇంట్లో చచ్చావ్.. నువ్వు కూడా ఎక్కడికైనా బయటకు వెళ్ళిపోవచ్చుగా?

పిల్లాడు: ప్రస్తుతం నేనున్నది కూడా నా ఫ్రెండ్ ఇంట్లోనే అంకుల్!

### ఒక ప్రశ్న?

రంగాపురం గ్రామంలో కూలిపని చేసుకునే పుల్లన్నకి పొడుపుకథల పుల్లన్న అనే పేరు ఉంది. పొడుపుకథలను విప్పమని పందెం కాసి, ఓడిపోయిన వారి దగ్గర నుంచి డబ్బు తీసుకునేవాడు. అలా ఒకనాడు అదే ఊరిలో ఉండే రంగయ్య, పుల్లన్న అడిగిన పొడుపు కథకు సమాధానం చెప్పలేక ఉన్న డబ్బంతా ఇచ్చేసి ఇంటికొచ్చాడు. అతని భార్య మంగ తాయారు చాలా తెలివైనది. రంగయ్య విచారంగా ఉండడం చూసి ఏం జరిగిందో తెలుసుకుని, పుల్లన్నకి తగిన గుణపాఠం చెప్పాలనుకుంది. పుల్లన్న దగ్గరకు వెళ్ళి, పొడుపుకథ చెప్పు. నేను కనుక దాన్ని విప్పితే, రంగయ్య డబ్బు మొత్తం తిరిగి ఇచ్చేయాలని పందెం కాసింది. పుల్లన్న పొడుపుకథను ఇలా పొడిచాడు. "చూస్తే చూసింది కానీ కళ్ళు లేవు. నవ్వితే నవ్వింది కానీ పళ్ళు, నోరు లేవు. తంతే తన్నింది కానీ కాళ్ళు లేవు. ఎవరది?" మంగతాయారు బాగా ఆలోచించి సమాధానం చెప్పి, తన డబ్బులు తను తీసుకుంది. మరి మీరూ ప్రయత్నించండి?

# తీన్ మార్



బాచి











2

# మనసుగతి ఇంతే!

-వక్కంతం సూర్యనారాయణరావ్, సెల్:98662 67287

**"మరో మూడేళ్ళు అమెరికా.. ఆ తరువాత ఇండియా. ఈ రెండూ మీకు... ఐమీన్ నీకు ఇష్టమేనా?"**

**"నాకు అభ్యంతరం లేదు."**

**"అన్నట్టు... నువ్వు నన్ను ఒక ప్రశ్న అడగలేదు..." వినయ్ చిరునవ్వుతో అడిగాడు.**

**"ఏమిటి?" సంధ్య కళ్ళు ప్రశ్నార్థకంగా చూశాయి.**

"ఊహించు!"

సంధ్య కళ్ళు చిట్లించి, క్షణం సేపు ఆలోచించింది. చిరునవ్వు ఆమె ఎర్రటి పెదాల్ని విడదీసి, తెల్లటి పళ్ళను చూపించింది. "అర్థమైంది.."

"ఏమిటి?"

"మీకు నేను నచ్చానా? అని అడగలేదు."

"ఇప్పుడు అడుగుతున్నావా?"

సంధ్య అవునన్నట్టు తల పంకించింది.

"నచ్చకపోతే నేను కూడా మేడమెట్లు ఎక్కేవాణ్ణి కాదు!" వినయ్ నవ్వాడు.

"థాంక్స్.."

"సంధ్యా, కొంచెం అడ్వాన్స్‌గా అనిపిస్తున్నప్పటికీ, నీకో విషయం చెప్పాలని నా హృదయం ఆరాట పడుతోంది. నేను చెప్పే మాటలోని ఎక్స్‌ప్రెషన్ భావావేశం కావచ్చు. నీకు పొయెటిక్‌గా అనిపించవచ్చు. షల్ ఐ సే ఇట్?"

"చెప్పండి..."

"వాట్టైమీన్ టుసే... సారీ! అమెరికా ప్రభావం. మధ్యమధ్యలో ఇంగ్లీషు తొంగిచూస్తోంది. నేను చెప్పాలనుకున్నది ఏమిటంటే..." వినయ్ ఆగి, సంధ్య వైపు చూశాడు.

"సందేహం దేనికి? చెప్పండి. నేనేమీ అనుకోను!" సంధ్య చిన్నగా నవ్వింది.

"నీ పాట విన్నప్పట్నుంచీ నా భావావేశాన్ని నీకు వినిపించాలనిపిస్తూనే ఉంది. ఆ భావం.. ఆ భావావేశం.. నిజానికి నా కోరిక.."

"అలాగా..."

"నేను.. నేను.. ప్రతీ రాత్రీ నీ పాట వింటూ నిద్రపోవాలి. ప్రతీ ఉదయం నీ పాట వింటూ మేల్కొనాలి.." వినయ్ కంఠం కొద్దిగా వణికింది. కళ్ళెత్తి సంధ్య ముఖంలోకి చూశాడు.

"థాంక్స్... థాంక్సండీ..." సిగ్గు సంధ్య కంఠస్వరంలో లీలగా ధ్వనించింది.

"నా ఆవేశాన్ని అర్థం చేసుకున్నందుకు నేనే నీకు థాంక్స్ చెప్పాలి!" వినయ్ ఉద్రేకంతో అన్నాడు.

సంధ్య చిన్నగా నవ్వింది "వెళ్దామా?" అంటూ.

"మనం మళ్ళీ కలుసుకోవాలి" వినయ్ పైకి లేస్తూ అన్నాడు.

"ఎప్పుడు?" సంధ్య కంఠంలో సందేహం ధ్వనించింది.

"రేపు... ఎల్లుండి... ఆవలెల్లుండి.. వరసగా!"

"ఎక్కడ? ఇక్కడేనా?"

## జరిగిన కథ

ఒకదాని తరువాత ఒకటిగా కంప్యూటర్ స్క్రీన్ మీద ఫోటోలు జరిగిపోతున్నాయి. అన్నీ సంధ్య ఫోటోలే! అతనికి ఎటుచూసినా ఆమే కనబడుతోంది. మంత్రముగ్ధుడిలా ఆమెనే చూస్తూ తన తీయటి గతంలోకి జారుకుంటాడు వినయ్. అమెరికాలో ఉన్న వినయ్‌ని వెంటనే ఇండియా బయలుదేరి రమ్మంటూ తల్లి శాంతమ్మ ఫోన్‌చేస్తుంది. సడన్‌గా పెళ్ళిచూపులంటుంది. దానికి తండ్రి శ్రీనాథరావు, చెల్లెలు సుధ కూడా వంతపాడతారు. దాంతో ఇండియా వస్తాడు వినయ్. కుటుంబంతోసహా పెళ్ళిచూపులకి వెళతాడు. తొలిచూపులోనే సంధ్యను చూసి ఫ్లాటైపోతాడు. ఇద్దరినీ గదిలోకి పంపించి భావాలు, అభిప్రాయాలు పంచుకోమంటారు పెద్దలు. ఇద్దరూ ఒకరికి ఒకరు నచ్చినట్లుగా చెప్పుకుంటారు.

ఆ తర్వాత....

"బిర్లామందిర్... శిల్పారామం... జూలాజికల్ పార్క్... చిలుకూరు బాలాజీ ఆలయం... ఎక్కడైనా ఎప్పుడైనా.. నువ్వు చెప్పిన టైమ్‌కి!"

సంధ్య చిన్నగా నవ్వింది. "అమ్మనూ, నాన్ననూ పర్మిషన్ అడగాలి..."

"నో అబ్జెక్షన్!"

సంధ్య చిరునవ్వు నవ్వి, తలుపు వైపు వెళ్ళింది. వినయ్ ఆమెను వెంబడించాడు. తలుపు తెరిచి, సంధ్య కొద్దిగా పక్కకు జరిగి, నవ్వు ముఖాన్ని వినయ్ వైపు తిప్పింది. 'పదండి!'

వినయ్ నవ్వుతూ తల అడ్డంగా ఊగించాడు.

"ముందు ముద్దుగుమ్మలు!"

సంధ్య ముఖం నునుసిగ్గుతో కొద్దిగా ఎర్రబడింది. గుమ్మం దాటింది. వినయ్ ఆమె వెనుక... సంధ్య వెనుక ఎందుకున్నాడో, ఎందుకుండాలన్నాడో వినయ్‌కి మాత్రమే తెలుసు!

***

మేడ దిగి వచ్చిన కూతురి వెంట లోపలి గదిలోకి వెళ్ళారు ఆనందరావూ, సుమిత్రా.

"ఏమిటి మాట్లాడుకున్నారు?" సోఫాలో తన పక్కనే కూచోగానే వినయ్‌ని అడిగింది సుధ.

"టాప్ సీక్రెట్!" వినయ్ నవ్వుతూ అన్నాడు.



"ఏయ్... అన్నాయ్... ఆ సీన్‌క్రియేషన్ మనది! తెలుసా? చెప్పుచెప్పుచెప్పు!" సుధ దబాయించింది.

"ఇష్టాయిష్టాలు మాట్లాడుకున్నాంలే!"

"అయిష్టాల్తో మనకు పనిలేదు. ఇష్టాలు చాలు. చెప్పు. ఒకర్నొకరు ఇష్టపడుతున్నట్టు చెప్పుకున్నారా?"

"అంతేగా!" వినయ్ నవ్వాడు.

"ఏయ్ అమ్మాయ్, అన్నీ ఇప్పుడే, ఇక్కడే కక్కేయాలా? ఇంటికెళ్ళాక తీరికగా మాట్లాడుకుని..." శాంతమ్మ లౌక్యం వ్యక్తం చేస్తూ చెప్పసాగింది.

"అమ్మా... దాపరికాలూ, దాగుడుమూతలూ వద్దు. చేసుకుంటామని చెప్పేయండి" వినయ్ అన్నాడు.

"అంతే! అమ్మాయి మనందరికీ నచ్చింది. అంతకన్నా ఏం కావాలి?" శ్రీనాథరావు అన్నాడు.

"కావాల్సినవి బోల్డన్ని ఉంటాయి. అవన్నీ చర్చించుకుని చెప్పాలి... ఆ!"

వినయ్ సుధ భుజం మీద చెయ్యివేసి దగ్గరగా వాల్చుకుని ఆమె చెవిలో ఏదో చెప్పాడు. "అమ్మకీ, నాన్నకీ చెప్పు!"

సుధ లేచి తల్లిదండ్రులిద్దరి మధ్య కూచుంది. వినయ్ సందేశాన్ని ఇద్దరి చెవుల్లోకి గుసగుసగా వినిపించింది.

"అర్థమైందిగా అమ్మా?" సుధ సోఫాలోంచి లేస్తూ అంది.

"ఎందుకర్థం కాదే? చక్కగా అర్థమయ్యేట్టు చెప్పావుగా?" శాంతమ్మ అంది, సీరియస్‌గా చూస్తూ.

"నాన్నా.. విషయం మీరు చెప్పేయండి" వినయ్ అన్నాడు.

"ఆ మాత్రం నేనూ చెప్పగలను!" శాంతమ్మ గొణిగింది.

"అబ్బబ్బ... ఇద్దరూ పంచుకోండే!" సుధ ఉరిమి చూస్తూ అంది.

"కరెక్ట్!" వినయ్ నవ్వాడు.

"వాళ్ళ అభిప్రాయం వాళ్ళు చెప్పేదాకా ఆగుతారా, పోనీ?" శాంతమ్మ కొడుకునీ, కూతుర్నీ గుర్రుగా చూస్తూ అంది.

"అలాగే లేవే!" సుధ తగ్గుస్వరంలో అంది.

ఆనందరావూ, సుమిత్రా, సంధ్యా వచ్చి సోఫాల్లో కూచున్నారు.

"అయ్యా, మా వైపు నుండీ శుభవార్త చెప్తున్నాను. మా అమ్మాయికి మీ అబ్బాయి నచ్చాడు..." ఆనందరావు చిరునవ్వు నవ్వుతూ అన్నాడు.

"మా వైపు నుండి కూడా శుభవార్తే..." శ్రీనాథరావు ప్రారంభించాడు.

"మా అబ్బాయికీ మీ అమ్మాయి నచ్చింది!" శాంతమ్మ అడ్డొస్తూ అంది.

"మధురమైన మాట అన్నారు. చాలా సంతోషం. జాతకాలు చూసిన సిద్ధాంతి ప్రమాణం చేసి మరీ చెప్పాడు. ఒకరికొకరు నచ్చితీరాల్సిందే... భార్యాభర్తలు కావాల్సిందే అన్నాడు. ఇద్దరి జాతకాలూ పాలునీళ్ళలా కలిసి పోతున్నాయన్నాడు!"

ఆనందరావు ఉత్సాహంగా అన్నాడు.

"అంతకంటే ఏంకావాలండీ మనకు?" శ్రీనాథ రావు హుషారుగా అన్నాడు. ముఖ్యమైన విషయం ఏమిటంటే మేం కట్నాలూ, గిట్నాలూ తీసుకోం. పోతే..."

"మీ అమ్మాయికి నగలేం పెడతారో మీ ఇష్టం. అల్లుడికి శాస్త్రప్రకారం అవసరమైన లాంఛనాలు అన్నీ ఇవ్వండి. మా కోడలికి నగలేం పెట్టుకుంటామో మా ఇష్టం!" శాంతమ్మ విషయాన్ని పంచుకుంటూ అంది.

"అలాగలాగే! మీ పద్ధతీ, మీ మాటతీరూ మాకు గొప్పగా నచ్చాయి!" ఆనందరావు అన్నాడు. అమ్మాయి తనక్కావాల్సిన నగలేవో తానే సెలెక్ట్ చేసి కొనుక్కుంటుంది."

"ఇక్కడా అంతే! సంధ్యా, నేనూ, అన్నయ్యా వెళ్తాం. తనక్కావాల్సిన నగల్ని సంధ్యా, నేనూ సెలెక్ట్ చేస్తాం. అన్నయ్య కొనిస్తాడు!" సుధ ఉత్సాహంగా అంది. "ఏం అన్నాయ్, ఏమంటావ్?"

"ఏమంటాను? నీ మాట కాదంటే ఊరుకుంటావా?" వినయ్ నవ్వాడు.

"శుభం! అంతా మా అమ్మాయి అదృష్టం. ఫిల్టర్ కాఫీతో సెలబ్రేట్ చేసుకుందాం!" ఆనందరావు కంఠంలో ఉత్సాహమూ, ఆనందమూ పెనవేసుకున్నాయి.

"అమ్మాయ్, విన్నావుగా! పద!" సుమిత్ర పైకి లేస్తూ అంది.

"మీరు కూచోండి ఆంటీ. సంధ్యా, నేనూ పట్టుకొస్తాం కాఫీలు!" అంటూ పైకి లేచింది సుధ.

సంధ్య చిరునవ్వుతో పైకిలేచింది.

"మీ అమ్మాయి సుధ ఇట్టే కలిసిపోతుంది వదిన గారూ!" సుమిత్ర అంది.

"చిన్నప్పట్నుంచీ అంతే అది. కొత్తా పాతా లేదు. అంతా నా పోలికే!" శాంతమ్మ సగర్వంగా అంది.

"పొద్దుట నా పోలికన్నావ్?" శ్రీనాథరావు నవ్వుతూ అన్నాడు.

"మీరూరుకోండి! సందర్భాన్నిబట్టి అలా అంటూ ఉంటాం!" శాంతమ్మ అంది.

అందరూ నవ్వారు.

***

ఇద్దరూ చిలుకూరు బాలాజీ ఆలయ ప్రాంగణంలోకి వచ్చారు. గుడిచుట్టూ జనం గుంపులుగా పరిగెడుతున్నట్టు నడుస్తున్నారు. చాలామంది చేతుల్లో ప్రదక్షిణలు అంకెలు ప్రింట్ చేసిన కాగితం ముక్కలూ, బాల్‌పాయింట్ పెన్నులూ ఉన్నాయి.

"అబ్బ... ఎంత మందో!" సంధ్య ఆశ్చరంగా అంది.

"వాళ్ళల్లో చాలామంది నూట ఎనిమిది ప్రదక్షిణలు చేసేవాళ్ళున్నారు" వినయ్ అన్నాడు.

"మీరెప్పుడయినా అన్ని ప్రదక్షిణలు చేశారా?"

"లేదు! మొక్కు చేసుకోలేదు; ప్రదక్షిణలు చేయలేదు. ఏదయినా కోరిక తీరాలంటే ముందుగా పదకొండు ప్రదక్షిణలు చేసి, కోరిక తీరగానే నూట ఎనిమిదిసార్లు గుడిచుట్టూ తిరుగుతామంటూ మొక్కు చేసుకుంటారు.."

"విన్నాను. గుడికి రావడం ఇప్పుడే!" సంధ్య అంది.

"పదకొండు ప్రదక్షిణలు చేసి, కోరిక దేవుడికి విన్నవించుకుని మొక్కు చేసుకుందామా?" వినయ్ నవ్వుతూ అడిగాడు.

"ఏం కోరుకుంటారు?" సంధ్య కంఠంలో కుతూహలం.

"చెప్పుకో చూద్దాం!"

"ఊహుఁ... మీరే చెప్పండి!"

"మన పెళ్ళి నిర్విఘ్నంగా జరిగి, మన దాంపత్యం చక్కగా ఉండాలని మొక్కుకుందాం. సరేనా!"

"మీ ఇష్టం!"

"నీ ఇష్టం చెప్పు!" వినయ్ చిన్నగా నవ్వాడు.

"మీ ఇష్టమే నా ఇష్టం..."

"సరే. ఇద్దరి తరపునా నేనే మొక్కు చేసుకుంటాను. ఓకే?"

"మీ ఇష్టం!" సంధ్య నవ్వుతూ అంది.

"సరే... రా. ముందు పదకొండు ప్రదక్షిణలు. తరువాత మొక్కు!" అంటూ వినయ్ ధ్వజస్తంభం వైపు నడిచాడు. ధ్వజస్తంభం ముందు నిలబడి దేవుడి వైపు నమస్కరించి, ప్రదక్షిణ ప్రారంభించాడు. సంధ్య అతన్ని అనుసరించింది. కాసేపట్లో ఇద్దరూ పక్కపక్కనే నడుస్తున్నారు. వేగంగా నడు

**శిల్పి చెక్కిన పాలరాతిబొమ్మలా, అయస్కాంతశిల్పంలా సంధ్య అతణ్ణి మోహావేశపు సంకెళ్ళతో పట్టి లాగుతోంది. తెల్లటి వస్త్రాలలో శ్వేతాభిసారికలా, వెన్నెల బొమ్మలా ఉన్న సంధ్య అతడివైపు నెమ్మదిగా అడుగులు వేస్తోంది. అడుగులో అడుగు వేస్తూ అతణ్ణి సమీపించిన ఆమె ఒక్కసారిగా కుప్పకూలిపోయింది. అసలు ఆమెకేమయింది? స్పృహ తప్పిందా? ఆ తర్వాత ఏం జరిగింది?**

స్తున్న భక్తులు ఇద్దర్నీ అటూఇటూ నెట్టేస్తున్నారు. వినయ్ అసంకల్పితంగా సంధ్య చేతిని పట్టుకున్నాడు. సంధ్య చేతిని లాక్కోలేదు. అతనివైపు వాలుగా చూస్తూ చిరునవ్వు నవ్వింది. పదకొండు ప్రదక్షిణలు పూర్తయ్యాయి. ధ్వజస్తంభం ముందు నిలబడి వినయ్ కళ్ళు మూసుకొని తన కోరిక కోరుకుని మొక్కుచేసుకున్నాడు. క్యూలో వెళ్ళి ఇద్దరూ బాలాజీ దర్శనం చేసుకున్నారు. ఎవరో భక్తురాలు దొప్పల్లో పులిహోర నింపి, అందరికీ అందిస్తోంది. సంధ్య, వినయ్ ఇద్దరూ ప్రసాదం తింటూ గుడి వెలుపలికి వచ్చి, కారువైపు నడిచారు.

దారిలో చెట్టుకింద ఎవరో ముసలామె జామ పళ్ళు అమ్ముతోంది. వినయ్ కారాపాడు. పది రూపాయలిచ్చి, జామ పళ్ళు అందుకొమ్మన్నాడు సంధ్యతో. సంధ్య పళ్ళు అందుకుంది. వినయ్ కారు అద్దాలు దించి, ఏసీ ఆపుచేశాడు. చల్లటి గాలి వీస్తోంది. ఇద్దరూ జామపళ్ళు తినడం ముగించారు. సంధ్య బాబ్డ్ హెయిర్‌తో గాలి ఆడుకుంటోంది.

"నాకు చాలా సంతోషంగా ఉంది సంధ్యా..." ఉపోద్ఘాతం లేకుండా ఉన్నట్టుండి అన్నాడు వినయ్.

"మొక్కు చేసుకున్నందుకా?"

"కాదు."

"మరయితే... సంతోషం దేనికి?" సంధ్య వినయ్ వైపు చూస్తూ అడిగింది.

"నువ్వు నన్ను ఇష్టపడ్డందుకు."

"ఓ.. అందుకా?" సంధ్య చిరునవ్వు నవ్వుతూ అంది. "మీకో నిజం చెప్పాలనిపిస్తోంది. చెప్పమంటారా?"

"తప్పకుండా. నేనెప్పుడూ సత్యాన్ని స్వాగతిస్తాను!" వినయ్ కారు స్టార్ట్ చేస్తూ అన్నాడు. కారు ముందుకు కదిలింది.

"నిజం చెప్పాలంటే... మా అమ్మానాన్నల ఇష్టాన్ని నా ఇష్టంగా చేసుకుని మీకు చెప్పాను.

కారు ఒక్కసారిగా పక్కకి తిరిగింది. కారుని చిన్నగా మళ్ళించి, సంధ్యవైపు ఆశ్చర్యంగా చూశాడు. "నీ ఇష్టం కాదా... అయితే?"

"అమ్మానాన్నల ఇష్టమే నా ఇష్టం" సంధ్య ముక్తసరిగా అంది.

వినయ్ రోడ్డువారగా కారు ఆపాడు. సంధ్యవైపు తిరిగాడు. "నాకు అర్థం కాలేదు సంధ్యా. నీకంటూ



వ్యక్తిగతంగా ఇష్టమంటూ లేదా?"

"అలా ఎందుకనుకుంటారు? అమ్మానాన్నల ఇష్టాన్ని నా ఇష్టంగా చేసుకున్న క్షణంలోనే అది 'నా ఇష్టం'గా మారిపోయిందిగా!" సంధ్య నవ్వుతూ అంది.

"ఒకవేళ మీ అమ్మానాన్నలు నన్ను ఇష్టపడక పోయివుంటే?" వినయ్ ఆమె ముఖంలోకి చూస్తూ అన్నాడు.

"నేనూ ఇష్టపడేదాన్నికాను..." సంధ్య తొణ క్కుండా అంది. "నిజం చెప్తున్నందుకు క్షమిం చండి..."

వినయ్ కళ్ళు చిట్లిస్తూ చూశాడు. ఏదో ఆలో చన అతని నుదురుమీద గీతలు గీస్తోంది.

"ఎక్స్‌ప్లెయిన్ చేస్తాను. నేను చిన్నప్పట్నుంచీ అంతే. గారాబంగా పెరిగాను. అయినప్పటికీ నా బాగోగులన్నీ నాకు తెలీకుండానే నన్ను కన్నవా ళ్ళకు వదిలేశాను. వాళ్ళు ఏం చేయమంటే అది చేశాను. ఏది చదవమంటే అదే చదివాను. అమ్మా నాన్నా ఏది చెప్పినా నా మంచికోసమే చెప్తారనీ, ఏది చేసినా నా మంచికోసమే చేస్తారనీ నాకు తెలుసు. ఆ నమ్మకం చిన్నప్పట్నుంచీ నా రక్తంలో కలిసి ప్రవహిస్తోంది' అమ్మానాన్నల మాట నాకు మేటి బాట! తప్పంటారా?" గాలి చెల్లాచెదురు చేసిన బాబ్డ్ హెయిర్ సర్దుకుంటూ అడిగింది సంధ్య.

"తప్పు అనుకోను. సూక్ష్మంగా ఆలోచిస్తే నీ బరువు బాధ్యతల్ని అమ్మానాన్నల మీద వేసేసి, నువ్వు రిలాక్స్ అయినట్టుగా అనిపిస్తోంది. అది పొరపాటుతత్వం అని అనను. కానీ... ఎలాంటి మనిషికయినా జీవితకాలంలో ఎప్పుడో ఒకప్పుడు 'తన ఇష్టం' అనే భావన కలిగి తీరుతుంది. నీలో ఎప్పుడు అలాంటి భావం కలుగుతుందో చూద్దాం.." వినయ్ సంధ్య వైపు చూడకుండా, రోడ్డునే చూస్తూ అన్నాడు.

సంధ్య చిన్నగా నవ్వింది. "ఇప్పటిదాకా అది జరగ లేదు. రాబోయే రోజుల్లో జరుగుతుందనుకోను!"

వినయ్ సంధ్యవైపు వాలుగా చూశాడు. "చూద్దాం!" అంటూ కారు స్టార్ట్ చేశాడు.

***

ఒక సుముహూర్తంలో వినయ్ సంధ్య మెడలో మూడు ముళ్ళూ వేశాడు. 'సాలంకృత' కన్యాదానం చేసిన ఆనందరావు కూతురి ఒంటినిండా నగలు పెట్టాడు. రకరకాల నగలతో, వజ్రాల నెక్లెస్‌తో అలంకరించబడిన సంధ్య సౌందర్యం వెయ్యింతలై కనువిందు చేసింది, వినయ్‌కి.

ఒక అందాలరాశిని అర్ధాంగిగా పొందిన వినయ్‌ని మిత్రులందరూ అదే పనిగా అభినందించారు.

శరీరంనిండా ఖరీదైన నగలతో బంగారు బొమ్మలా అవుపిస్తున్న కోడలిని చూసి శాంతమ్మ పొంగిపోయింది.

"చూశావా, ఎలాంటి చక్కని చుక్కను నీ కోసం సెలెక్ట్ చేశానో!" అంది సుధ వినయ్ చెవిలో గుస గుసగా.

తమతో బాటు పక్కనే పీటలమీద కూచున్న తల్లిదండ్రుల్నీ, అత్తమామల్నీ మరిచిపోయి, వధువు సంధ్యనే చూస్తూ ఉండిపోయాడు వినయ్. అందం తన అర్ధాంగి అయింది! సౌందర్యం తన సహధర్మ చారిణి అయింది! తనూ, సంధ్యా దంపతులయ్యారు. 'మంగళసూత్రప్రాయం'గా ఏర్పడిన తమ దాంప త్యానికి పరిపూర్ణత సిద్ధిస్తుంది, ఈ రాత్రికే....

***

గదిలో మల్లెపూల సౌరభం, అగరొత్తుల పరి మళం కలిసిపోయి పారవశ్యాన్ని పండిస్తూ రాజ్యం చేస్తున్నాయి. మధురమైన సువాసన వినయ్‌లో ఏదో అలౌకికమైన అనుభూతిని కలిగిస్తోంది.

మంచం మీద పువ్వుల పందిరి వేశారు. బొండుమల్లెల సరాలు కిందికి వేళ్ళాడుతూ మత్తె క్కించే సౌరభాన్ని వెదజల్లుతున్నాయి. వినయ్ గది మధ్య నిలుచుని, గదంతటినీ కలియజూశాడు. చేయితిరిగిన ఆర్ట్ డైరెక్టర్ వేసిన సినిమా శోభనం గది సెట్టింగులా అద్భుతంగా ఉంది గది!

పువ్వులూ, పళ్ళూ, స్వీట్లూ అన్నీ ఉన్న అంద మైన గదిలో తనున్నాడు. అన్నీవున్నా, తనువున్నా ఏదో వెలితి కనిపిస్తోంది వినయ్‌కి. ఆ లోటూ, ఆ వెలితీ ఏమిటో తనకు తెలుసు; సంధ్య లేకపోవడం. నవవధువు అయిన సంధ్య ఇంకా గదిలోకి రాక పోవడం!

వినయ్ నవ్వుకుంటూ నిలువుటద్దం ముందుకు నడిచాడు. పాలనురగలాంటి తెల్లటి పైజామా, కుర్తాలో ఉన్న ప్రతిబింబం వినయ్‌వైపు చిరునవ్వు నవ్వింది. తనలో ఏదో కొత్త అందం, ఏదో కొత్త ఆక ర్షణ కనిపిస్తున్నాయి. కళ్ళకు కాటుక, బుగ్గమీద దిష్టిచుక్క. 'మగవాడికి ఇలా కళ్ళకు కాటుకా, బుగ్గ మీద చుక్కా పెట్టుకునే అవకాశం ఒక్కసారే వస్తుంది; పెళ్ళిలో! అడ్డు చెప్పకుండా కాటుకా, బుగ్గచుక్కా పెట్టించుకో!' అంది తన కళ్ళకి కాటుక పెడ్తూ సుధ! ఔను... తనలో కొత్త కళ ప్రవేశిం చింది. పెళ్ళికొడుకు కళ!

వినయ్ అద్దంలో కనిపిస్తున్న పూలపందిరి మంచాన్ని చూసి, వెనక్కి మంచం వైపు తిరిగాడు. మంచం మౌనంగా తనని ఆహ్వానిస్తోంది. వినయ్ వెళ్ళి, మంచం మీద కూచున్నాడు. చేతులు వెనక్కి చాపి, వాలుగా మంచం మీదికి వాలాడు.

తలుపు దగ్గర చప్పుడైంది. వినయ్ తిన్నగా కూచుంటూ, గుమ్మం వైపు చూశాడు. తలుపు కొద్దిగా తెరుచుకుంది. సంధ్య లోపలికి వచ్చింది. నవ్వులు సన్నగా వినిపిస్తున్నాయి. తలుపు మూసు కుంటూ ఆ నవ్వుల్ని మింగేసింది. వినయ్ అసం కల్పితంగా మంచం మీంచి దిగి, నిలుచుని సంధ్య



## అమ్మ చెప్పినా వినలేదట!

కల్యాణ్ రామ్ 'కత్తి' చూసిన వారికి సనా ఖాన్ గుర్తుండే ఉంటుంది. ఆ సినిమా తరువాత తెలుగులో రెండు మూడు సినిమాలు చేసినా పెద్దగా ప్రయోజనం కలగలేదు ఆమెకి. దాంతో బాలీవుడ్‌కి జంప్ అయింది. అక్కడ అందాల ఆరబోతే ధ్యేయంగా సినిమాలు చేస్తోంది. సినిమాల్లో అందాల ఆరబోతకి ఆమె తల్లి అభ్యంతరం చెప్పిందట! ఇలాంటి సినిమాల వలన మంచి పేరుకన్నా చెడ్డ పేరే ఎక్కువగా వస్తుంది. అవసరమైతే సినిమాలు మానుకోమంటూ సనా తల్లి కూతురికి హితవు చెప్పిందట! అయినా తను తన తల్లి మాట వినలేదనీ, దర్శకనిర్మాతలు ఎలా నటించమంటే అలా నటిస్తున్నాననీ చెప్పుకొచ్చింది. తన మాట వినలేదని తల్లికి తన మీద కొద్దిగా కోపంగా ఉన్నా పెద్ద మనసుతో తనను అర్థం చేసుకుందని అంటోంది.

వైపు చూశాడు. గుండె దడదడ కొట్టుకుంది.

మంచులా మెరిసిపోతున్న తెల్లచీర, తెల్ల జాకెట్. తెల్లటి దుస్తులతో బంగారం రంగు శరీరం. సంధ్య తల కొద్దిగా వాలి ఉంది. ఎర్రటి పెదవులు తడిగా మెరుస్తున్నాయి. సిగ్గు బరువు ఆమె కను రెప్పల మీద కాపురం చేస్తోంది. సంధ్య తల కొద్దిగా పైకి లేచింది. కళ్ళను మూసిన రెప్పల కవాటాలు కొద్దిగా తెరుచుకున్నాయి. జ్యోతుల్లా వెలుగుతున్న కళ్ళు. జ్యోతుల మీద బోర్లించిన అరచేతుల్లా వంపులు తిరిగిన అందమైన కనుబొమలు. కను బొమల మధ్య దీపకళిక ఆకారంలో ఎర్రటి తిలకం. మెడలో మంగళసూత్రం... ఒంటి రంగులో కలిసి పోయిన పసుపుతాడు. దానికితోడు సన్నటి బంగారు గొలుసు. వినయ్ చూపులు ఆరాధనా భావంతో సంధ్య శరీరాన్ని స్పృశిస్తూ కిందికి జరి గాయి.

ఉచ్ఛ్వాసనిశ్వాసాలు, స్పందనను కళ్ళకు కట్టు తున్న పైట, రెండు జంట పర్వతాలను కప్పిన




తెల్లటి పల్చటి మేఘంలా ఉంది. బంగారు తీగ ల్లాంటి చేతుల్లో వెండి పాలగ్లాసు పట్టుకుంది సంధ్య. తన నూతన వధువు అందాన్ని చూస్తూ మాటలు మరిచిపోయిన వినయ్ తటాలున తేరు కున్నాడు. సంధ్య తన అర్ధాంగి. అందాలభరిణ అయిన తన నవవధువు సిగ్గుతో తలుపు దగ్గరే ద్వారబంధం ఫ్రేములో అందమైన ఆయిల్ పెయిం టింగ్‌లో ఆరితేరిన శిల్పిచెక్కిన పాలరాతి బొమ్మలా, శక్తిమంతమైన అయస్కాంతశిల్పంలా సంధ్య తనను కనిపించని బంగారు సంకెళ్ళతో, తన వైపు లాగుతోంది. తటాలున బుర్రలో తళుక్కుమన్న ఆలోచన కదలబోయిన అతడి కాళ్ళను కట్టేసింది. సంధ్య తన ఆరోప్రాణం... సిగ్గుల మొగ్గలు సింగా రించుకున్న శోభనం పెళ్ళికూతురు అందంగా అడు గులో అడుగువేస్తూ తనవైపు రాజహంసలా నడిచి రావాలి. ప్రాణం వచ్చిన శిల్పసుందరి శృంగార నాయిక తనవైపు సిగ్గు బరువుతో అందంగా అడు గులు వేయాలి. శృంగార నాయిక నిసర్గ సౌంద ర్యాన్ని చలనంలో తను చూడాలి. కనువిందు చేసు కోవాలి. తెల్లటి వస్త్రాలలో శ్వేతాభిసారికలా ఉన్న తన సిగ్గుల పెళ్ళికూతురు, వెన్నెల బొమ్మలా ఉన్న సంధ్య నడిచే సౌందర్యంలా రావాలి.

"సంధ్యా..." పారవశ్యంతో కంఠం పెగుల్చుకుని మృదువుగా పిలిచాడు వినయ్.

సంధ్య రెప్పలెత్తి చూసింది.

"రా సంధ్యా... ఇలారా!" వినయ్ పిలుపులో ప్రేమావేశం వణికింది.

సంధ్య పాదాలు నెమ్మదిగా కదిలాయి. అడు గులో అడుగు వేస్తూ వినయ్ వైపు నడవసాగింది. నడక ఆమె అందాన్ని హెచ్చవేత వేస్తోంది. నాలు గడుగులు వేసిన సంధ్య ఎందుకో ఆగింది. ఆమె కుడిచెయ్యి వెండి పాలగ్లాసును ఎడం చేతికి వది లేసి మెల్లిగా పైకి లేచింది. సంధ్య కళ్ళు మూసు కుంటూ, కుడిచేత్తో కణతను నొక్కుకుంది. వినయ్ రెప్పపాటు మరిచిపోయి చూస్తూ ఉండిపోయాడు. సంధ్య నెమ్మదిగా రెండడుగులు వేసింది. వినయ్ చిరునవ్వుతో చూస్తున్నాడు. రెప్పలెత్తి క్షణకాలం వినయ్‌వైపు చూసింది సంధ్య. వినయ్‌ని ఆశ్చ ర్యంలో, ఆందోళనలో ముంచివేస్తూ ఒక్కసారిగా కుప్పకూలిపోయింది సంధ్య. ఆమె ఎడమ చేతిలోని పాలగ్లాసు నేలమీద పడి చప్పుడు చేసింది. బోర్లా పడిన సంధ్య కింది నుంచీ పాలు కాలువ కట్టింది.

క్షణం సేపు అచేతనంగా నిలబడిపోయిన వినయ్, వణికే కాళ్ళతో సంధ్య వైపు పరుగెత్తాడు. ఎవరో నరికి పడేసిన తీగలా పడున్న సంధ్యను ఆందోళ నతో చూస్తూ, వణుకుతున్న చేతుల్తో ఆమెను వెల్లకిలా తిప్పాడు. ఆదుర్దాతో సంధ్య ముక్కు వద్ద వేలిని ఉంచాడు. అదృష్టం! సంధ్య ఉచ్ఛ్వాసనిశ్వాసాలు జరుపుతోంది. వినయ్ తేలిగ్గా ఊపిరి పీల్చుకుంటూ రెండు చేతులతో సంధ్యను ఎత్తుకుని, మంచం వైపు మోసుకెళ్ళాడు. పళ్ళూ అవీ ఉంచిన టేబుల్ మీదున్న బాటిల్ అందుకుని, మూత తీసి, సంధ్య ముఖం మీద నీళ్ళు చిలకరించి, సున్నితంగా తుడిచాడు. సంధ్యలో చలనం లేదు. ఆమె కళ్ళు తెరవలేదు. బరువుగా ఊపిరి పీల్చుకుంటూ, వదులుతూ ఉంది.

వినయ్ బుర్ర మొద్దుబారిపోయింది. పెదవులు ఎండిపోతున్నాయి. కాళ్ళు వణుకుతున్నాయి. దిక్కు తోచనివాడిలా అటూ ఇటూ చూశాడు. అప్పుడే ఆలోచన వచ్చినట్టు గుమ్మం వైపు పరిగెట్టాడు. తలుపు తెరిచి, మెట్లమ్మట కిందికి దిగసాగాడు.

"మామయ్యగారూ!" అది వినయ్ పిలుపు కాదు; అరుపు.

బొంగురుగా తయారైన కంఠంతో మామ య్యను పిలుస్తూ మెట్లమ్మట కిందికి పరిగెత్త సాగాడు వినయ్.

***

సంధ్యను పరీక్షించిన డాక్టర్ శివాని ఆదుర్దాగా చూస్తున్న ఆనందరావు దంపతులనూ, వినయ్‌నీ కలియ జూసింది. "ఇప్పుడు సంధ్య తాత్కాలికంగా స్పృహ తప్పిన స్థితిలో ఉందని నా అనుమానం. ఆనందరావు గారూ, సంధ్యకు ఇంతకు ముందెప్పుడైనా ఇలా జరిగిందా?"

"నెవర్!" ఆనందరావు నొక్కుతూ అన్నాడు. "మీరు మా ఫ్యామిలీ డాక్టర్. మీకు తెలీనిదేముంది?"

"మీకు తెలుసుగా! అమ్మాయికి కొద్దిపాటి జ్వరం తప్ప, చిన్నప్పట్నుంచీ ఇప్పటిదాకా ఏ జబ్బూ రాలేదు.." సుమిత్ర అంది.

"అఫ్‌కోర్స్.." డాక్టర్ శివాని తలపంకిస్తూ అంది. అచేతనంగా పడున్న సంధ్య చేతిని అందుకుని, నాడి పరీక్ష చేసి, చేతిని నెమ్మదిగా ఆ మంచం మీద పెట్టింది.

"డాక్టర్ గారూ ఎందుకిలా జరిగింది?" వినయ్ ఆందోళనను దాచుకోలేకపోతూ అడిగాడు.

"ఇది టెంపరరీ ఫెయింటింగ్. బ్లడ్‌ప్రెజర్ పడి పోవడం ఒక కారణం. రెండో కారణం మెదడుకి తగినంతగా ఆక్సిజన్ అందకపోవడం. బీపీ కొద్దిగా డ్రాప్ అయినట్టుంది. కొద్దిగానే!"

"సీరియస్ కాదుగా, డాక్టర్ గారూ?"

"అలా అనుకోను. ఒక్కోసారి విపరీతమైన మాన సిక ఒత్తిడి వల్ల కూడా ఇలా జరుగుతూ ఉంటుంది. ఎందుకైనా మంచిది. సంధ్యను మా నర్సింగ్ హోమ్‌కి తీసికెళ్దాం" డాక్టర్ శివాని అంది.

"మామయ్యగారూ, మీరు కారు బైటికి తీయండి. సంధ్యను నేను తీసుకొస్తాను. అత్తయ్యా, మీరు మా నాన్నకు ఫోన్ చేయండి. నర్సింగ్‌హోమ్‌కి రమ్మనండి" వినయ్ అన్నాడు.

"అలాగే నాయనా" అంది సుమిత్ర.

డాక్టర్ శివాని వినయ్ వైపు జాలిగా చూసింది. "ఏమయినా ఈ సందర్భంలో ఇలా జరగడం దుర దృష్టకరం.."

"ఎప్పుడూ లేంది, శుభంగా కార్యం జరగాల్సిన ఈరాత్రి అమ్మాయికి ఇలా అవడం...కడుపు తరుక్కు పోతోంది డాక్టరు గారూ..." సుమిత్ర గద్గద కంఠంతో అంది.

"అవన్నీ తరువాత! ముందు అమ్మాయిని హాస్పిటల్‌కి తీసికెళ్దాం!" ఆనందరావు హెచ్చరిస్తూ గుమ్మం వైపు కదిలాడు.

**(ఇంకా వుంది)**

## మైగ్రేన్ (పార్శ్వపు తలనొప్పి)

తరుచుగా తలనొప్పి వస్తే అశ్రద్ధ చేయకూడదు. ఎందుకంటే తలనొప్పికి చాలా కారణాలున్నాయి. రక్తపోటు, మెదడులో కణతులు, రక్తనాళాలలో రక్త ప్రసరణలో మార్పులు, మానసిక ఒత్తిడి, నిద్రలేమి వల్ల, మగవారిలో రక్తపోటు, మానసిక ఒత్తిడి, మెదడులో కణతుల వల్ల తలనొప్పి వచ్చే అవకాశం ఉంటుంది. మైగ్రేన్ తలనొప్పి స్త్రీలలో అధికంగా చూస్తుంటాం. ఈ నొప్పి చాలావరకు తలకు ఒకపక్కవస్తుంది. వాంతులూ ఉండవచ్చు. తలలోని రక్తనాళాలు ఒత్తిడికి లోనయి వాచడం వల్ల ఈ నొప్పి వస్తుంది.

**పార్శ్వపు తలనొప్పికి కారణాలు:** పార్శ్వపు తలనొప్పి కి మానసిక ఆందోళన, ఒత్తిడి ముఖ్య కారణాలు. అనవసరపు ఆలోచనలు, జరిగిపోయిన విషయాల ను తరుచుగా ఆలోచించడం వల్ల వస్తుంది. డిప్రేషన్, నిద్రలేమి, కొందరిలో బయటకు వెళ్ళి నప్పుడు, సూర్యరశ్మి వల్ల, అధికంగా ప్రయాణాలు చేయడంవల్ల వస్తుంది. స్త్రీలలో హార్మోన్ల సమస్యలు ఏర్పడినప్పుడు, ఋతుచక్రం ముందుగా గాని, తర్వాత గాని వచ్చేఅవకాశం ఉంటుంది. గర్భాధారణ సమయంలో స్త్రీలలో ఋతుచక్రం ఆగిపోయినప్పుడు ఈ సమస్య తీవ్రమయ్యే అవకాశం ఉంటుంది. ఓరల్ కాంట్రసెప్టివ్ పిల్స్ లాంటి కొన్నిరకాల మందులువాడటంవల్ల రావచ్చు.

**మైగ్రేన్ దశలు-లక్షణాలు:** సాధారణంగా 24-72 గంటల్లో దానంతట అదే తగ్గవచ్చు. ఒకవేళ నొప్పి 72 గంటలు ఉంటే స్టేటస్ మైగ్రేన్ అంటారు. మైగ్రేన్ 4 దశలలో సాగుతుంది.

**ప్రోడ్రోమ్ ఫేజ్:** ఇది నొప్పికి ముందు 2 గంటల నుంచి 2 రోజుల ముందు వరకు జరిగే ప్రక్రియల సమూహం. ఈ దశలో చిరాకు, మానసికఆందోళన, డిప్రెషన్, ఆలోచనలో మార్పులు రావడం, వాసన, వెలుతురు పడకపోవడం, మెడనొప్పి ఉంటాయి.

**ఆరాఫేజ్:** ఈ దశ నొప్పి ప్రారంభానికి కొద్ది నిమిషాల ముందు ఉంటుంది. చూపు మందగించడం, జిగ్ జాగ్ లైన్స్ కనిపించడం, తలలోసూదులు గుచ్చిన ఫీలింగ్, మాటలు తడబాటు, కాళ్ళలో నీరసం ఉంటాయి. **నొప్పిదశ:** ఈ నొప్పి దశ 2 గంటల నుంచి 3 రోజుల వరకు ఉండే అవకాశం ఉంటుంది. ఈ దశలో వాంతులు ఉంటాయి. చాలా వరకు ఒక వైపునే ఉంటుంది. కాంతికి, ధ్వనికి చాలా సెన్సిటివ్‌గా అంటే చికాగ్గా అనిపిస్తుంది. **పోస్టడ్రోమ్ ఫేజ్:** నొప్పి తగ్గిన తర్వాత కొద్ది రోజుల వరకు తలభారంగా అనిపిస్తుంది. ఒళ్ళంతా నీరసంగా, నిరాసక్తంగా అనిపిస్తుంది.



**వ్యాధి నిర్ధారణ:** 1 రక్త పరీక్షలు-సీబీపి, ఈఎస్ఆర్ 2. రక్తపోటును గమనించడం. 3.ఈఈజీ పరీక్ష సిటీస్కాన్(మెదడు). 4.ఎం.ఆర్.ఐ పరీక్షలు ఉపకరిస్తాయి. **మైగ్రేన్ రాకుండా తీసుకోవాల్సిన జాగ్రత్తలు:** 1. మానసిక ఆందోళన తగ్గించాలి.




**డా. మురళి అంకిరెడ్డి**
M. D (Homeo)
**స్టార్ హోమియోపతి**


2. అతిగా ఆలోచనలు చేయకూడదు. మానసిక ఒత్తిడి తగ్గించుకోవాలి. దీనికోసం యోగా, ప్రాణాయామం చేయాలి. ధ్యానం ద్వారా మానసిక ప్రశాంతత లభిస్తుంది. 3. తలకు నూనేతో మసాజ్ చేసుకుంటే తలలోని నరాలు రిలాక్సవుతాయి.

4.తలనొప్పి వచ్చినప్పుడు ప్రశాంతవాతావరణంలో, లైటు తీసేసి నిశ్శబ్దంగా ఉన్నచోటపడుకోబెట్టాలి.

**హోమియోవైద్యం:** మైగ్రేన్ తలనొప్పికి హోమియోలో మంచి మందులున్నాయి. ఘాటైన వాసనలు పీల్చిన పుడు వస్తే బెల్లడోనా, లైకోపోడియం, ఇగ్నిషియా ఇవ్వాలి. తరుచు ఎక్కువగా వస్తుంటే, నాట్రంమూర్, సాంగ్యునేరియా, చైనా, సెపియా ఇవ్వాలి. గర్భవతు ల్లో వస్తే బెల్లడోనా, నక్స్‌వామికా, సెపియా ఇవ్వాలి. ఎక్కువగా చదవడం వల్ల వస్తే కాల్కేరియా కార్బ్, నాట్రామూర్, ట్యూబర్కులినమ్. ప్రయాణాల వల్ల వస్తే -ఇగ్నిషియా సెపియా, కాక్యులస్, కాలికార్బ్ ఇవ్వాలి. స్కూల్‌కి వెళ్ళే ఆడపిల్లలో వస్తే – కాల్కేరియాఫాస్ నాట్రంమూర్, పల్సటిల్లా ఇవ్వాలి. పైన తెలిపిన మందులు కేవలం అవగాహనకు మాత్రమే. వాటిని నిష్ణాతులైన హోమియో డాక్టర్‌ని సంప్రదించి మాత్రమే తీసుకోవాలి.


www.starhomeopathy.com తెలంగాణ । ఆంధ్రప్రదేశ్ । కర్నాటక । దుబాయి । లండన్ । మాంచెస్టర్ © 90300 64224


## అశ్మరీకి ఆయుర్వేద వైద్యం

**అశ్మరీ అనేది మూత్ర సంబంధ వ్యాధులలో ఒకటిగా చెప్పుకోవచ్చు. అంటే మూత్రంలో రాళ్ళు పడటం వంటి సమస్య. గడిచిన ఇరవై సంవత్సరాల కాలంలో ఎంతోమంది ఈ వ్యాధితో బాధపడు తున్నారు. ఇంకా పడుతూనే ఉన్నారు. అయితే ఈ వ్యాధికి ఆయుర్వేదం సరైన వైద్యమని అంటున్నారు ప్రముఖ ఆయుర్వేద వైద్యనిపుణులు డాక్టర్ లక్ష్మీ. అశ్మరీ వ్యాధి గురించి, దానికి సంబంధించిన లక్షణాలు, చికిత్స గురించి ఆమె వివరిస్తున్నారు.**

సాధారణంగా ఇరవై నుంచి నలభైఏళ్ళ మధ్య వయసున్న వారిలో ఈ అశ్మరీ వ్యాధి ఎక్కువగా కనిపిస్తుంది. ఆయుర్వేదశాస్త్రం చెబుతున్న వివరాల ప్రకారం 'అశ్మరీ' అంటే రాళ్ళు అని అర్థం. మూత్ర సంబంధ వ్యాధులలో అశ్మరీ ఒకటి. దీన్నే రీనల్ కాలిక్యులై అని కూడా అంటారు. మన శరీరంలోని కొన్ని భాగాల్లో రాళ్ళు ఏర్పడుతుంటాయి. ప్రధానంగా కిడ్నీలలో, మూత్రాశయంలో, మూత్ర నాళాల్లో ఏర్పడతాయి. అయితేకిడ్నీలలో తయారైన రాళ్లు ముత్ర విసర్జన ద్వారానే బయటకు వెళ్తాయి. మూత్ర విసర్జన క్రియలో ప్రధాన పాత్ర వహించేది కిడ్నీలే కాబట్టి మూత్ర విసర్జక సమస్యలు ఏర్పడ తాయి. మూత్రవిసర్జనలో సమస్యలు ఏర్పడితే విపరీతమైన ఇబ్బందికి గురి కావల్సి ఉంటుంది. అందుకే అశ్మరీ వ్యాధికి చికిత్స చేయించుకోవటం కన్నా అది రాకుండా జాగ్రత్తలు తీసుకోవటం ఉత్తమం.

**వ్యాధికారకాలు:** 1. అధిక మాంసాహారం తీసుకో వడం. 2. ద్రవపదార్థాలు తక్కువగా తీసుకోవడం. 3. పీచు పదార్థాలు తక్కువగా తీసుకోవడం. 4. అధిక మానసికఒత్తిడి, బీపీ అధికంగా ఉండటం. అశ్మరీ ఏర్పడటానికి తోడ్పడే పదార్థాలు. అంటే మెగ్నీషియం, సిట్రేట్, ఫాస్ఫేట్స్, ఆక్సిలేట్స్, కొన్ని రకాల డయూరిటిక్స్, యాంటీ యాసిడ్స్ వాడకం అధికమైనపుడు మరియు మూత్రంలో పీహెచ్ మార్పు వచ్చి నప్పుడు, గౌట్ వ్యాధితో బాధపడే వారిలో కూడా అశ్మరీ ఏర్పడటానికి ఎక్కువ అవకాశాలుం టాయి.

**లక్షణాలు:** అశ్మరీని తీవ్రమైన తరువాత గుర్తిస్తారు చాలామంది. ఎందుకంటే వ్యాధి చాలా వరకు ఎలాంటి ప్రత్యేక లక్షణాలు కనపడ కుండానే ఏర్పడుతుంది. క్రమంగా తీవ్రత పెరుగుతుంది.

1. మూత్రవిసర్జనలో మంట, ఏదో అడ్డు పడినట్టు ఉండటం, నొప్పి 2. మూత్రం లో రక్తం పడటం. 3. వాంతి రావటం లేదా వచ్చినట్లు అనిపించడం. చలితో జ్వరం రావటం. అసౌక్యర్యంగా అని పించటం కడుపులో నొప్పి, నడుంనొప్పి ఈ నొప్పి నడుం వెనుక భాగం నుండి ఉదర కిందిభాగం వరుకు ఉంటుంది.

**జాగ్రత్తలు:** ద్రవ పదార్థాలు ఎక్కువగా తీసుకోవాలి. ముఖ్యంగా మంచినీరు, బార్లీ నీరు ఎక్కువగా తాగాలి. మాంసాహారం, పాలకూర, టమేటా, క్యాబేజీ, పాల పదార్థాలు విటమిన్-సి, డి ఉన్న పదార్థాలు తగ్గించాలి. ఆల్కహాల్, కాఫీ, టీలు, మసాలా పదార్థాలు, నూనే పదార్దాలు తక్కువగా తీసుకుంటేమంచిది. ఒత్తిడి, ఆందోళన తగ్గించు కోవాలి, దినచర్యలో మార్పులు ఉండేలా చూసుకోవాలి.

**చికిత్స:** ఆయుర్వేదంలో ఈ అశ్మరీ సమస్యలకు ప్రత్యేక ఔషద చికిత్సలు ఉన్నాయి. ఈ చికిత్సా కాలం అశ్మరీ సమస్య తీవ్రత మీద ఆధారపడి ఉంటుంది. చికిత్సను ఆయుర్వేద వైద్యుల పర్యవేక్షణలో తీసుకు న్నట్లయితే అశ్మరీ వ్యాధిని పూర్తిగా నివారించవచ్చును.


**డా. లక్ష్మీ.** M. D (Ayurveda)
**స్టార్ ఆయుర్వేద**



ADVT

© 90300 85456 తెలంగాణ । ఆంధ్రప్రదేశ్ । కర్నాటక www.starayurveda.com




# ఔటర్ రింగ్ రోడ్

**'కిరణ్ ఆస్పత్రి నుంచి తప్పించుకున్నాడు'.**

**ఇన్‌స్పెక్టర్ విజయ్ ఫోనులో చెప్పాడు. అయితే డిటెక్టివ్ శరత్‌కి అర్థం కాలేదు.**

**'కిరణ్ ఎవరు?' అడిగాడు.**

**'మరచిపోయావా? వాడు అమ్మాయిలను హింసించిన వీడియోపంపి, ఇంకో అమ్మాయిని కిడ్నాప్ చేస్తే చివరి క్షణంలో క్రితంవారం మనం పట్టుకున్నాం. దొరికిపోతానన్న భయంతో ఆత్మహత్య ప్రయత్నం చేశాడుగానీ చావలేదు'**

'ఓ... గుర్తొచ్చింది. తప్పించుకున్నాడా?'

'ఔను. వాడు ఆస్పత్రిలో ఉన్నంతకాలం నీపై ప్రతీకారం తీర్చుకుంటానని, వదిలిపెట్టేదిలేదనీ, ఆస్పత్రి నుంచి తప్పించుకుంటాననీ నర్సులతో సహా అందరితో చెప్పాడు. అన్నంత పనీ చేశాడు. వాడికోసం గాలిస్తున్నాం. నీ జాగ్రత్తలో నువ్వుండు' చెప్పాడు విజయ్.

'రానీ.. మళ్ళీ జైలుకి వెళ్ళాలనుకుంటే నా దగ్గరకే వస్తాడు' అన్నాడు శరత్.

ఫోనుపెట్టి ఫైలు తెరుస్తుంటే టేబుల్‌పై నీడ పడింది. తల ఎత్తిచూశాడు శరత్.

ఎదురుగా అసిస్టెంట్ రాము. అతడి ముఖంలో బాధ, కంగారు!

'ఏమైంది?' అడిగాడు శరత్.

'బాస్.. సెక్రటరీ సుధ ఫోన్ నెంబరు నుంచి ఫోను వచ్చింది. కిరణ్ ఆమెని కిడ్నాప్ చేశాడట. రక్షించుకుంటే రక్షించుకోండి అన్నాట్ట'.

'అదేమిటి? ఇందాకే విజయ్ ఫోను కనెక్షన్ ఇచ్చింది ఆమే కదా? ఆఫీసులోనే ఉంది కదా?' ఆశ్చర్యంగా అడిగాడు శరత్.

'యెస్ బాస్... వాడు ఆఫీసులోకొచ్చి రిసెప్షన్ నుంచే ఆమెని కిడ్నాప్ చేశాడు. ఆ సమయంలో క్లయింట్లెవ్వరూ లేరు' చెప్పాడు రాము.

వెంటనే తన కంప్యూటర్ మానిటర్ 'ఆన్' చేసి సిసి టీవీ రికార్డింగ్ చూడటం ఆరంభించాడు.

సుధ అప్పుడే వచ్చింది. ఆమె రాగానే విజయ్ ఫోను వచ్చింది. విజయ్ ఫోను కనెక్షన్ ఇచ్చింది. అంతలో కిరణ్ లోపలకు వచ్చాడు. క్లయింట్ అనుకుంది సుధ. ఏదో అడగబోయింది. అతడు తుపాకీ తీశాడు. ఆమె బెదిరి డేంజర్ బటన్ నొక్కబోయింది.

అది గమనించి తుపాకీ వెనక్కుతిప్పి ఆమె మెడమీద కొట్టాడు. కిందపడిపోతుంటే, ఆమెను ఎత్తి భుజాలమీద వేసుకుని తాపీగా బైటకు నడిచాడు. ఆ సమయంలో తాను విజయ్‌తో మాట్లాడుతున్నాడు.

'ఇప్పుడేం చేద్దాం బాస్' అడిగాడు రాము.

'చేసేదేముంది! ముందు సుధను విడిపించాలి. కిడ్నాప్ జరిగి పది నిముషాలు కూడా కాలేదు. కాబట్టి సుధను రక్షించే అవకాశాలే ఎక్కువున్నాయి. విజయ్‌కి ఫోన్‌చేసి చెప్పు. సుధ సెల్‌ఫోన్ లొకేషన్ కనుక్కో' అన్నాడు శరత్.

వెంటనే రాము సుధ 'మోటో 4జి' ఫోనుకు కాల్ చేశాడు.

స్విచాఫ్...

'స్విచాఫ్ వచ్చింది బాస్' చెప్పాడు.

'ముందు కంపెనీకి ఫోన్‌చేసి లాస్ట్‌కాల్ లొకేషన్ కనుక్కో. దాన్నిబట్టి వాడు ఎటు వెళ్ళాడో తెలుస్తుంది. ఈలోగా ఆ సెల్‌కు ఓ వాట్సప్ మెసేజ్ పంపించు. 'డెలివరీ రిపోర్ట్ ఎనేబుల్' (మెసేజీని డెలివరీ చేసినట్టు సమాచారం) చేయి. వాడు సెల్ ఫోన్ 'ఆన్' చేయగానే మెసేజ్ అందుతుంది. అందిన వెంటనే మనకు సమాచారం వస్తుంది. ఆ సమాచారం ఆధారంగా మనం ఫోను ఎక్కడుందో తెలుసుకోవచ్చు. దానికి www.google.com/android/devicemangeలో లాగిన్ అవ్వాలి. అది అందగానే మ్యాప్‌లో సెల్ ఎక్కడ ఉందో తెలుస్తుంది. అంటే వాడు ఎక్కడున్నదీ తెలుస్తుంది' చెప్పాడు శరత్.

'యెస్ బాస్' అన్నాడు రాము.

వెంటనే విజయ్‌కి ఫోన్ చేశాడు శరత్.

'కిరణ్ నేపథ్యం, వివరాలు కావాలి విజయ్' అడిగాడు.

'ఇప్పుడే పంపిస్తాను. కిడ్నాప్ విషయం తెలిసింది. మొత్తం పోలీసు బలగానికి అసైన్‌చేసి అన్ని రోడ్లు, జంక్షన్లు, చెక్‌పాయింట్లు, బస్సులు, రైళ్ళు, విమానాలు మొత్తం పరిశీలనలో పెట్టాను. మనకు తెలియకుండా వాడు నగరంలో కదలలేడు' అన్నాడు విజయ్.

'థాంక్యూ' అన్నాడు శరత్.

'బాస్... లొకేషన్ దొరికింది. వాడు మనకు ఫోన్ చేసినప్పుడు ఔటర్ రింగ్‌రోడ్‌లో..ఎయిర్‌పోర్ట్, బెంగళూరు రోడ్డులో ఉన్నాడు' చెప్పాడు రాము.

'కాల్ చేసిన వెంటనే సుధ ఫోన్ స్విచాఫ్ చేసి ఉంటాడు. ఔటర్ రింగ్‌రోడ్ నుండి దిగేమార్గాలెన్నున్నాయో చూడు. దిగేటప్పుడు వాళ్ల కారు నెంబర్లు రికార్డవుతాయి. అక్కడ డబ్బులు కలెక్ట్ చేసే వాళ్లని ప్రశ్నించు. అనుమానాస్పద కారు వివరాలు సేకరించు. నీ అసిస్టెంట్లందరినీ పనిలోపెట్టు. అలాగే, ఈ మార్గంలో వాడకంలో లేని పాడుబడ్డ బంగళాలు, సగం కట్టి ఆగిపోయిన బంగళాలు ఉన్నాయేమో చూడు. ఆస్పత్రినుంచి పారిపోయాడు కాబట్టి వాడిదగ్గర ఎక్కువ డబ్బు ఉండకపోవచ్చు. కాబట్టి స్టార్‌హోటల్స్‌లో సూట్లు బుక్ చేయలేడు'.

'బాస్... సుధ క్రెడిట్ కార్డులు, డెబిట్ కార్డులు ఉన్నాయి కదా వెంట?'

'అదీ పాయింటే... అయితే హోటళ్ళు, రిసార్టుల మీద కన్నేసి ఉంచమను' అన్నాడు ఆలోచిస్తూ.

***

'ఔటర్ రింగ్‌రోడ్‌లో మొత్తం 19 ఎక్సిట్, ఎన్ట్రీ పాయింట్లున్నాయి. కిరణ్ ఘట్‌కేసర్ వద్ద రింగ్‌రోడ్ ఎక్కాడు. తారామతిపేట, పెద్దఅంబర్‌పేట, బెంగళూరు, రవిర్యాల, తుక్కుగూడ, పెద్ద గోల్కొండ, శంషాబాద్, రాజేంద్రనగర్, వికారాబాద్ రోడ్, నార్సింగ్, గండిపేట, ఎదులనగర్, పఠాన్‌చెరువు, ఇలాపోతూ ఘట్‌కేసర్ వద్దకు రావచ్చు. లేదా మధ్యలో ఎక్కడైనా దిగిపోవచ్చు' ఔటర్ రింగ్‌రోడ్ మ్యాప్ పరిశీలిస్తూ చెప్పాడు విజయ్.

'ప్రతి ఎక్సిట్ దగ్గర టోల్ వసూలుచేసే వాళ్ళని రాము అసిస్టెంట్లు ప్రశ్నిస్తూ, అనుమానాస్పద కారునెంబర్ల వివరాలు సేకరిస్తున్నారు' శరత్ మాట పూర్తవుతుండగానే, 'బాస్' అంటూ వచ్చాడు రాము.

శరత్, విజయ్ ఇద్దరూ అతడి వైపు ప్రశ్నార్థకంగా చూశారు.

'బాస్.. రవిర్యాలవద్ద ఒక వాహనం డబ్బులు కట్టకుండా దూసుకు వెళ్ళిపోయిందట. అక్కడ వాహనాలు అధికంగా ఉండవని వాహనాలను ఆపే అడ్డులేదట'.

'నెంబరు సేకరించారా?'

'యెస్ బాస్. ఈ కారుని దొంగతనం చేశారని గంట క్రితమే పోలీసు కంప్లయింట్ అందింది' చెప్పాడు రాము.

'సో... రవిర్యాల దగ్గర దిగాడన్నమాట వాడు. చల్ విజయ్' అంటూ లేచాడు శరత్.

**కిరణ్ ఆసుపత్రినుంచి తప్పించుకున్నాడనీ, జాగ్రత్తగా ఉండమనీ డిటెక్టివ్ శరత్‌కు ఇన్‌స్పెక్టర్ విజయ్ ఫోన్ చేశాడు. ఒకవైపు ఆ ఫోన్ మాట్లాడుతుండగానే, కిరణ్ శరత్ ఆఫీసులో ప్రవేశించి ముందుగది లోంచి సెక్రటరీ సుధను కిడ్నాప్ చేశాడు. షాక్‌కి గురయ్యాడు శరత్. వెంటనే అసిస్టెంట్ రాముతో కలిసి అన్వేషణ ఆరంభించాడు. అప్పుడేం జరిగింది? ఆమె జాడ తెలిసిందా? లేదా?**

'రవిర్యాల అంటే మహేశ్వరమ్ రోడ్డు' అన్నాడు విజయ్.

'బాస్.. అక్కడ సగంసగం కట్టిన ఇళ్లు, బోలెడు ఉన్నాయి. గేటెడ్ కమ్యూనిటీ కట్టడాలున్నాయి' చెప్పాడు రాము.

'నీ అసిస్టెంట్లందరినీ ఆ ప్రాంతం అంతా గాలించమను' చెప్పాడు శరత్.

'వాళ్లు బయటకు వచ్చి కారు స్టార్ట్ చేయబోతుంటే రాము గట్టిగా అరిచాడు'.

'బాస్... వాడు సెల్ ఆన్ చేసినట్టున్నాడు. 'కొంగర ఖుర్ద్ దగ్గర ఉన్నారు'.

'చలో... నీ అసిస్టెంట్లకు ఫోను చెయ్యి' అంటూ కారు ముందుకు దూకించాడు శరత్.

***

కొంగరఖుర్ద్ జనాభా ఐదువేలు పైనే. వెయ్యి గడపల ఊరు.

కొంగరఖుర్ద్ చేరి రామును అడిగాడు శరత్. 'ఏ ఏరియాని పిన్ పాయింట్ చేసింది మ్యాప్‌లో? చూపిం చాడు రాము.

'నీ అసిస్టెంట్లు ఏమైనా తెలుసుకున్నారా?'

'లేదు బాస్... ఇక్కడే అదృశ్యమైనట్టున్నాడు. బహుశా వాడు సెల్ తెరవగానే మెసేజ్ అంది ఉంటుంది. అదిచూసి మనం వాడి లొకేషన్ తెలుసు కుంటామనే ఉద్దేశంతోనే సెల్ స్విచాఫ్ చేసి ఉంటాడు, ఎటో పోయి ఉంటాడు' అన్నాడు రాము.

ఓ టీ కొట్టు దగ్గర కారు ఆపాడు శరత్.

'బాబూ, గంట క్రితం ఇటు ఏదైనా కారు వెళ్లిందా?' అడిగాడు శరత్.

'నేను చూడలేదు' అన్నాడు.

ఇలా రెండు మూడు చోట్ల అడిగాడు శరత్. చివరికి పాన్ దుకాణంలో అబ్బాయి చెప్పాడు.

'ఒక కారు ఆగిందన్నా, సిగరెట్లు కొన్నాడు. డబ్బులు అడిగితే తుపాకీ చూపించాడు.'

'కారు ఎటు వెళ్లింది?'

చూపించాడు అబ్బాయి.

కారును ఆ వైపు దూకించాడు శరత్.

'బాస్.. వాడు మళ్ళీ సెల్ ఆన్ చేసినట్టున్నాడు, ఇక్కడే ఉన్నట్టున్నాడు' అరిచాడు రాము.

సడన్ బ్రేక్‌తో కారు ఆపాడు శరత్.

మోటో సెల్ కంపెనీకి ఫోన్ చేశాడు రాము. వాళ్ళతో మాట్లాడాడు.

'బాస్ ట్రయాంగ్యులర్ పద్ధతిలో వాళ్ళిచ్చిన లొకేషన్ ఇది' చూపించాడు.

అది చూశాడు శరత్. చుట్టూ పరిసరాలు పరిశీలించాడు. తన సెల్ తీసి లొకేషన్ చూశాడు.

తుపాకీ తీసి నిశ్శబ్దంగా కుడివైపు నడిచాడు. రాము, విజయ్ అతడిని అనుసరించారు.

కాస్త దూరం వెళ్ళేసరికి సగం కట్టి వదిలేసిన ఇల్లు కనిపించింది.

మౌనంగా దానివైపు చూపించాడు శరత్. ఆ చుట్టూ ఇళ్లు లేవు. కారూ లేదు. ఇంట్లో దాక్కున్న వారికి కనిపించకుండా అక్కడికి వెళ్ళే అవకాశం లేదు. శరత్ ఓ నిర్ణయానికి వచ్చి 'ముగ్గురం మూడువైపుల నుంచి వెళ్దాం. జిగ్‌జాగ్‌గా పరుగెత్తాలి. తుపాకీ గురిపెట్టే అవకాశం వాడికి ఇవ్వొద్దు' అన్నాడు.

ముగ్గురూ పొజిషన్స్ తీసుకున్నారు.

నిశ్శబ్దంగా ఇంటిని చేరుకుని లోపలికి అడుగు పెట్టారు. హాలు ఖాళీగా ఉంది. తుపాకీ శబ్దం రాలేదు.

నెమ్మదిగా మెట్లెక్కి తలుపుతీసుకుని సగం కట్టిన గదిలోకి ప్రవేశించారు. అక్కడ ఇద్దరు యువకులు సెల్‌తో ఏదో చేస్తున్నారు.

'హ్యాండ్సప్' అన్నాడు విజయ్.

వాళ్ళు బెదిరారు.

'మేం ఏం చేయట్లేదు' అన్నారు కంగారుగా.

వాళ్ళ దగ్గర నుంచి సెల్ లాక్కున్నాడు శరత్. అది సుధ సెల్.

'ఇది మీకెక్కడిది?' అడిగాడు.

'200 రూపాయలకి ఒకాయన అమ్మాడు' చెప్పాడు యువకుడు భయంగా.

'వాళ్ళు ఎటు వెళ్ళారు? కారులో అమ్మాయి ఉందా?'

'వెనుక సీటులో పడుకుంది. ఎంత ఉంటే అంత ఇమ్మని సెల్ ఇచ్చి వెళ్ళాడు' అంటూ అతడు వెళ్ళిన వైపు చూపించాడు.

వెంటనే ముగ్గురూ పరుగెత్తి కారుదగ్గరకొచ్చి, వాళ్ళు చూపించినవైపు కారు దూకించారు.

***

మట్టిరోడ్డు. రోడ్డుకిరువైపులా చెట్లున్నాయి.

ఓ చెట్టు నీడలో ఆగిన కారుపై శరత్ దృష్టి పడింది.

తన కారును దూరంగా ఆపి నిశ్శబ్దంగా ఆ కారువైపు నడిచారు. కారులో ఎవరూ లేరు. శరత్ కారు చుట్టుపక్కల మట్టిని పరిశీలించాడు. ఒకచోట కాలి గుర్తులు కనిపించాయి. 'వాడు సుధని మోసుకెళ్ళాడు' అన్నాడు శరత్.

కాలి గుర్తుల్ని అనుసరించాడు శరత్. అతడి వెంట నడిచారు విజయ్, రాము.

చెట్లలోంచి వెళ్ళాక ఓ గుబురు పొద వచ్చింది. పొదమాటున కదలిక గమనించి ముగ్గురూ ఆ వైపు వెళ్ళారు.

పొదల నడుమ సుధని పడుకోబెట్టి, కత్తితో ఆమె శరీరంపై గాట్లు చేస్తున్నాడు కిరణ్.

'హ్యాండ్సప్' తుపాకీ గురిపెట్టి అరిచాడు విజయ్.

'హహహ' వెర్రిగా నవ్వాడు కిరణ్. 'కాల్చండి' అంటూ అతివేగంగా కత్తితో సుధ మెడ దగ్గర నరం కోశాడు.

విజయ్ తుపాకీ పేల్చాడు. అతి లాఘవంగా పక్కకు దూకాడు కిరణ్. కానీ తుపాకీ గుండు కాలికి తగిలింది. వెంటనే 'య్యా' అని అరిచి, తన మణికట్టు దగ్గర నరం కోసుకున్నాడు కిరణ్.

కిరణ్‌పైకి దూకాడు విజయ్.

రాము, శరత్ సుధను చేరుకున్నారు. ఆమె రక్తానికి అడ్డుగా కట్టుగట్టి గబగబా కారు వైపు పరుగెత్తారు. అంబులెన్స్‌కి ఫోనుచేసి, కిరణ్‌ని పట్టుకుని కారువైపు లాక్కెళ్ళాడు విజయ్.

**–కస్తూరి మురళీకృష్ణ**

***సెల్: 98496 17392***



# జీవితమే ఒక ప్రతిఘటన

## (కోట శ్రీనివాసరావు కథాకథనం) 30

**పరిశ్రమకు మంచి చెయ్యడంకోసం నేను దీక్షలో కూర్చున్నాను. పెద్దవాళ్ళంతా మద్దతు ఇచ్చారు. పెద్దహీరోలందరూ తలో రోజూ వచ్చి శిబిరంలో కూర్చుంటాం అన్నారు. జనాన్ని కంట్రోల్ చెయ్యడం సాధ్యం కాదని నేనే సున్నితంగా వద్దని చెప్పాను. వాళ్ళంతా సహృదయంతో అర్థం చేసుకున్నారు.**

రెండో రోజో, మూడో రోజో అనుకుంటా, శిబిరంలో కూర్చుని ఉన్నా. మా అబ్బాయి ఇంటి నుంచి అప్పుడే వచ్చాడు. వచ్చినవాడల్లా నన్ను పట్టుకుని ఒకటే ఏడుపు, 'మీకెందుకు నాన్నగారు ఈ దీక్షలు? వేషాలివ్వరు. అయినా ఒక పనిచేస్తే అందరికీ నచ్చాలని ఏముంది? అప్పట్లో నేను దీక్ష చేయడం దాసరి నారాయణరావుగారికి కూడా నచ్చలేదని తెలిసింది.

'వాడిని అక్కడి నుంచి లేపండి ముందు' అని అయితే నేను ఒప్పుకోలేదు. ఎందుకంటే నేను దీక్ష మొదలుపెడుతున్నట్టు రాజేంద్రప్రసాద్‌గారికి చెప్పాను. కాబట్టి విరమించే సమయంలో కూడా ఆయన చేతుల మీదుగానే నిమ్మరసం ఇప్పించమని అక్కడి వారిని కోరాను. వాళ్ళు కూడా సరేనన్నారు.

నా ప్రవర్తనకు చిరంజీవిగారు చిరుకోపం చేసుకున్నారని అర్థమైంది.

కట్‌చేస్తే మరుసటిరోజు హైదరాబాద్‌లో చాలా సినిమాలు మొదలయ్యాయి. వాటిలో చాలావాటికి

# చిరంజీవిగారికి చిరుకోపం వచ్చిందని అర్థమైంది

పరిశ్రమలో ఇంకా చాలామంది ఉన్నారు.. వాళ్ళు చేస్తారు కదా, మీ సినిమాలు మీకున్నాయి, ఎవరెన్ని రూల్సు పెట్టుకున్నా మీకొచ్చిన నష్టమేమీ లేదు. అలాంటప్పుడు వీటిని మీరు వదిలేయండి, పట్టించుకోకండి' అని నాకు చాలా నచ్చజెప్పడానికి ప్రయత్నించాడు.

'అలా అనకూడదురా నాయనా, కాసింత పేరు ప్రతిష్ఠ వచ్చిన తర్వాత, మనం చెబితే నలుగురూ వింటారన్న నమ్మకం ఉన్నప్పుడు 'ఇది మంచి, ఇది చెడు' అని చెప్పాలి. ఎప్పుడూ స్వార్థం చూసుకోకూడదు' అని నా వంతుగా నేను వాడికి చెప్పా.

మావాడు చెప్పింది నిజమే. నా సినిమాలు నాకున్నాయి. ఇలాంటి దీక్షలవల్ల ఎవరో ఒకరి ఆగ్రహానికి గురైతే, వారి తాలూకు సినిమాల్లో మనకి ఆయన చాలామందికి ఫోన్లు చేశారట. రాజేంద్రప్రసాద్‌గారు, రామానాయుడుగారు వచ్చి 'దీక్ష విరమించమని చెప్పమని దాసరిగారు అంటున్నారు, ఏం చెయ్యమంటావయ్యా' అని అడిగారు.

'ఏమండీ, నేను ఎవరో చెబితే చేయడం లేదు, ఎవరికీ చెప్పి చెయ్యలేదు. నా తపన నేను పడుతున్నా, ఆయన మాట పెడచెవిన పెట్టాలని కాదు గానీ, ఏదో మొదలుపెట్టానుకదా పూర్తి చేయనివ్వండి' అని నిదానంగా చెప్పా.

వారికి నా పట్టుదల మరోసారి అర్థమైంది. చిరంజీవిగారు కూడా 'ఇప్పుడెందుకు ఈ దీక్షలు' అన్నారని విన్నాను. అయినా దీక్ష విరమించేరోజు చిరంజీవిగారు వచ్చారు. ఆయన నిమ్మరసం ఇస్తే తాగి, దీక్ష ఆపమని చుట్టూ ఉన్నవారు చెప్పారు. నాచేత క్లాప్ కూడా కొట్టించారు.

రాజేంద్రప్రసాద్, నరేశ్ వంటి హీరోలు పరిశ్రమలో బాగా నిలదొక్కుకున్నది ఆ సమయంలో హైదరాబాద్‌లో మొదలైన చిత్రాలతోనే. అప్పటిదాకా మద్రాసులో కో డైరెక్టర్లుగా, అసిస్టెంట్ డైరెక్టర్లుగా ఉన్న చాలా మంది ప్రమోషన్లు తీసుకుని దర్శకులైన తరుణం అదే. ఫైనాన్షియర్లు కూడా బాగా సపోర్ట్ చేయడంతో భాగ్యనగరంలో సినిమాల సందడి మొదలైంది. పరిశ్రమపరంగా అంతా బానే ఉంది కానీ, నా నటజీవితంలో కొన్ని అనూహ్యమైన మార్పులు చోటుచేసుకున్న మాట కూడా వాస్తవమే. దీక్ష సెగ నా నటజీవితాన్ని కొద్దిగా తాకింది.

చిరంజీవిగారి సినిమాలు, ఆయన తాలూకు నిర్మాతలు తీసిన చిత్రాలు, దాసరి గారి సినిమాల్లో నాకు అవకాశాలు సన్నగిల్లాయి. అలాగని నేను ఏ పూటా ఖాళీగా కూర్చోలేదు. కృష్ణ, శోభన్‌బాబు, రాజేంద్రప్రసాద్, నరేశ్...ఇలా మిగిలిన వారి సినిమాలు చేతినిండా ఉండటంతో నాకు ఆ సెగ స్పెషల్‌గా తెలియలేదు. పరిశ్రమ మొత్తం కక్షకట్టి వుంటే పరిస్థితి వేరే విధంగా ఉండేదేమో!



### శ్రీకాంత్ స్పెషల్!

నేను హైదరాబాద్‌లో అడుగుపెట్టిన తర్వాత కొంతమంది నటీనటులతో ప్రత్యేకమైన అనుబంధం ఏర్పడింది. అలాంటి వారిలో శ్రీకాంత్ ఒకడు. అజాతశత్రువు అంటారే.. ఆ తరహా కుర్రాడు శ్రీకాంత్. అతని శరీర సౌష్ఠవం చాలా గొప్పగా ఉంటుంది. అతను అటు విలన్‌గా సరి



**పరిశ్రమ సమస్యల మీద దీక్షలు చేస్తున్నప్పుడు ఎవరో ఒకరి ఆగ్రహానికి గురైతే వారి సిని మాల్లో వేషాలివ్వరు. అయినా ఒక పని చేస్తే అందరికీ నచ్చాలని ఏముంది? కోట శ్రీని వాసరావుగారు దీక్ష చేపట్టడం దాసరి గారికి, మరికొందరికి కూడా నచ్చలేదు. రాజేంద్రప్రసాద్, రామానాయుడుగారు వచ్చి ఇదే విషయాన్ని కోట శ్రీనివాసరావు గారికి తెలియజేశారు. మరి అప్పుడు ఆయన ఏమన్నారు? ఏం చేశారు?**

పోయాడు, ఇటు హీరోగా వేస్తే 'వారెవా.. ఏమున్నాడురా' అని అనిపించగలిగాడు. రొమాంటిక్ సీన్లు చేస్తే 'ప్రియుడంటే ఇలా ఉండాలి' అని అనిపించేవాడు. భర్తగా వేశాడంటే ప్రతి మహిళా 'తన భర్త అలా ఉండాలి' అని అనుకోవాల్సిందే. ఒకవైపు హీరోగా చేస్తూనే, మరోవైపు పెద్ద హీరోల సినిమాల్లో వేషాలు వేశాడు. ఈ రకంగా అన్ని చోట్లా ఒదిగిపోగలిగిన నటులు చాలా అరుదుగా ఉంటారు. స్టార్టింగ్‌లో అతను విలన్ వేషాలు వేసినప్పటి నుంచి నాకు బాగా తెలుసు. అప్పట్లో నేను విలన్‌గా వేస్తే, అతను నాకు కొడుకుగా, అంటే విలన్ కొడుకుగా నటించేవాడు. మొదటి నుంచీ నన్ను బాబాయ్ అని పిలిచేవాడు. హీరోగా శ్రీకాంత్ చేసిన మూడు, నాలుగు సినిమాల్లో నాకు చాలా మంచి పాత్రలున్నాయి. వాటిలో మొదటిది 'మా నాన్నకు పెళ్ళి'. ఇప్పుడు చాలావరకు సినిమా షూటింగులు రామోజీ ఫిల్మ్‌సిటీలో జరుగుతున్నాయి. నాకు గుర్తున్నంత వరకు రామోజీ ఫిల్మ్ సిటీలో షూటింగ్ జరుపుకున్న తొలి చిత్రం 'మా నాన్నకు పెళ్ళి'. రామోజీరావుగారు మా యూనిట్ అందరితోనూ చాలా బాగా మాట్లాడేవారు. దాంతో నాకు ఆయనతో అంతకు ముందు ఉన్న పరిచయం ఇంకాస్త పెరిగింది. వ్యక్తులను గౌరవించడంలోనూ, నైపుణ్యం గుర్తించడంలోనూ ఆయనెప్పుడూ ముందుండేవారు. సిన్సియర్‌గా మనిషి తలచుకుంటే ఏదైనా సాధించవచ్చు అనే మాటలకు ఆయన నిదర్శనం. అలాంటి మహానుభావుడితో నాకు పరిచయం ఉండటం చాలా ఆనందంగా అనిపిస్తుంటుంది. ఇక శ్రీకాంత్ విషయానికి వస్తే 'మా నాన్నకు పెళ్ళి' సెట్‌లో అతను హీరోగా నటిస్తుంటే చూసి నాకు ఆశ్చర్యం వేసింది. అప్పటిదాకా విలన్‌గా చేసినవాడు.. హీరోగా చేస్తుంటే సెట్‌లో అలా చూస్తూ ఉండిపోయేవాణ్ణి. అందులోనూ హీరోయిన్ సిమ్రాన్‌తో కొన్ని సీన్లలో 'శభాష్' అనిపించుకునేలా చేశాడు. ఆ సినిమాలో ఫైట్‌లో కొన్ని సీన్లుంటాయి. ఇప్పుడు వాటిని చూసినా 'మన శ్రీకాంతే చేశాడా' అనిపిస్తుంది. ఆర్టిస్టుగా అతనిలోని వేరియేషన్‌కి నేను తెగ ఆనందపడ్డ చిత్రం 'ఆమె'. నాది అందులో చండాలపు వేషం. ఆ వేషం ఒప్పుకోవడానికే చాలా ధైర్యం కావాలి. ఆ చివరి సీన్ మరీ భరించలేం. సుధ కూడా చాలా బాగా చేసింది. ఆ సినిమా తర్వాతే అనుకుంటా శ్రీకాంత్‌కి తిరుపతిలో పెళ్ళి జరిగింది. పగటిపూట ముహూర్తమే. 'తప్పక రావాలి బాబాయ్' అని పిలిచాడు. అప్పుడు నేను మద్రాసులో ఉండేవాణ్ణి. వెళ్ళి అక్షింతలు వేసి ఆశీర్వదించాను. ఇప్పటికీ అతని ప్రతి పుట్టినరోజుకీ విష్ చేస్తా. మొన్నీమధ్యనే అతని పుట్టినరోజయితే ఫోన్ చేశా, 'ఫ్యామిలీతో గుడిలో ఉన్నా బాబాయ్' అన్నాడు.

అతనితో నేను ఇటీవల ఓ సినిమా చేశా. దాని పేరు 'నాటుకోడి'. ఇంకా విడుదల కాలేదు. ఆ చిత్ర దర్శకుడు నానికృష్ణ చాలా మంచివాడు. ఆ సినిమా చాలా బాగా తీశాడు. అందులో శ్రీకాంత్ ఫాదర్ వేషం వేశా. సిన్సియర్ కానిస్టేబుల్‌ని. నా కొడుకుని ఎస్.ఐగా చూడాలని తాపత్రయపడుతుంటాను. నాకూ శ్రీకాంత్‌కీ మధ్య అక్కడక్కడా చాలా మంచి సీన్లుంటాయి. 'నాటుకోడి' ఎప్పుడు రిలీజ్ అవుతుందా? అని నేను కూడా ఎదురుచూస్తున్నా. ఈ వయసులో నేను సైకిల్ తొక్కుతానంటే ఎవరైనా నమ్ముతారా? నానికృష్ణ నాతో ఇందులో సైకిల్ తొక్కించారు. నా వయసుతో ప్రమేయం లేకుండా చాలా చేయించారు. వాటికోసం వాళ్ళు ముందుగా చాలా ప్రిపేర్ అయ్యారు. తప్పకుండా చూసిన వాళ్ళందరికీ నచ్చుతుంది.

## రైల్లో దర్శకేంద్రుడు!

కొంతమంది చిత్రాల్లో ఎక్కువ పనిచేసి ఉండకపోవచ్చు. అయినా వాళ్ళమీద ప్రేమ, గౌరవం ఉంటాయి. దర్శకేంద్రుడు రాఘవేంద్రరావుగారి విషయంలో నేను అదేవిధంగా భావిస్తా. ఆయనతో కలిసి నేను గొప్ప గొప్ప సినిమాలేవీ చేయలేదు. అయినా ఆయనంటే నాకు చాలా మర్యాద. ఒకసారి గోదావరి ఎక్స్‌ప్రెస్‌లో వెళ్తున్నా. ఆవేళ అదే ట్రైన్‌లో రాఘవేంద్రరావుగారు ఉన్నారని తెలిసింది. సరేనని నమస్కారం పెట్టుకువద్దామని వెళ్ళా. ఆయనేదో ఫంక్షన్‌కి వెళ్తున్నట్టున్నారు. ఆయనతో పాటు సినిమా జనాలు లేరు. అంతా డాక్టర్లు, ఇంజినీర్లు, పెద్ద పెద్ద ఉద్యోగస్థులు... ఆయనున్న బోగీలో చాలా మంది ఉన్నారు. నేను వెళ్ళి 'నమస్కారం డైరెక్టర్ గారూ' అన్నా.

మిగిలినవాళ్ళు కూడా నన్ను చూడగానే గుర్తుపట్టారు.

'రావయ్యా, లోపలికి రా కూర్చో' అన్నారు రాఘవేంద్రరావుగారు.

అందరూ నాతో ప్రేమగా మాట్లాడటం మొదలు పెట్టారు. అంటే వారి ముఖాల్లో ఏదో సినిమా ఆర్టిస్టు కనిపించాడన్నట్టు లేదు. చాలా ఆప్యాయంగా మాట్లాడారు. మాటల్లో సినిమాల గురించి చాలా విశేషాలు చెప్పుకున్నాం.

'సరేనండీ.. ఇక నా సీటుకు వెళ్తాను' అన్నాను దర్శకేంద్రుడితో.

'కోటయ్యా, భలేవాడివయ్యా! కాసేపు కూర్చో, నీకు మాస్ జనాలే కాదయ్యా చదువుకున్నవాళ్ళలోనూ మంచి ఫ్యాన్స్ ఉన్నారు' అన్నారు. చుట్టూ ఉన్న వారు కూడా అవునన్నట్టు తలలూపారు. ఆ వేళ నాకు చాలా ఆనందంగా అనిపించింది. రాఘవేంద్రరావుగారి గురించి మరో ముఖ్యమైన విషయం చెప్పుకోవాలండీ..ఆయన ఆర్టిస్టుని పువ్వులా చూసుకుంటారు. ఆయన ఎవరితోనైనా పనిచేస్తున్నారంటే వారి గురించి చాలా విషయాలు తెలుసుకుంటారు. అవతలివారి అవకతవకల్ని పట్టించుకోరు. మంచి గురించే ఆలోచిస్తారు. వాళ్ళ అవసరాలు అనుక్షణం కనిపెట్టి మరీ తీర్చేలా చర్యలు తీసుకుంటారు. రాఘవేంద్రరావుగారి సెట్లో అడుగుపెట్టిన ప్రతి ఒక్కరూ అందుకే ఆనందంగా ఫీలవుతారు. అలీకి ఎదురైన ఓ గమ్మత్తైన విషయాన్ని ఆ నోటా ఈ నోటా విన్నాను.. అదేంటంటే..

రాఘవేంద్రరావుగారు ఓ సినిమా మొదలు పెట్టారు. అందులో ఓ సీనియర్ ఆర్టిస్టునే తీసుకున్నారు. నాలుగు రోజుల షూటింగ్ తర్వాత ఆ ఆర్టిస్టుతో ఏదో సమస్య వచ్చింది. అతను రాలేదో, లేకుంటే డైరెక్టర్‌గారికి నచ్చలేదో మొత్తానికి ఏదో జరిగింది. షూటింగ్ కంటిన్యూటీ ఉంది.. అదీ వేరియస్ ఆర్టిస్టుల కాంబినేషన్‌లో. ఏం చెయ్యాలా అని కో డైరెక్టర్లు తల పట్టుకుని కూర్చున్నారట. ఆ విషయాన్నే సాయంత్రంపూట డైరెక్టర్‌గారితో అంటే 'అలీ ఎక్కడున్నాడో కనుక్కోండి' అన్నారట. ఆరా తీస్తే అలీకి అప్పుడే పెళ్ళయిందని తెలిసింది.

**(ఇంకా ఉంది)**

**–డా.చల్లా భాగ్యలక్ష్మి**

**సెల్: 88850 55528**




"ఓ పెళ్ళైన అమ్మాయి నాకు కోడలవుతుందని నా జాతకంలో, నీకు ఇల్లాలు అవుతుందని నీ జాతకంలో ఉంది కదరా" అన్నాడు చతుషష్టి, కొడుకు తత్పురుషతో.

"ఎవరో, ఏదో, ఎప్పుడో, ఎక్కడో, ఎందుకో కూసిన కూత ఇప్పుడు మోగించడం ఎందుకు నాన్నా!" అన్నాడు తత్పురుష.

# మూడో ముడి!

"సందర్భం వచ్చింది కాబట్టి ప్రస్తావించాలేరా"

"ఏంటో అది"

"బత్తుల వారి అమ్మాయిని గుత్తుల వారి అబ్బాయికి ఇస్తున్నారు. పెళ్ళి పత్రికలు అచ్చవుతున్నాయి".

"అప్పుడేదో బుట్టలవారితో తట్టలవారివియ్యం అన్నావు, అదేమయిందో..."

"అక్కడ మన ఊహ దూరే సందులేక వదిలేశా. ఇది మన ఆనందాలకు విస్తరివేసే వేదికలా కనిపిస్తోందిరా. ఈ అబ్బాయి ఓ అమ్మాయిని ప్రేమించాట్ట. మనసులు కలిసి మనువాడదామనుకున్నాయట. ఆడకుండా ఆ అమ్మాయిని అక్కడ కట్టడి చేశారు. ఈ అబ్బాయిని ఇక్కడ ముట్టడిచేసి ఈ అమ్మాయితో పెళ్ళి కుదిర్చారు. ఇదేదో బెడిసికొట్టే వ్యవహారంలా నాకు అనిపిస్తోంది. అదనుచూసి మనం ఒడిసి పట్టుకోవాలిరా. లేకపోతే నీ సంగతేమోగానీ, నీ పెళ్ళిచూపులు నేను చూసి చూసి అలసిపోయాను గదరా!

అందుకే ఈ పెళ్ళికి నువ్వు రావాలి".

"నేనెందుకు నాన్నా! అక్కడ నాకు ఎవరి ముక్కూ, ఎవరి మొహమూ తెలియదు".

"ఎవరో ఎందుకురా, నీకు తెలియాల్సింది, నీవు చూడాల్సింది, అమ్మాయి ముక్కూ అమ్మాయి మొహమూ"

"నీ కోసం వస్తా, క్షణం దాటి ఎక్కువసేపు ఉండను".

***

పెద్ద ఇల్లు. ఎవరిగది వారిదే. అది కాక పూజ గది. తల్లి తలపు గది. తెలుగు, ఇంగ్లీషు సాహిత్యం నిండిన పుస్తకాల గది. విశాలమైన హాలు. ఇంట్లో దీపం వెలిగించే దీపం ఆరిపోయినా దివ్యమైన ఇల్లు. కుక్కలిల్లు అని పేరు పడింది. గుర్రాల్లాంటి రెండు కుక్కలు ఇంట్లో పిల్లల్లా తిరుగుతుంటాయి. బయటివాళ్ళకు సింహాలు. తల్లి పోయిం తరువాత ఇంట్లోకిరావడం మానేశాయి. పిలిస్తే వచ్చి తల్లి గదిలో కొద్దిసేపు కూర్చుని వెళతాయి. కంప్యూటర్ ధ్యాస తప్పితే ఇంకోటి లేదన్నట్లు ఉంటాడు కొడుకు. ఎవరి తాళం చెవి వారిదే. బయటినుంచి లోపలి నుంచి వేయొచ్చు. తీయొచ్చు. ఒకటి కొడుకు దగ్గర, ఒకటి తండ్రి దగ్గర. ఇంకోటి పనిమనిషి బుంగ దగ్గర, బుంగ నల్లధనం. బుంగ అనే అలవాటు. ముప్పయ్యేళ్ళు. భర్త లేడు. తాగి తాగి ఆవిరై కాలిపోయాడు. దిట్టమైంది. తెలివైంది. పుస్తకాలు చదువుతుంది. ముసలి తల్లిదండ్రులను కాపాడుతూ ఉంది. మాటకారి!

***

చతుషష్టి రావడం లేటయింది. బాగా నిద్ర వస్తోంది. ఒకసారి కొడుకుని పలకరిద్దామని కొడుకు గది దగ్గరికి వెళ్ళాడు. ఫోన్‌కాల్లో ఉన్న కొడుక్కి అంతరాయం కలిగించవద్దనుకున్నాడు. వేసున్న తలుపు తీయకుండానే అక్కడే అలసిపోయి గురక పెడుతున్నాడు.

ఫోన్ మాట్లాడడం పూర్తయిం తరువాత ఇంత రాత్రయినా నాన్న ఎందుకు రాలేదా అనుకున్నాడు. గురక వినిపిస్తున్నది. వినిపించే అవకాశం లేదు. తలుపుతీసిచూస్తే తండ్రి గాఢనిద్రలో కనిపించాడు. ఆ స్థితిలో ఉన్న తండ్రిని ఎత్తుకుని తన మంచం మీద పడుకోబెట్టి, తాను వెళ్ళి తండ్రి గదిలో పడుకున్నాడు తత్పురుష! ఇలా ఎప్పుడూ జరగని విషయం. నాన్న గది చాలా శుభ్రంగా ఉంటుంది. ఇల్లు శుభ్రంగా ఉంచడం నాన్నకు ఓ పద్ధతి.

***

"ఎప్పుడూ లేంది పూర్తి ముసుగేసుకుని పడుకున్నావేందయ్యా" అంటూ బుంగ వచ్చి పక్కన కూర్చుని లేపింది.

"అమ్మ! బుంగా! నాన్న దగ్గర నీకింత చనువుందా" అనుకున్నాడు. కొద్దిగా మెసిలాడు. పడుకుంది తనూ అని తెలిసేట్లుగా. బుంగ టక్కున లేచింది. చడీచప్పుడూ లేకుండా తన పనిలోకి తను వెళ్ళింది. వంటగదిలో గిన్నెలు పడడంతో ఆ అలజడికి తండ్రీ కొడుకులిద్దరూ లేచారు. కొడుకు తన గదిలో ఎందుకు పడుకున్నాడో, ఎప్పుడు పడుకున్నాడో చతుషష్టికి వెంటనే తోచలేదు.

"పెద్ద అలారం మోగింది ఇద్దరినీ లేపావు కదా బుంగా" అన్నాడు తత్పురుష.

"ఎంత అనుభవం ఉన్నా తడబాట్లు, పొట్లు లేకుండా ఉంటాయా" అంది.

"ఒకళ్ళ గదిలోంచి ఒకళ్ళు వస్తున్నారు. ఏంటో విశేషం" అంది మళ్ళీ.

"బత్తులోరింట్లో పెళ్ళికి వెళ్ళొచ్చారా" అడిగింది చతుషష్టిని.

"వచ్చా, వచ్చి. బాబు గది దాకా వెళ్ళిందాకా గుర్తుంది".

"తర్వాతేముందయ్య గురక పెట్టుంటారు. మెరక మారుంటారు" అంది బుంగ.

"నాన్న గురక కూడా తెలుసే నీకు" అన్నాడు తత్పురుష.

"చురకో చురక! కెవ్వుకేక" అంది.

"చురకేంటి బుంగా" అడిగాడు చతుషష్టి.

"అదో పాటలేందయ్యా. మొహాలు కడుక్కోండి. కాఫీ పెడుతున్నా".

***

"పెళ్ళి ముచ్చట్లు అడగవేంట్రా" అన్నాడు చతుషష్టి.

"అడక్కపోతే ఏం, నువ్వు చెప్పకుండా ఉంటావా" అన్నాడు తత్పురుష.

"సరే! ముందు నాకిది చెప్పు అమ్మాయి నీకు నచ్చిందా".

"ఒకళ్ళ భార్యను నచ్చిందీ అని ఎలా చెబుతా నాన్నా".

"కాలేదు కాబట్టే అడుగుతున్నారా".

"అదేంటి"?

"వచ్చాం. తెచ్చాం, ఇచ్చాం, నచ్చాం, గిచ్చాం అనేదో లెక్కలతో యాంత్రికమైన పెళ్ళి పెద్దలేగా ఈ రోజుల్లో. ఆ పెద్దలు ఎవరి ముచ్చట్లలో వాళ్లున్నారు. పెళ్ళికూతురు నలుగురు అన్నయ్యలూ నాలుగు దిక్కులూ కాపలా కళ్ళేసి చూస్తున్నారు, కట్టడిచేసిన అమ్మాయి తరపు వాళ్ళెవరన్నా కట్టెలు పట్టుకుని వస్తారేమో అని. మంగళవాద్యాల ధ్వని పెరగడంతో మూడుముళ్ళూ పడేవేళని అందరి చూపులు వేదిక మీదకి మళ్ళాయి. మొదటి ముడి వేయబోతుంటే బ్రహ్మగారు తుమ్మారు. పెళ్ళికొడుకు ఆగాడు.

"అదేంటండీ బ్రహ్మగారు ఎన్నోపెళ్ళిళ్ళు చేయించారు. తుమ్ము ఆపుకోలేకపోతే ఎట్లా" అని కనిపించకుండా ఎవరో అన్నారు.

"కక్కొచ్చినా, కల్యాణమొచ్చినా ఆగదన్నట్లు, తుమ్మొస్తే ముక్కూడి పోతుందేమోగానీ ముడి పడిపోతుందండీ. "ఆ... వేయి నాయనా నువ్వాగితే

ఎలా" అన్నాడు బ్రహ్మ. వణుకుతూ మొదటి ముడి వేశాడు. రెండో ముడి వేస్తూ పెళ్ళికొడుకే తుమ్మాడు. ముక్కు తుడుచుకోడానికి మూడు నిమిషాలు తీసుకున్నాడు. "ఆ ఒక్కటీ వేయినాయనా, పెళ్ళయిందని పిద్దాం" గుత్తుల వారి తరపు పెద్ద మనిషెవరో అన్నారు. మూడో ముడి వేస్తూ మాడు కొట్టుకుని వెల్లకిలా పడి కాళ్లూ చేతులూ వశం తప్పిపడి నురగ కక్కుకున్నాడు పెళ్ళికొడుకు.

అందరూ ఆశ్చర్యంగా చూశారు. బత్తులవారు కత్తులు తీసినంత పనిచేశారు. "అబ్బాయికి ఈ రోగముందని ముందెందుకు చెప్పలేదని గొంతెత్తారు. "ఎప్పుడూ ఎరగమండీ ఇప్పుడిలా ఎందుకయిందో అర్థం కావట్లేదన్నారు గుత్తులవారు. "ఎప్పుడో అనుకున్న మాటని గౌరవించి ఇంతదాకా వచ్చాం. ఇక చాలు" అని ఒకరన్నారు.

"ఇంకా నయం, ముడిపడకముందే తెలిసింది. లేకపోతే అమ్మాయి బతుకు అతుకు ఊడేదే" ఇంకొకరన్నారు.

"ఇంకా మాటలెందుకండీ. ఎవరిమూటలు వాళ్లు సర్దుకోండి. మేం ఇచ్చిందేదో తిరిగిచ్చేయండి" అన్నాడు పెళ్ళికూతురు తండ్రి.

"అమ్మాయి అదృష్టవంతురాలు కాబట్టి సరిపోయింది" అంది తల్లి.

భోజనాలు చేసి కొందరు, చేయకుండా కొందరు ఎటువాళ్లటు పోయారు. అమ్మాయి కన్నీళ్ళు పెట్టుకుంటే నేను ఓదార్చాను.

***

"చతుషష్ఠిగారి కొడుకుని చూశారా" అడిగింది పెళ్ళి కూతురు తల్లి సిద్ధమణి భర్త భర్తృహరిని.

"చిన్నప్పుడెప్పుడో చూశా" అన్నాడు భర్తృహరి.

**సుముహూర్త సమయంలో పురోహితుడు తుమ్మాడు. పెళ్ళి పెద్దలకు కోపం వచ్చింది. తుమ్మితే ముక్కూడిపోతుందేమోగానీ , ముడిమాత్రం పడిపోతుందండీ అంటూ మొదటి ముడి వేయించాడు. రెండో ముడికి పెళ్ళికొడుకే తుమ్మాడు. ఇక మూడోముడికతగాడు వెల్లకిలాపడి కొట్టుకుంటూ నురగలు కక్కుకున్నాడు. మరింతకీ అక్కడ పెళ్ళి జరిగిందా లేదా? పెళ్ళికొడుక్కి మూర్ఛరోగం ఎందుకొచ్చింది?**

"మీ చిన్నప్పుడా.... అబ్బాయి చిన్నప్పుడా! చాల్లెండి! ఏదో వంకతో వెళ్ళి చూసిరండి. పెళ్ళిచూపులేగాని పెళ్ళి దాకా ఎందుకు రావట్లేదో తెలుసుకురండి".

"అదేమోగాని వాళ్ళతో మనం తూగలేస్తామా, పైగా పీటలెక్కి దిగిన అమ్మాయి" అన్నాడు భర్తృహరి.

"అమ్మాయి ఎక్కలే. మనమే ఎక్కించాం! మీ సందేహాలు ఆపి ముందు వెళ్ళిరండి".

"ఈసారైనా అమ్మాయి మనసు తెలుసుకుని కదులుదాం."

"ఎంతమంచి ఆలోచన వచ్చిందో! మా తమ్ముళ్ళు ఎత్తుకున్న బుట్టలో వస్తూ అబ్బాయిని చూసిందట. అబ్బాయి కూడా ఆనందంగా చూశాట్టా" అంది సిద్ధమణి.

"నేను చూళ్ళేదే!"

"మీ చూపులు, చేతలు చేష్టలుడిగాయిగా! ఇప్పుడు కాస్త నేను చెప్పినట్లు చేయండి."

***

ఆ పెళ్ళికొడుకు ఆచూకీ ప్రేమించిన అమ్మాయి ఊళ్ళో తేలింది.

"పెళ్ళి చేసుకునే ధైర్యం లేని వాడివి ఏ మొహంతో వచ్చావు నా దగ్గరికి".

"ముళ్లు వేయకుండా కళ్ళు తిరిగినట్లు నటించి వచ్చా, నీ కోసం"

"పెద్దవాళ్ళ భయంతో అంతదాకా వెళ్ళావు, నన్నొపడానికి మీ వాళ్ళు నన్ను అన్నమాటలు ఇంకా నొప్పి పెడుతూనే ఉన్నాయి. అది మరచిపోయే నేను నా వాళ్ళు కుదిర్చిన పెళ్ళికి ఒప్పుకున్నా".

"వాడెవడో రైల్లో చప్పట్లు కొట్టేవాడటగా"

"నీకెవరు చెప్పారు".

"నీ మీద అక్షింతలు వేయడానికి వచ్చిన పెద్దలు"

"చాల్లే! వెళ్ళు! నాక్కనిపించకు. నా మనసులోంచి పూర్తిగా చెరిగిపోయావు"

అనడంతో తిరిగి మా ఇంటికి వచ్చాడు. ఆ వివరమంతా చెప్పాడు "జరిగింది మరిచిపోండి మన్నించండి అన్నాడు' చెప్పాడు భర్తృహరి చతుషష్ఠితో".

"సరే, మీరేమన్నారు" అన్నాడు చతుషష్ఠి.

"బయటికి దారి చూపించాం" చెప్పాడు భర్తృహరి.

"అదేదో చెబుతున్నాడుగానీ తనిక్కడకు వచ్చింది దేనికో బయట పెట్టడే" అనుకున్నాడు చతుషష్ఠి మనసులో.

"మవునంగా ఉన్నారు. నేను చేసింది తప్పంటారా".

"చేస్తున్నది తప్పు".

"ఏవిటండీ అది" దీనంగా అడిగాడు భర్తృహరి.

"మీరెందుకు వచ్చారో చెప్పకపోవడం"

"మీరు గొప్పవారు. మనసు విప్పడానికి ధైర్యం రావట్లేదు" అన్నాడు భర్తృహరి.

"గొప్పలేదు చిప్పలేదు. విప్పండి అదేంటో" అన్నాడు చతుషష్ఠి తొందరైన ఆనందంతో.

"ఒక్కసారి మీ అబ్బాయి మా అమ్మాయిని



చూస్తాడేమోనని ఆశతో...."

"చూస్తే మాకు పెళ్ళి కలిసి రావడం లేదు. అందుకని, పెళ్ళిలో అడ్డ తెరసెల్లా తొలగించినప్పుడే చూస్తాడు" ఆనందంగా చెప్పాడు చతుషష్ఠి, భర్తృహరి కళ్ళల్లో వెలుగు చూస్తూ.

"అయితే ఒకమాట. వెడ్స్ గిడ్స్ అని రాయకండి గానామృతాతత్పురుషల వివాహం" అనండి శుభం భూయత్.



ఇష్టం ఏర్పడటానికి మూలం ఏంటో అర్థం చేసుకో వచ్చు. కానీ అన్ని జంటలూ ఇలానే ఉండవు. ఉద్యోగాలు, కుటుంబం, మెరుగైన జీవితం... ఈ లక్ష్యాలతో ఇలాంటి ఆకర్షణలను తెలివిగా దాటేసే జంటలూ ఉంటాయి.

ఎక్కువ జంటలు 'సెక్స్'ను ఓ పనిగా భావిస్తూ తమ బంధంలో ఎక్కడ పొరపాటు జరిగిందా? అని ఆలోచిస్తూ అయోమయపడి పోతూ ఉంటారు. ఈ విషయంలో ఒక విష యాన్ని సూటిగా మాట్లాడుకోవాలి. సెక్స్ అనేది అవసరం తీర్చే ఓ చర్య కానే కాదు. ఓ బంధం పరిపూర్ణత పొందాలంటే లైంగిక కళలో పరిణతి సాధించాలి.

ఆఫీసులో బాసు చిందులేసిన రోజు, ట్రాఫిక్ జామ్‌లో ఇరుక్కుపోయి చిరాకు పడిన రోజు, ఫ్రెండ్‌తో అభిప్రాయభేదమొచ్చి నొచ్చుకున్న రోజు... ఇలా నలిగిన మనసును రంజింపజేసే సాధనంగా సెక్స్‌ను భావించాలి. దానికోసం సమయం, సందర్భం కోసం వెతుక్కో కూడదు. అలాగని దాన్ని దినచర్యలో ఓ భాగంగా భావించకూడదు. జీవితాల్ని ప్రేమబంధంతో ముడివేసి ఇద్దరు వ్యక్తుల్ని కలిపి ఉంచే శక్తిగా సెక్స్‌ను మలుచుకోవాలి.

# సక్సెస్‌ఫుల్ 'సెక్స్ లైఫ్'

**సెక్స్! కొందరికిది... దాహాన్ని తీర్చలేని ఒయాసిస్. మానవ జాతి వృద్ధి కోసం ఉద్దేశించిన సెక్స్ కాస్తా కాలక్రమేణా అహం, తృష్ణ, పగ, ప్రతీకారం, బలాలను సంతృప్తిపరుచుకోగల సాధనంగా మారింది. కేవలం సెక్స్ కోసమే పెళ్ళి చేసుకునే జంటలున్నాయి. అంతటితో ఆగకుండా వివాహేతర సంబంధాలు పెట్టుకునే వాళ్లూ ఉన్నారు. కానీ ఎంతకీ ఆ దాహం తీరదు. ఆ అనుబంధాలేవీ ఎక్కువ కాలం నిలవవు. మొహం మొత్తి మరో వ్యక్తి మీద మోహం పెరగటం, దాని తర్వాత ఇంకో వ్యక్తితో శారీరక సుఖం కోసం వెంపర్లాడటం... ఇదంతా ఓ సైకిల్‌లా తిరుగుతూనే ఉంటోంది. అసలెందుకింత లైంగిక దాహం? ఈ దాహం తీరే మార్గం లేదా? దీనికి అంతం ఎక్కడ? లోపం ఎక్కడుంది?**

ఎదుటి వ్యక్తిని ఆకర్షించటం కోసం దుస్తులు, పర్‌ఫ్యూమ్స్, బాడీ లాంగ్వేజ్, మాటలు, నడత... ఇలా ఎన్నో సాధనాలను ఉపయోగిస్తాం. ఇదంతా నచ్చిన వ్యక్తి దక్కేవరకే! తర్వాత అంతకంటే ఆకర్ష ణీయమైన వ్యక్తి మరొకరు కనిపించగానే మనసు లయ తప్పుతుంది. ఎంత బలీయమైన అనుబంధ మైనా దూది పింజలా గాలికెగిరిపోతుంది. ఎంతో లోతైనది, అర్థవంతమైనది అనుకున్న బంధం కూడా బీటలు వారుతుంది. కానీ ఇదంతా మరో వ్యక్తి మీద కలిగిన ప్రేమ పర్యవసానమా? అసలది ప్రేమేనా? గుండె లయ తప్పేలా చేసిన వ్యక్తిని కళ్లు మూసుకుని ఒకసారి స్మరించుకుంటే... ఏం కనిపిస్తుంది? తనని రెండు చేతులతో దగ్గరికి తీసుకుని బలంగా హత్తుకున్నట్టు, పెదవులను ముద్దాడుతున్నట్టు, వేళ్లతో స్పృశిస్తున్నట్టు...ఈ దృశ్యాలే కనిపిస్తాయి. దీన్నిబట్టి అవతలి వ్యక్తి మీద

### సెక్స్ షెడ్యూల్

దంపతుల లైంగిక అభిరుచుల్లోనూ తేడాలు ఉంటాయి. ఒకరికి రోజూ కలవాలనిపిస్తే ఇంకొక రికి వారంలో ఒకసారి చాలనిపిస్తుంది. ఈ విష



యాలను నేరుగా చర్చించుకుంటే అసలు గొడవే ఉండదు. కానీ దగ్గరైనప్పుడల్లా తలనొప్పనో, ఆ రోజు ఇంట్లో పనెక్కువైందనో, ఆఫీసులో అలసి పోయాననో...ఈ సాకులతో దూరం జరుగుతూ ఉంటే అవతలి వ్యక్తి నొచ్చుకోవటం సహజం. పరిస్థితి ఇలాగే కొనసాగితే అనుబంధం బలహీనపడటానికి ఎక్కువ రోజులు పట్టదు. కాబట్టి లైంగికంగా మీరెంత చురుగ్గా ఉంటారో, ఆ అవసరం మీకెంత అవసరమో భాగస్వామికి తెలియచెప్పే ప్రయత్నం చేయాలి. ఇద్దరూ మనసు విప్పి మాట్లాడుకోవాలి. ఈ విషయంలో అభిరుచులు కలవకపోతే కారణాలు అన్వేషించాలి. అడ్డుపడే సమస్యలను పరిష్కరించాలి. అవసరమైతే వైద్య సహాయం తీసుకోవాలి. వీటితోపాటు ఓ చిట్కా పాటించాలి. అదేంటంటే... మిగతా పనులకు షెడ్యూల్ పెట్టుకున్నట్టే సెక్స్‌కూ షెడ్యూల్ ఏర్పరుచుకోవాలి. ఫలానా రోజు కలవాలని ముందుగానే ఫిక్స్ చేసుకుని ఆ సమయానికి ఎటువంటి ఆటంకం రాకుండా అన్ని పనులూ ముగించుకుని సిద్ధపడాలి. లైంగికసంతృప్తి పరిపూర్ణంగా పొందే నాణ్యతతో కూడిన సెక్సువల్ ఎక్స్‌పీరియన్స్ కనీసం వారానికి రెండు సార్లైనా పొందాలని సెక్సాలజిస్టులు సూచిస్తున్నారు. కాబట్టి దంపతులు అలాంటి అనుభవం కోసం కలిసి ప్రణాళిక వేసుకోవాలి.

### టర్న్ ఆన్ - టర్న్ ఆఫ్

లైంగిక చర్యలో కొన్ని చర్యలు పార్ట్‌నర్‌ని ఇబ్బంది పెట్టొచ్చు. కొన్ని రంజింపజేయొచ్చు. కాబట్టి ఈ విషయాలనూ చర్చించుకోవాలి. మనసులోనే దాచుకుని సెక్స్ మీద ఆసక్తి చంపుకునేకంటే ఇష్టాఇష్టాలను పంచుకుని సెక్స్‌ను ఆస్వాదించటం అలవరుచుకోవాలి. చర్యలే కాదు రోజు మొత్తంలో దంపతుల మధ్య జరిగే సంభాషణలూ, ప్రవర్తనలూ సెక్స్ పట్ల విముఖత పెరగటానికి కారణం అవుతాయి.

రెస్టారెంట్‌లో బార్‌టెండర్ మీద, బిచ్చమడిగిన బెగ్గర్ మీద విరుచుకుపడిపోయే భర్తలను చూసి ఆ రాత్రి దగ్గరవటానికి భార్యలు సంకోచిస్తారు. అత్తగారిని దెప్పిపొడుస్తూ, మిగిలిపోయిన కూరల్ని పనిమనిషికి ఇవ్వకుండా చెత్తలో పారేసే భార్యల్ని చూసి భర్తలు ఏవగింపు ఏర్పరుచుకుంటారు.

సెక్స్‌ను ప్రభావితం చేసే అంశాల్లో ఇలాంటివెన్నో! కాబట్టి భాగస్వామి మూడ్‌ను టర్న్ ఆన్ లేదా టర్న్ ఆఫ్ చేసే మన ప్రవర్తన ఏదో గమనించుకోవాలి. టర్న్ ఆఫ్ చేసే లక్షణాలను వదిలించుకోవాలి.

### ఫ్యాంటసీ మ్యాప్

ప్రతి వ్యక్తికీ కొన్ని ఊహలుంటాయి. వాటిని భాగస్వామితో పంచుకోవటానికి బిడియం అడ్డురావచ్చు. లేదా అవతలి వ్యక్తి ఏమనుకుంటారో? అనే సందేహాలూ ఉండవచ్చు. దాంతో ఊహలు ఎప్పటికీ ఊహలుగానే మిగిలిపోతూ ఉంటాయి. నేరుగా చెప్పటానికి మొహమాటం అడ్డుపడుతూ ఉంటే ఊహలకు అక్షర రూపమివ్వాలి. లైంగిక విషయాల్లో ఎలాంటి కోరికలున్నాయో? ఎలాంటి చర్యలు ఇష్టపడతారో? కాగితం మీద ఇద్దరూ రాసుకోవాలి. వాటిని ఇచ్చిపుచ్చుకుని చదువుకుంటే ఆశ్చర్యకరమైన విషయాలు తెలుస్తాయి. అవతలి వ్యక్తిది ఎంతటి అరుదైన ఊహ అయినా, అదెంత వింతగా అనిపించినా మీ స్పందన మాత్రం సానుకూలంగానే ఉండాలి. ఆ ఊహల్ని అర్థం చేసుకుని ప్రాక్టికాలిటీ అప్లై చేసి భాగస్వామిని ఆనందింపచేయాలి.



### లవ్ లాంగ్వేజ్

సెక్స్‌లో అద్భుతాలు జరగాలంటే అందుకు తోడ్పడే అంశాల మీద కూడా దృష్టి పెట్టాలి. సెక్స్‌తో సంబంధం లేని విషయాల్లో మీ అన్యోన్యతను ప్రదర్శించాలి. చేతులు పట్టుకుని మాట్లాడటం, నలుగురిలో ఉన్నా ఒక్క క్షణం పాటైనా దగ్గరికి హత్తుకోవటం, జుత్తు సవరించటం, బుగ్గలు గిల్లటం, కన్ను గీటడం....ఇలాంటి చర్యలన్నీ లైంగిక క్రీడకు ప్లస్ పాయింట్లవుతాయి. రోజంతా ఆఫీసు పనిలో బిజీగా గడిపి సాయంత్రం ఇంటికి చేరుకోగానే అపరిచిత ఫీలింగ్ రాకుండా ఉండాలంటే ఫోన్‌లో సెక్సీ మెసేజెస్ పంచుకోవాలి. కొన్ని నిమిషాలపాటైనా ఇంటిమేట్ సంభాషణ సాగాలి. ఇంట్లో ఉన్నప్పుడు ఒకరికిష్టమైన పనులు ఇంకొకరు చేస్తూ ఉండాలి. పురుషులు చీరలు మడతేయటం లాంటి పనులు చేసి భార్య మీద ప్రేమ చాటొచ్చు. టూ వీలర్ కడిగి భర్త మీద ప్రేమను భార్య ప్రదర్శించొచ్చు. ఇవన్నీ ప్రేమను ప్రదర్శించే పనులే! ఖరీదైన బహుమతులు ఇచ్చిపుచ్చుకోవటం మాత్రమే ప్రేమ అనిపించుకోదు. అవతలి వ్యక్తి చిన్న చిన్న అవసరాల్ని గుర్తించి తీర్చటం కూడా ప్రేమే! ఈ ప్రేమే అన్యోన్యమైన లైంగిక జీవితానికి తోడ్పడుతుంది.



### సెక్స్ టాక్

ఫోన్లలోనే కాదు ఆ క్రీడలో ఉన్నప్పుడూ సెక్స్ టాక్ కొనసాగాలి. ఇంటిమసీ పెరగటానికి సులువైన మార్గం ఇది. ప్రేమను వ్యక్తపరిచే తెలివైన మార్గం కూడా ఇదే! కాబట్టి భాగస్వామిలో మీకు నచ్చే అంశాలను ఆ సమయంలో వ్యక్తపరచాలి. అవతలి వ్యక్తి స్పర్శ, చర్యలు మీకెంతిష్టమో, మిమ్మల్ని ఎంతలా మురిపిస్తాయో కూడా ఈ సమయంలో వెల్లడిస్తే లైంగిక క్రీడ మరింత మధురమవుతుంది. అలాగే ఈ సమయంలో 'ఐ కాంటాక్ట్' ఎంతో కీలకమైనది. కళ్లు కలిపి చెప్పే మాటలు బలంగా నాటుకుంటాయి.

—గోగుమళ్ల కవిత




**నేను ఇక్కడ జరుగుతున్న విషయాలన్నీ ఎప్పటి కప్పుడు మేడంకు పూసగుచ్చినట్టు వాట్సప్‌లో రాసి పంపిస్తున్నాను. అలా రాయడం నాకు అలవాటైపోయింది. అది నా జీవితంలో జరుగుతున్న సంఘటనలకు సాక్షీభూతంగా, డైరీగా తయారైంది. ఎప్పటికైనా వీలయితే, నేను గొప్పవాణ్ణి గనుక అయితే నా జీవిత చరిత్ర రాయడానికి పనికొస్తుందని శ్రావణి అంటే నవ్వుకున్నాము.**

జనరల్ బాడీ మీటింగులో జరిగిన సంఘటన లన్నీ మేడంకు పోస్ట్ చేస్తూ కేస్ విషయంలో ఏం నిర్ణయం తీసుకోమంటారని అడిగాను. అసలు ముద్దాయి ఉరి వేసుకుని ఆత్మహత్య చేసుకున్నాక, ఇంక మాకయితే ఎవరికీ శిక్ష పడాలన్న కోరిక లేదని మేమిద్దరమూ కలిసి తీసుకున్న నిర్ణయం కూడా మేడం దృష్టికి తెచ్చాను.

"డైరెక్టర్ మీద కేసు వాపస్ తీసుకుందాం. కానీ, స్నేక్ గ్యాంగ్ వాళ్ళను మాత్రం వదలొద్దు. వాళ్ళు ప్రొఫెషనల్ క్రిమినల్స్!" అని మేడం సలహా ఇచ్చింది.

నేను దాన్ని వెంటనే అమలు పరిచాను. పోలీస్ ఇన్స్పెక్టర్‌తో సంప్రదించి కోర్టులో కాంప్రమైజ్ పిటీషన్ వేశాము. రెండు రోజుల్లో ఆ డైరెక్టర్ బయటకొచ్చాడు.

దాంతో టాలీవుడ్ మొత్తం నన్ను హీరోగా చూసింది. నా మంచితనాన్ని గుర్తించింది. ఆ డైరెక్టర్ జైల్లోనే ఉండి ఉంటే నాక్కూడా దినదిన గండంలా, ప్రతీ ఒక్కరి ద్వేషాన్ని భరిస్తూ, ఇదే రంగంలో కంటిన్యూ కావడం కష్టంగానే ఉండేది.

ఈ ఒక్క గుడ్‌విల్ యాక్ట్‌తో నా పట్లనే కాదు, శ్రావణికి కూడా కొత్త సినిమాలు రాసాగాయి. సినీ ఫీల్డులో మా పట్ల ఒక సుహృద్భావ వాతావరణం నెలకొంది. మొత్తం పరిశ్రమ మా నిర్ణయాన్ని అభినందించినా మా ప్రొడ్యూసర్ నా మీద పెంచుకున్న పగ మాత్రం తగ్గలేదు.

ఆ రోజు జనరల్ బాడీ మీటింగులో నేను సైగ చేస్తే అతని ఒళ్ళు హూనమయ్యేది. లేదా ఇన్స్పెక్టర్‌కు గనుక 'గో ఎహెడ్' అని చెబితే ప్రొడ్యూసరును లోపలేసేవాడు. కానీ, నేను నవీన్ చనిపోయిన దుఃఖంలో ఉన్నాను. ఒక్కసారిగా వైరాగ్యం ఆవహించినట్టయింది.

ఈ అవార్డులు, సినిమాలు ఎందుకన్న నిర్లిప్త భావంతో ఓ విషాద లోకంలో ఉన్నాను. నా కన్నా ముందు ఎంతోమంది ఎన్నో అవార్డులు సాధించారు. కనకాభిషేకాలు, గజారోహణాలు, గండపెండేరాలు తొడిగించుకున్నారు. కానీ, చివరకు ఏమైంది... కాలగర్భంలో కలిసి పోయారు.

అట్లాంటి మూడ్‌లో ఉన్న నేను ప్రొడ్యూసర్ మీద ఈగ వాలనీయలేదు. అయినా అతనికి నా మీద కోపం తగ్గలేదు. కొంతమంది అంతే. మిథ్యా భేషజాలకు, అహాలకు వేలాడుతూనే జీవితాలు గడిపేస్తుంటారు.

నాకయితే కేసును విత్‌డ్రా చేసుకున్న తర్వాత చాలా ప్రశాంతంగా ఉంది. లోకమంతా పచ్చగా; మనుషులంతా సుందరంగా; భవిష్యత్తు బంగారు లోకంలా అన్పించ సాగింది. అంతటి ప్రశాంతత ఈ మధ్యకాలంలో అనుభవించలేదు. ఏమంటూ ఈ సినిమా ప్రారంభమైందో గానీ నా జీవితం, రోలర్ కోస్టర్లో కూర్చున్నప్పటిలా పరుగులు పెడుతోంది. ఇప్పుడు హాయిగా ఉంది. సమస్యలు లేవు. కోరికలు కూడా లేవు. ఈ సినిమా పూర్తి కాగానే, శ్రావణిని పెళ్ళి చేసుకుని కొద్ది రోజుల పాటు టాలీవుడ్ నుండి పారిపోవాలని మాత్రం నిశ్చయించుకున్నాను. ఈ మధ్య అలాగే ఒక ప్రముఖ టాలీవుడ్ హీరో సంవత్సరం పాటు ప్రపంచమంతా తిరుగుతూ రిజువనేట్ అయ్యాడు కూడా.

నిజానికి నాకు అప్పటి నుంచి ఏదో అవార్డు కొట్టాలన్న తపన, ఆరాటం కూడా తగ్గిపోయాయి. నా వంతు కృషి నేను చేస్తాను. ఫలితం భగవంతుని చేతిలో పెడతాను. 'శ్రీరాం సర్' థియరీ ప్రకారం ప్రతీ ఫలితం 'ప్రీ డిటర్‌మైన్డ్' అంటే 'మన కర్మ ఫలితం ఎప్పుడో రాసి పెట్టబడిన తర్వాత, నిర్ణయం అయిపోయిన తర్వాత' ఇంకా ఎందుకు తాపత్రయం అని అనిపించింది.

ఒక్క శ్రావణి విషయం తప్ప నాకు ఆ నాలుగైదు రోజుల్లో దేని మీదా ధ్యాస లేదు. యాంత్రికంగా నా పని నేను చేసుకుంటూ పోతున్నాను.

కానీ, భగవంతుడు చాలా చిలిపివాడు. మనం ప్రపోజ్ చేస్తే గాడ్ డిస్పోజ్ చేస్తాడు కదా!

***

'సినిమా' అన్నది రంగుల ప్రపంచమే కానీ ఆ రంగుల ప్రపంచాన్ని సృష్టించడానికి ఎన్ని వందల మంది కృషి చేస్తారన్న విషయం సామాన్య ప్రజల అంచనాకు చిక్కదు.

డిజిటల్ మీడియా వచ్చిన తర్వాత సినిమా రంగంలోని అన్ని క్రాఫ్టులలో అద్భుతమైన వైవిధ్యం, అత్యున్నత ప్రమాణాలతో వస్తున్న ఫలితాలు చూపరులను దిగ్భ్రాంతులను చేస్తున్నాయి. అసలు నిజమేదో, డిజిటల్ మాయ ఏదో తెలుసుకోలేనంతగా అభివృద్ధి చెందింది. చిన్న పిల్లాడు సైతం 'అది డిజిటల్ రా!' అనేంతగా అభివృద్ధి చెందింది. తెలుగులో 'బాహుబలి'; ఇంగ్లీషులో 'అవతార్', 'లైఫ్ ఆఫ్ పై' వంటి సినిమాలు కేవలం డిజిటల్ మాయాజాలంతోనే వందల కోట్లు కొల్లగొట్టాయి.

## జరిగిన కథ

ఆస్కార్ అవార్డుల పోటీల్లో అతడి చిత్రం ఎంపికయిన సందర్భంగా అమెరికా వెళుతూ, గతం గుర్తుచేసుకున్నాడు ఆ తెలుగు దర్శకుడు. డీసీపీ పుష్పాకిరణ్ సహాయంతో సినిమా నిర్మించేందుకు సిద్ధమవుతాడు. హీరోయిన్ శ్రావణిని ప్రేమిస్తాడు. డైరెక్టర్ ఇంట్లో హార్డ్‌డిస్క్ దొంగిలించిందన్న నెపంతో శ్రావణిని అరెస్ట్ చేస్తారు. డీసీపీ మేడం శ్రావణికి బెయిల్ ఇచ్చి, డైరెక్టర్ ఇంటికి తీసుకువస్తుంది. ఆమెని పెళ్ళి చేసుకోవాలనుకుంటాడు దర్శకుడు. తన ఆఫీసుపై ఐటీ రెయిడ్ జరగటంతో, చకచకా ఆర్థిక లావాదేవీలన్నీ చక్కబెట్టేస్తాడు. తన తల్లిదండ్రులకు శ్రావణిని కోడలుగా పరిచయం చేస్తాడు. ప్రొడ్యూసర్, అతడి స్నేహితులూ కలిసి దర్శకుల అసోసియేషన్ నుంచి దర్శకుణ్ణి బహిష్కరించడం ఒక్కటే ఎజెండాగా ఆదివారంనాడు డైరెక్టర్స్ యూనియన్ మీటింగ్ ఏర్పాటుచేస్తారు. ఈలోగా జైల్లో నవీన్ ఆత్మహత్య చేసుకుంటాడు. ఓ ఐదుపేజీల సూసైడ్ నోట్ రాసి, మీటింగులో దర్శకుడే ఆ ఉత్తరాన్ని చదవాలని కోరతాడు. దాంతో మీటింగులో దర్శకుడు ఆ ఉత్తరం చదువుతాడు. జరిగిందేమిటో అందరికీ తెలుస్తుంది.

**ఆ తర్వాత.....**

గత రెండు దశాబ్దాలుగా 'డిజిటల్ ఇంటర్మీడియట్ (D.I.)' అనే ప్రక్రియ ద్వారా కలర్ కరెక్షన్ చేసి, కంటికింపైన రంగులను వెండితెర మీద పండిస్తున్నారు.

నేను తీసే సినిమాలో DIకి పెద్దగా అవకాశం లేదు. ఎందుకంటే, అవార్డు కోసం తీసే సినిమాలలో గ్రాఫిక్స్, కృత్రిమంగా చేసే కలర్ కరెక్షన్స్ వంటివి ఉండకూడదని అంటారు. కానీ, అవన్నీ ఇబ్బడి ముబ్బడిగా వాడిన సినిమాలకే నేషనల్ అవార్డులు వస్తున్నాయి. అంత పలుకుబడి నాకు లేదు కాబట్టి, నిర్దేశించిన నిబంధనలకు లోబడే సినిమా తీస్తున్నాను.

అయినా, పోస్ట్ ప్రొడక్షన్‌లో డీఐ ఒక భాగమైపోయింది. ఇక్కడే ఒక గమ్మత్తు జరిగింది.

నర్సాపూర్ అడవుల్లోని పల్లెటూర్లో షూటింగ్ జరిగినప్పుడు కాస్ట్యూమ్స్ అన్నీ హైదరాబాద్ నుండే తీసుకెళ్ళాము. సినిమాలో హీరోకు ఒక చెల్లెలు ఉంటుంది. హీరోయిన్ శ్రావణి కన్నా రెండు మూడేళ్ళ చిన్న వయసు. ఎలా జరిగిందో, ఎవరి పొరపాటు వల్ల జరిగిందో గానీ ఒకే పసుపు రంగు జాకెట్టు హీరో చెల్లెలు వేసుకుంది; తరువాత సీన్లో శ్రావణి అదే జాకెట్టు వేసుకుంది. షూటింగ్ అప్పుడు ఆ రెండు సీన్లు రెండు వేర్వేరు రోజుల్లో షూట్ చేశాం కాబట్టి మేం గమనించలేదు. ఫైనల్ ఎడిటింగ్ అయ్యాక ఒక సీనులో హీరో చెల్లెలు, తరువాత సీన్లో శ్రావణి అదే సేం జాకెట్టులో కనిపిస్తారు.

మాది లో బడ్జెట్ సినిమానే కావచ్చు. కానీ, ఒకే జాకెట్టును రెండు పాత్రలకు వేసేంత మరీ లో బడ్జెట్ కూడా కాదు కదా. ఆ సీన్‌ని మళ్ళీ షూట్ తీయాలంటే దాదాపు అసంభవం. ఆ సమస్యను మా డీఐ టెక్నీషియన్ అయిన డ్రీమ్స్ రాజు గారు పరిష్కరించారు. శ్రావణి వేసుకున్న జాకెట్టు కలరును, ఆమె నటించిన సీనులోని బ్యాక్ గ్రౌండుకి మ్యాచింగుగా, అంటే ఆమె ఆ జాకెట్టు వేసుకున్నప్పుడు ఆకుపచ్చని వరి పొలంలో నిలబడి హీరోతో మాట్లాడుతూ ఉంటుంది కాబట్టి, పసుపు రంగు జాకెట్టు రంగును ఆకుపచ్చ రంగుగా కలర్ కరెక్షన్ చేశారు.

అది చిన్న విషయమే గానీ, ఆ టెక్నాలజీ మహత్యం నాకు అద్భుతంగా అనిపించింది. అందుకని, ఇప్పుడు సినిమాలకు నటులు, లొకేషన్లు, కాస్ట్యూమ్స్ పెద్దగా అవ



సరం లేదు. ల్యాబులో కూర్చుని మొత్తం సినిమాను సృష్టించవచ్చు. ఈ మధ్యన 3D మోషన్ కాప్చరింగ్ టెక్నిక్ ద్వారా రజనీకాంత్, దీపికా పడుకొనె నటించిన 'విక్రమసింహ' (కొచ్చాడియన్) అనే సినిమా తీశారు. సినిమా నడవలేదనుకోండి. అది వేరే విషయం.

అంటే, అద్భుత సుందర దృశ్యాలను, సూర్యోదయ, సూర్యాస్తమయాలను, జలపాతాలను, సముద్ర తుఫానులను కంప్యూటర్లోనే సృష్టించవచ్చును.

డీఐ చేయడం వల్ల సినిమా అంతా ఒక సప్త వర్ణాల హరివిల్లులా తళతళమని మెరిసిపోతుంది. కానీ, నా సినిమా జానర్ ప్రకారం శ్రావణి ఉన్న, గ్రామీణ ఎపిసోడ్లు మాత్రమే అలా ఉంటాయి. మిగిలిన సినిమా అంతా ఒక విషాద రసానికి అనుగుణంగా అన్నట్లు చీకట్లు, డల్ లైటింగ్‌తో ఉంటుంది.

దాదాపుగా ఒకే సమయంలో, సైమల్టేనియస్‌గా, నేపథ్య సంగీతం(RR), డిజిటల్ ఇంటర్మీడియట్ (DI), డబ్బింగ్, సౌండ్ ఎఫెక్ట్స్ అన్నీ పూర్తి కావొచ్చాయి. సినిమాకు ఒక్కొక్క హంగు అద్దుతున్న కొద్దీ ఒక్కో కోణంలో ఆ సినిమా విశిష్టత బయటపడుతుంది. దాని రూపమే మారిపోతుంటుంది.

ఒక శిల్పి శిల్పాన్ని చెక్కుతున్నప్పుడు, అది అసంపూర్ణంగా ఉన్నా సరే, రోజుకో అందం సంతరించుకుంటుంది. ఒక బంగారు ఆభరణం తయారయ్యే విధానంలోనే, సరైన షరాబు, దాని తుది రూపాన్ని, అందాన్ని అంచనా వేయగలడు.

అలాగే సినిమా కూడా, డబ్బింగు జరగగానే పాత్రలు ప్రాణం పోసుకుని మన ముందు నర్తిస్తాయి. నేపథ్య సంగీతం జతకూడి, ఆ సన్నివేశంలో నిక్షిప్తమైన ఎమోషన్‌ను, భావ గాఢతను వెలికి తీస్తుంది. సౌండ్ ఎఫెక్ట్స్‌తో ఒక యదార్థ వాతావరణం సృజించబడుతుంది. డీఐతో ఒక సప్తవర్ణ సుందర దృశ్యం కళ్ళముందు ఆవిష్కృతమవుతుంది.

నా సినిమా కూడా అలాగే సర్వాంగ సుందరంగా తయారయింది.

రసాయన శాస్త్రంలో ఒక సిద్ధాంతం ఉంది. ఒక 'సంతృప్త' ద్రావణంలో మరే లవణం కానీ, రసాయన పదార్థం కానీ కలిపినా ఆ ద్రావణం వాటిని స్వీకరించదు. ఉదాహరణకు, ఒక గ్లాసు నీళ్ళల్లో రెండు చెంచాల పంచదార కలిపితే కరుగుతుంది. మూడో చెంచా పంచదార కూడా మెల్లిగా కరుగుతుంది. నాలుగో చెంచా పంచదార కరగకుండా గ్లాసు అడుగున పంచదార రూపంలోనే మిగిలి

**సినిమా అద్భుతంగా, తన మనసులోని భావాలకు అనుగుణంగా వచ్చిందనుకున్నాడు దర్శకుడు. పాత్రలన్నీ శిల్పాలై కళ్ళ ముందు సాక్షాత్కరించాయా అనిపించేట్టు ఉన్నాయనుకున్నాడు. ఏ లోటూ లేదనుకున్నాడు. కానీ తనకు మాత్రమే నచ్చితే చాలదు కదా! ప్రేక్షకుడికి నచ్చాలి. తను అనుక్షణం శ్రమించి, శ్వాసించి నిర్మించిన సినిమాలో తప్పొప్పులు తనకు కనిపించవు. మరి సినిమా ఎలా వచ్చిందో తెలుసుకునేందుకు దర్శకుడు ఏం చేశాడు?**

పోతుంది. అంటే ఆ పంచదార ద్రావణం, సంతృప్త స్థితిని చేరుకుందన్న మాట.

అలా నా మనసు సంతృప్త స్థితిని చేరుకుంది. ఈ సినిమా నా మనసులోని భావాలకు అనుగుణంగా, నేను సంవత్సరం పైగా కష్టపడి రూపొందించుకున్న స్క్రీన్‌ప్లేకు వంద శాతం న్యాయం చేకూర్చేలా తయారయింది. నేను ఏ పాత్రను ఎలా చెక్కానో అవి అలాగే మూర్తీభవించి, నా కళ్ళ ముందు సాక్షాత్కారమయ్యాయి. ఇంక అందులో ఏ లోటు లేదనుకున్నాను.

ఆ రోజు నేను అనుభవించిన ఆనందం అంతా ఇంతా కాదు. వెంటనే, శ్రావణి ఎక్కడుందో కనుక్కుని అక్కడికి చాలా ఉద్వేగంగా వెళ్ళాను.

ఇప్పుడు టాలీవుడ్ అంతా మా ఇద్దరికీ బ్రహ్మరథం పడుతోంది. నేను వెళ్ళగానే, శ్రావణి నా దగ్గరకు వచ్చింది. షూటింగు ఆగిపోయింది. డైరెక్టర్ నన్ను చూసి, 'క్యారీ ఆన్' అన్నట్టుగా చెయ్యి ఊపాడు.

నేను నమస్కరించాను.

"ఒక్క ఐదు నిమిషాలు ఏకాంతంగా మాట్లాడే వీలుంటుందా?" అని అడిగాను.

శ్రావణి ఆశ్చర్యంగా చూసి, "నా కారవాన్ ఉంది. వెళ్దామా?" అని అడిగింది.

మేము కారవాన్‌లోకి వెళ్ళిన వెంటనే, గడియ వేసి, శ్రావణిని కౌగలించుకుని, వెక్కి వెక్కి ఏడ్చాను.

శ్రావణి బిత్తరపోయింది.

"ఏమైంది? ఏమన్నా ప్రాబ్లమా? అత్తయ్యా వాళ్ళు బాగున్నారా?" అని ఆందోళనగా అడిగింది.

నేను కాదని తలూపుతూ, "మన సినిమా పూర్తయింది. ఇప్పుడే చూశాను" అన్నాను, కళ్ళు తుడుచుకుంటూ.

"బాగోలేదా?" అని అడిగింది భయంభయంగా.

"అద్భుతంగా ఉంది. నా జీవితం ధన్యమైంది. జీవితంలో ఇంకో సినిమా తీయకున్నా పర్వాలేదు. జీవితాంతం ఈ సినిమా తీసిన మధుర క్షణాలు తలుచుకుంటూ గడిపేయగలను" అన్నాను, నవ్వుతూ. అప్పటికీ నా కళ్ళల్లో నుండి నీళ్ళు కారుతూనే ఉన్నాయి.

శ్రావణి కిలకిలా నవ్వుతూ, "ఓరి పిచ్చీ! సినిమా బాగున్నందుకు ఏడుస్తున్నావా!" అంది.

వెంటనే, "నా రోల్ ఎలా వచ్చింది?" అని కుతూహలంగా అడిగింది.

"మహాద్భుతం! న్యాయంగా, పైరవీలు లేకుండా, గుండె మీద చెయ్యి వేసుకుని, నిజాయితీగా ఉండే జ్యూరీ సభ్యులుంటే, ప్రపంచంలోని అన్ని అవార్డులు నీ పాదాక్రాంతం అవుతాయి" అన్నాను ఉద్వేగంగా.

"అందుకేనా, ఇంత ఎమోషనల్ అవుతున్నావు?" అంది శ్రావణి.

"ఈ సినిమా నీ కోసమే, ప్రపంచానికి నీ టాలెంట్ షోకేస్ చేయడానికే తీసినట్టుగా ఉంది!"

"నాకు అవార్డులు, ప్రపంచ గుర్తింపులు ఏం అక్కర్లేదు. నీకు నచ్చితే చాలు. అవార్డులు ఎలా వస్తాయో మనకు తెలుసు. వాటి మీద ఆశ లేదు. నా మెడలో నువ్వు కట్టబోయే మంగళసూత్రం నా గుండెలకు తాకుతుంటే కలిగే ఆ ఆనందమే నాకు గొప్ప వరం. వంద అవార్డులతో సమానం..." అని అంటుండగానే తన గొంతు జీరబోయింది. దుఃఖం తన్నుకొచ్చి కంటి గవాక్షం దగ్గర ఆగింది. నేను ఆ కళ్ళను అలవోకగా ముద్దాడి ఆ కంటి నీటిని మింగేశాను. తన బాధనంతా గరళకంఠుడిలా మింగేశాను.

అసలు ఈ శుభతరుణంలో వేరే వారయితే ఎలా సెలబ్రేట్ చేసుకునే వాళ్ళో గానీ, మేమిద్దరమయితే ఒకరి సమక్షంలో మరొకరం కన్నీరు కార్చి, మా అద్భుత సుందర ప్రణయ కావ్యానికి మరింత బలం చేకూర్చాము.

శ్రావణి, కరిగిపోయిన మేకప్పును సర్దుకుంది. ఇద్దరం కారవాన్‌లో నుండి బయటకొచ్చాము.

***

నాకయితే సినిమా అద్భుతంగా ఉన్నట్టనిపించింది. కానీ, ఇక్కడ నా ఒక్కడి అభిప్రాయంతో సిని



మాలు నడవవు. నాకు నచ్చిన సినిమా వేరేవాళ్ళకు నచ్చకపోవచ్చు. నాకు ఇప్పుడొచ్చే చాలా సినిమాలు నచ్చవు. కానీ, అవే సూపర్ హిట్లు కొడుతున్నాయి. నేను అనుక్షణం శ్వాసించి, నిర్మించిన సినిమాలోని చిన్న చిన్న తప్పొప్పులు నాకు కన్పించవు. నాకు ప్రతీ సీన్ ప్రాణంలా అనిపిస్తుంది. ఆ సీన్ తీయడానికి నేను పడ్డ కష్టమూ, నటీనటుల కష్టాలూ అన్నీ గుర్తుకొస్తాయి. అందుకే, ఏ సీనులో ఏ ఒక్క ఫ్రేం ఎడిట్ చేయాలన్నా నాకు బాధ కలుగుతుంది. ఆ అతి మమకారం వల్ల ఏవైనా లూజ్ షాట్స్, లూజ్ సీన్స్, ల్యాగ్స్ ఉంటే కథ చకచకా కాక నత్త నడకన సాగినట్టు అనిపించే ప్రమాదం లేకపోలేదు.

అందుకే నా శ్రేయోభిలాషులైన ప్రసాద్ గారూ, రెడ్డిలతో కలిసి కూర్చొని డీటీయస్ స్టూడియోలో చూశాం. ఎందుకంటే టీవీ ముందు కూర్చొని చూస్తే సరౌండ్ థియేటర్ అనుభవం రాదు. యాంబియెన్స్ ధ్వనులు అంటే సీన్ జరుగుతున్న ప్రాంతంలోని వాతావరణంలో ఉండే ధ్వనులను సౌండ్ ఇంజనీర్ వేస్తాడు. ఉదాహరణకు ఒక తోటలోని సీన్ ఉంటే అక్కడ వాతావరణంలో పక్షుల కిలకిలారావాలు, గాలి వీయడం, చెట్లు రెపరెపలాడడం వంటి ధ్వనులను పోస్ట్ చేస్తారు. ఈ ధ్వనులన్నీ టీవీలో వినిపించవు. దాంతో సౌండ్ మిక్సింగ్ వల్ల కలిగే అపూర్వ అనుభూతిని అంచనా వేయలేము. దాని కోసం డీటీయస్ స్టూడియోలో అందరం కలిసి చూశాము.

అప్పటి వరకు ఫైనల్ సినిమాను నేనూ, ఎడిటర్ తప్ప ఎవ్వరూ చూడలేదు. ఇప్పుడు తయారయిన సినిమా నా నిర్ణయం మూలంగా తయారయిందే. ఎడిటర్ కూడా సూచనలు చేస్తాడు కానీ, నిర్ణయం డైరెక్టర్‌గా నాదే ఫైనల్. నా మాటకు ఎదురు చెప్పే సాహసం చేయలేడు.

కానీ, వీళ్ళిద్దరూ నిష్ణాతులు. సినిమాను రీళ్ళవారీగా నింపాదిగా చూసి వాళ్ళిద్దరూ కలిసి 2 గంటల 21 నిమిషాల సినిమా నుండి 8 నిమిషాల సినిమాను, ఐదారు చోట్ల కట్ చేయాలని చెప్పారు. నా ప్రాణం విలవిలలాడింది. అయితే అలా ఎడిట్ చేయడం వల్ల సినిమా షార్ప్ అవుతుంది. సినిమా పరుగులు పెడుతుంది. అందుకే, నేనూ ఒప్పుకున్నాను. 2.21 గంటల నుండి 2.13 గంటలకు కుదించాము.

దాదాపుగా ఫైనల్ దశకు చేరుకున్నాము. ఇక సెన్సారుకు వెళ్ళడమే తరువాయి. ఒకసారి సెన్సార్ అయిందంటే మార్పులూ చేర్పులూ సులభంగా కుదరవు.

నాకెందుకో ధైర్యం చాలడం లేదు. ఎందుకైనా మంచిదని నా శ్రేయోభిలాషులైన ఫిలిం క్రిటిక్స్‌కు చూపించి వారి సలహా కూడా తీసుకుంటే బాగుంటుందనిపించింది. నవలా రచయితను కూడా ఇన్వైట్ చేసి ఆయన అభిప్రాయం కూడా సేకరిస్తే పబ్లిసిటీకి ఉపయోగపడుతుందని ఆలోచించాను.

జూబ్లీహిల్స్‌లోని ఫిల్మ్‌నగర్ కల్చరల్ సెంటర్లో ఒక ప్రీవ్యూ థియేటర్ ఉంది. ఒక మెంబర్ రికమెండ్ చేస్తే అతి తక్కువ మొత్తం డబ్బు కట్టి అందులో సినిమాను ప్రదర్శించుకోవచ్చు. ఒక సాయంత్రం ప్రీవ్యూ అరేంజ్ చేశాము.

నా అభిమాన క్రిటిక్ కత్తి మహేశ్‌తో పాటు మరికొంత మంది క్రిటిక్స్‌తో కలిసి సినిమా చూశాము.

ఇట్లాంటి మనోవైజ్ఞానిక నవలను సినిమాగా తీయడమే సాహసమని, మళ్ళీ నవలా సాహిత్యాన్ని సినిమాలుగా మలిచే ప్రయత్నం ఈ సినిమాతో మొదలు కావాలని అంటూనే, ఒకరిద్దరు కొన్నిచోట్ల కొంతమంది నటన అమెచ్యూరిష్‌గా, అంటే అపరిపక్వంగా ఉందని అభిప్రాయపడ్డారు. అయితే, అందరూ ఏకగ్రీవంగా శ్రావణి నటన మాత్రం అద్భుతమనీ, హీరో రాంకు మంచి భవిష్యత్తు ఉందనీ మెచ్చుకున్నారు.

కత్తి మహేశ్ అయితే శ్రావణికి ఎన్నో అవార్డులు ఖాయమని చెప్పాడు. అది ఒకందుకు సంతోషం కలిగించినా, సినిమా గురించిన చిన్న వ్యతిరేక అభిప్రాయం కూడా వినలేని స్థితిలో ఉన్న నా మనసు గాయపడింది. అదే రోజు రాత్రి నేనూ, తిరుపతి రెడ్డి కూర్చొని 2.13 గంటల సినిమా నుండి మరో 6.30 నిమిషాల సీన్లను కోసి పారేశాము. నా గుండెల నుండి రక్తం స్రవించడమొక్కటే మిగిలింది. ముందు బాధ కలిగినా తర్వాత, ఆ సినిమా దర్శకుడిగా కాకుండా, ఒక సాధారణ ప్రేక్షకుడిలా, ఒక విమర్శకుడిలా సినిమా చూసినప్పుడు, ఈ సినిమా ఇలా కాకపోతే, మరోలా ఉండే ఆస్కారమే లేదనిపించింది. నా సినిమా కావడానికి ప్యారెలల్ సినిమా అంటే ఆర్ట్ సినిమానే అయినా ఇతర ఆర్ట్ సినిమాల్లో మాదిరిగా కాకుండా సంఘటనలు ఒకదాని వెనుక ఒకటి చకచకా పరిగెడుతుంటాయి.

ఆర్ట్ సినిమాల గురించి ఒక అపప్రథ ఉంది. ఒక పాత్రధారి ఆబిడ్స్ నుండి బయలుదేరి బస్సులో కోఠీ వరకు ప్రయాణించే సీనులో, అసలు ప్రయాణం పది నిమిషాలు పడితే, సినిమాలో పదిహేను నిమిషాల పాటు చూపిస్తారని చమత్కరిస్తారు. అంత స్లోగా, అంత నిరాసక్తంగా సినిమా కథ జరుగుతుంటుంది. అధి వాస్తవికత ఎక్కువవుతుంది. కానీ, నా సినిమాలో ఆ బాధ లేదు. అరవయ్యవ దశకంలోని వాతావరణాన్ని సృష్టించినా సినిమా కథనం వేగంగా సాగుతుంది. అసలు నిజం చెప్పాలంటే కమర్షియల్ సినిమాలో ఉండే ఒక రేప్ సీన్, ఒక మర్డర్, ఒక న్యూడ్ ఫోటో షూట్, ఒక లవ్ స్టోరీ, ఒక ఫైట్, ఒక యూనివర్సిటీ అన్నీ ఉన్నాయి. కానీ, ఇందులో పాత్రలు సజీవంగా ప్రవర్తిస్తుంటాయి. హీరోనే అవమానాల పాలవుతుంటాడు. హీరోయిన్‌ను విలన్ ఎత్తుకు పోతుంటే నిస్సహాయంగా చూస్తూ ఉండిపోతాడు. ఇందులో మనుషులు మనుషుల్లాగానే ప్రవర్తిస్తుంటారు.

***

మొత్తానికి, సినిమా సర్వ హంగులతో, అన్ని విధాలా నేను సంతృప్తి చెందిన తర్వాత, సెన్సారుకు అప్లై చేద్దామని నిర్ణయించుకున్నాను. కానీ, శ్రావణి ముందుగా గుడికి వెళ్ళి పూజ చేయిద్దామంది. నేను, శ్రావణి హార్డ్ డిస్కును తీసుకుని సికింద్రాబాదు, పద్మారావునగర్‌లో ఉన్న స్కందగిరి దేవాలయానికి వెళ్ళి, హార్డ్ డిస్కును శివలింగం చెంతన ఉంచి

## ఆమె దగ్గర సొమ్ములున్నాయట!

తను ఆర్థిక ఇబ్బందుల్లో ఉన్నట్టు వచ్చిన వార్తల మీద కిమ్‌శర్మ మండి పడింది భర్త నుంచి విడిపోయి వచ్చినంత మాత్రాన నా దగ్గర డబ్బులుండవా? డబ్బులుండకూడదా? అంటూ ప్రశ్నిస్తోంది. సినిమాల్లో నటించాలన్న తన కోరిక తీర్చుకోవడానికే తిరిగి ప్రయత్నాలు మొదలు పెట్టిందట తప్ప డబ్బుల కోసం కాదట! నా వ్యక్తిగత విషయాల గురించి వాస్తవాలు తెలుసుకోకుండా నోటికి వచ్చినట్టు రాస్తే అస్సలు ఊరుకోనని వార్నింగ్ ఇస్తోంది.



## ఇలీ బేబీ అలా అనలేదట!

మొన్నామధ్య ఇలియానా ఓ ఇంటర్వ్యూలో మాట్లాడుతూ, 'అవకాశాల కోసం పడకగదుల్లోకి వెళ్లవలసిన అవసరం లేదు' అని చెప్పినట్టు వార్తలు వచ్చాయి. ఎటూ ఎలాగూ ఆ రంగంలో జరిగే దాన్నే ఇలియానా బహిరంగంగా చెప్పి ఉంటుంది అని అందరూ అనుకున్నారు. కానీ ఇలియానా అసలు అలాంటి మాటలు ఎక్కడా ఎవరితోనూ మాట్లాడలేదట! ఆమె ఇంటర్వ్యూ ఇచ్చింది అని చెబుతున్న సమయంలో ఇలియానా ఓ సినిమా షూటింగ్ సందర్భంగా విదేశాల్లో ఉంది. తిరిగి వచ్చి తన మీద వచ్చిన వార్తలను చూసి ఇలియానా నోరు వెళ్ళబెడుతోందట! తన మాటలను వక్రీకరించి రాసే వారిని చూశాను కానీ, ఇవ్వని ఇంటర్వ్యూని ఇచ్చినట్టు రాసే వారిని ఇంత వరకూ చూడలేదని నెత్తి నోరు కొట్టుకుంటోందట!

పూజ చేయించాము. గుడి మెట్లమీద కూర్చున్నాము. ఏదో నిబ్బరం, ఏదో అలౌకికమైన సంతృప్తి కలిగింది. దేవుడి బొట్టు పెట్టుకున్న శ్రావణి ముఖం దేదీప్యమానంగా వెలిగిపోతోంది. శ్రావణి చేతిని ఆప్యాయంగా నిమిరాను.

సెన్సారుకు అప్లై చేశాను. 'క్యూబ్' ఆఫీసులో సినిమా లోడ్ చేయించాం. ఇక నిరీక్షణే. వాళ్ళు పిలిచేంత వరకు వేచి చూడడమే!

ఈ లోపల, జ్యూయలరీ యాడ్ వాళ్ళు వచ్చి శ్రావణికి కాస్ట్యూమ్స్ కోసం కొలతలు తీసుకున్నారు. తొందరలోనే మారిషస్‌లో రెండు రోజుల షూటింగ్ ఉంటుందని మా పాస్‌పోర్టులు తీసుకుని వెళ్ళారు.

అదే రోజు శ్రావణి బ్యాంక్ అకౌంట్లో ఇరవై లక్షలు జమ అయ్యాయి. నా దగ్గర కూడా కార్లు, నగలు కొన్నాక నలభై లక్షల వరకు డబ్బులు మిగిలే ఉన్నాయి.

నా భవిష్యత్తు అంతా ఈ సినిమా ఫలితం మీదనే ఆధారపడి ఉంది. సినిమా హిట్టయితే మరిన్ని సినిమాలు చేసే అవకాశమొస్తుంది. లేకపోతే కష్టమే. నాలా కాకుండా శ్రావణికి మంచి భవిష్యత్తు ఉంది.

"కనీసం ఐదారేళ్ళ వరకు నీకు హీరోయిన్ ఛాన్సులు వస్తాయి. లేదంటే నువ్వు బుల్లి పాపాయికి అమ్మ అయ్యేంత వరకు మాత్రం సినిమా ఛాన్సులు గ్యారెంటీ!" అని నేనంటే శ్రావణి కళ్ళనీళ్ళ పర్యంతమైంది.

"నిజంగానా? ఓ బుజ్జి పాపాయికి జన్మనిచ్చి అమ్మనయ్యే అదృష్టం ఉందా నాలాంటి నిర్భాగ్యురాలికి?" అంది.

"ఛ! ఒక్క పాపే ఎందుకు? నువ్వు కంటానంటే ఇంటి నిండా బుల్లి పాపాయిల కేరింతలు ఓ పదేళ్ళ పాటూ వినిపించే ప్రయత్నం నేను చేస్తాను" అన్నాను.

శ్రావణి సిగ్గుల మొగ్గయింది.

ఆ రోజు శ్రావణి చిక్కటి నలుపు రంగు చీరలో, బంగారపు రేకుల్లో చుట్టి తెచ్చిన, నల్లగులాబీలా ఉంది. సిగ్గుతో ముడుచుకుపోయిన శ్రావణిని నేను అక్కున చేర్చుకున్నాను.

శ్రావణి నా కౌగిలిలో నుంచి తల పైకెత్తి,

"ఎంత తొందరగా వీలయితే అంత తొందరగా నాకో పాపాయినివ్వు స్వామీ! ఈ జీవితానికో సార్థకతను ప్రసాదించు ప్రియా!" అంది.

నేను ఫక్కున నవ్వాను.

"డబ్బింగుకు వెళ్ళి వచ్చావా? ప్రేమ డైలాగులు వల్లిస్తున్నావు?" అన్నాను.

తను సిగ్గు పడింది.

శ్రావణి అమాయకంగా అలా అడిగినా మేమిద్దరం పెళ్ళి చేసుకోవడానికి రెండు మూడు అడ్డంకులు ఉన్నాయి. నా సినిమా భవిష్యత్తు ఏమిటో తెలియాలి; శ్రావణి తల్లి విడుదల కావాల్సి ఉంది; శ్రావణి చేస్తున్న సినిమాలు పూర్తి కావాలి. ఎంత కాదనుకున్నా ఈ సంవత్సరం మా వివాహం జరగడానికి అవకాశాలు లేవు.

ఈ లోపల మా కొత్త కాపురానికి కావలిసిన హంగులు ఏర్పరుచుకోవాల్సి ఉంది. చేయాల్సిన పనులు లిస్టు రాసుకున్నాము.

అందులో ఒక ఇల్లు ఏర్పరుచుకోవడం ముఖ్యమైనది. అందుకే మా దగ్గరున్న అరవై లక్షలతో పాటు కొంత లోన్ తీసుకుని సాగర్ సొసైటీలో ఒక డూప్లెక్స్ ఇల్లు బేరం చేశాము.

***

శ్రావణి వాళ్ళమ్మ జైలు నుండి రిలీజ్ అయ్యే రోజున మేమిద్దరమూ వరంగల్లు వెళ్ళాము. జైలు గేటు గుండా బయటకు వచ్చిన ఆమెను చూసి నేనయితే నివ్వెర పోయాను. ఎముకల గూడుకు, అస్థిపంజరానికి బట్టలు తొడిగినట్లుగా ఆమె శరీరం మీద బట్టలు వేలాడుతున్నాయి. ఇద్దరూ కౌగలించుకుని ఏడుస్తుంటే ఇద్దరినీ నేనే ఓదార్చాను. దగ్గర్లోనే ఉన్న ఒక హోటల్లో రెండు రూములు తీసుకున్నాము. స్నానపానాదులు అయిన తర్వాత, శ్రావణి హైదరాబాదు నుండి తన తల్లి కోసం తెచ్చిన చీర ఇచ్చింది.

సాయంత్రం వరకు విశ్రాంతి తీసుకుని, చీకటి పడ్డ తర్వాత దగ్గరలోనే ఉన్న శ్రీ భద్రకాళీ అమ్మవారిని అర్చించుకున్నాము. అమ్మవారి దివ్యమంగళ రూపం చూస్తుంటే మనసు మూలమూలల్లో దాక్కున్న భయాలన్నీ పటాపంచలై పోయి, అమ్మ అనుగ్రహానికి పాత్రమైన భావం కలిగింది.

గుళ్ళో చెరువు ముందర ఉన్న బెంచీల మీద కూర్చున్నప్పుడు, శ్రావణి, నన్ను వాళ్ళమ్మకు చూపించి,

"మీ అల్లుడు గారమ్మా! తొందరలోనే పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాము" అని చెప్పింది.

నేను ఆమె కాళ్ళకు నమస్కరించాను.

ఆమె నన్ను లేపి కౌగలించుకుని, "నువ్వు దేవుడివి నాయనా!" అని కన్నీళ్ళు పెట్టుకుంది. అది చూసి శ్రావణి దుఃఖం ఆపుకోలేక పోయింది.

"లేదమ్మా! నేను సామాన్య మానవుణ్ణి. దేవుడితో పోల్చకండి" అన్నాను.

"కాదు నాయనా! దేవుడైన రాముడు కూడా ఆలిని, అగ్ని ప్రవేశం తర్వాతనే ఏలుకున్నాడు. నువ్వు అన్నీ తెలిసి కూడా దీన్ని అక్కున చేర్చుకున్నావు. మా దృష్టిలో దేవుడి కన్నా నువ్వే గొప్ప బాబూ!" అంది దణ్ణం పెడుతూ.

నేను ఆమె రెండు చేతులు పట్టుకుని,

"తప్పమ్మా! రాముడు పురుషోత్తముడమ్మా! సీతమ్మ గురించి అతనికి సర్వం తెలుసు. కానీ, రాముడు ఒక విశాల సామ్రాజ్యానికి ప్రభువు కూడా. తన దేశ ప్రజ మనసుల్లో సీతమ్మ మీద, ఎటువంటి అనుమానం కలగకూడదని ఆయన ఆడిన ఒక నాటకం. అంతే. తన సీతను ఎవరూ విమర్శించకూడదని తీసుకున్న జాగ్రత్త. సీత లేని ప్రతీ క్షణం రాముడు నరక బాధ అనుభవించాడు కదమ్మా?" అన్నాను.

"మా నాయనే! ఎంత చక్కగా చెప్పావు" అంటూ, వాళ్ళమ్మ మా ఇద్దరి భుజాల మీద చేతులు వేసి, అమ్మవారి గర్భగుడి వైపు తిరిగి,

"అమ్మా! భద్రకాళీ మాతా! నా జీవితం ధన్య మైంది. ఇన్ని రోజులూ నరకకూపంలాంటి జైల్లో అనుభవించని కష్టం లేదు. ఎందుకు బ్రతికున్నానా అని ప్రతీ క్షణం కుమిలి పోయాను. కేవలం నా బంగారు తల్లిని కళ్ళ నిండా చూసుకుంటే చాలను కుని ఇన్నేళ్ళు ఊపిరి నిలుపుకున్నాను. కానీ, నా కూతురికి దేవుడి లాంటి భర్తనిచ్చి నాకు చూపించ డానికే నన్ను బ్రతికించావని తెలిసింది తల్లీ! ఇక నేను నిశ్చింతంగా చచ్చిపోతాను" అంది.

శ్రావణి ముఖం మేఘావృతమైన ఆకాశంలా మారింది. ఒక సమయంలో శ్రావణి కూడా ప్రాణాలు వదలాలనుకుంది. తను లేకపోతే, వాళ్ళమ్మ కుంగి కృశించి మరణిస్తుందని ఆ ఆలోచన మానుకుంది. శ్రావణి జీవితంలో జరిగిన ఘోరాలు వాళ్ళమ్మకు తెలియదు. అన్ని వివరాలు తెలిసిన నేను నోరు విప్పను.

"అమ్మా! దైవ సన్నిధిలో అలా మాట్లాడకూడదు. మీరు మీ మనుమలు, మనుమరాళ్ళతో సరదాగా చాలా రోజులు గడపాలి" వాళ్ళను ఆ ట్రాజిక్ మూడ్ నుండి బయటపడేయాలని అన్నాను కొంటెగా, సిగ్గు పడుతున్న శ్రావణిని చూస్తూ.

***

బ్యాంకు ఋణం మంజూరు కాగానే, ఇల్లు శ్రావణి పేరు మీద రిజిస్టర్ చేయించాను.

వారం పది రోజుల్లోనే శ్రావణి వాళ్ళమ్మ గారు, మందులతో, మంచి ఆహారంతో, బాగా తేరుకు న్నారు. ముఖం తేటగా అయ్యింది. ఆమె ముఖంలో శ్రావణి పోలికలు కొట్టొచ్చినట్టుగా కనిపించాయి. శ్రావణీ, నేనూ కలిసి కొన్న భవంతి, నగలు, కారు చూసి సంతృప్తి పడింది. తను చేసిన త్యాగం వృథా కానందుకు, తనలాంటి చరిత్రహీనురాలి కడుపున పుట్టినా కూడా, కూతురు జీవితం నిలబడ్డందుకు సంతోషించింది.

గృహప్రవేశానికి అమ్మావాళ్ళే పీటల మీద కూర్చొని సత్యనారాయణ స్వామి వ్రతం చేశారు. మా అమ్మా, శ్రావణి వాళ్ళమ్మా బాగా కలిసిపో యారు. నేను అమ్మకు మనసులోనే ధన్యవాదాలు అర్పించాను. ఈనాటి చాలా మంది అభ్యుదయ వాదుల కన్నా మిన్నగా మా అమ్మ, నా కోసం ఉదారంగా ప్రవర్తించింది.

మేము గృహప్రవేశం చేసిన మరునాడే మారి షస్‌కు, యాడ్ షూట్ కోసం వెళ్ళవలసి రావడంతో, కొన్ని రోజులు తమతో పాటే ఉంటుందని శ్రావణి వాళ్ళమ్మను, మా అమ్మావాళ్ళు ఊరికి తీసుకుని వెళ్ళారు. ఆ ప్రపోజల్ మా ఇద్దరికీ నచ్చినా కొంచెం భయం కూడా వేసింది. నేను మా అమ్మకు, శ్రావణి వాళ్ళమ్మకు జాగ్రత్తలు చెప్పాము. ఇబ్బందికరమైన ప్రశ్నలు, పరిస్థితులు రావద్దని గట్టిగా చెప్పి బయ ల్దేరాము.

***

మారిషస్ 'అనహిత'లోని ఫోర్ సీజన్స్ రిసా ర్ట్స్‌లో మాకు బస ఏర్పాటు చేశారు. మేమిద్దరం వేర్వేరు రూములు కావాలని అడిగినప్పుడు కీర్తి లాల్ ఆశ్చర్యపోయాడు. రిసార్ట్సుకు ఓ సొంత ద్వీపమే ఉంది. ఆ ఐలాండ్, దాని చుట్టూ ఉన్న అద్భుతమైన సీనరీలు, రెస్టారెంట్లు, వారి సేవా భావం, సముద్రయానాలతో మారిషస్ పర్ఫెక్ట్ పిక్నిక్ స్పాట్‌గా అందుకే ప్రఖ్యాతి గాంచింది. ఆ రోజంతా లీజర్‌గా గడిపి విశ్రాంతి తీసుకున్నాము.




మరునాడు యాడ్ షూటింగ్ ప్రారంభమైంది. యాడ్ డైరెక్టర్ శ్రావణికి యాడ్ కాన్సెప్ట్ వివరి స్తుంటే, పక్కనే ఉన్న నేనూ విన్నాను.

మారిషస్ సంప్రదాయ దుస్తులైన 'సెగ' డ్రెస్సులో సముద్రపు ఒడ్డున స్లాంటింగ్ చెయిర్లో పడుకున్న శ్రావణి దగ్గరకు, సముద్రంలో ఈత కొడుతున్న హీరో వచ్చి ముత్యాల దండను అందించి, 'నీ కోసమే మారిషస్ సముద్ర గర్భం నుండి తీసుకొచ్చానని' ఇవ్వడం; దాన్ని మెడలో ధరించిన శ్రావణి 'దీనికంటే మా... జ్యుయలరీ షాపులోనే మంచి నగలు దొరుకుతాయి తెల్సా?' అంటుంది; 'అయితే చలో! మన పెళ్ళికి మిగిలిన నగలు అక్కడే కొందాం పద!' అని హీరో అంటాడు. అదీ వాళ్ళ కాన్సెప్ట్.

ఆ రోజంతా యాడ్ షూట్ చేశారు. రెండు రోజులు అనుకున్న షూటింగ్, శ్రావణి చకచకా డ్రెస్సులు మార్చుకోవడంతో, సింగిల్ టేక్‌లో షాట్ ఓకే కావడంతో, ఒక్క రోజులోనే పూర్తయింది. శ్రావణి యాక్టింగుతో యాడ్ డైరెక్టర్ పూర్తిగా శాటి స్ఫై అయ్యాడు. మారిషస్ ట్రెడిషనల్ దుస్తుల్లో, శ్రావణి కొత్త అందాలతో సాక్షాత్కరించింది. నేను ఎప్పుడూ చూడని కొత్త రూపం కళ్ళముందు మెరి సింది.

అయినా, అందరూ హ్యాపీగా ఉన్నా, నాకు మాత్రం సంతృప్తిగా లేదు. ఓ గంటసేపు ఆలో చించి, 'ఫైవ్ మినిట్స్ మాట్లాడాలని' కీర్తిలాల్‌కు ఫోన్ చేశాను. 'రండి సార్! డ్రింక్స్ లాంజ్‌లో మన వాళ్ళకు పార్టీ ఇస్తున్నాను. కం అండ్ జాయిన్ అజ్!' అన్నాడు.

నేను వెళ్ళేసరికి, క్యాబరే, డ్రగ్స్‌తో పార్టీ జోరుగా సాగుతోంది. అక్కడ ఏం మాట్లాడినా అతని తలకెక్కదని అర్థమైంది. అందుకే, కీర్తిలాల్ ఆఫర్‌ను సున్నితంగా తిరస్కరించి, బయట కొచ్చాను. కీర్తిలాల్ నాన్నగారున్న రూముకు వెళ్ళాను. 'ఫ్రీగా ఉంటే పది నిమిషాలు మాట్లాడా లని' అడిగాను. ఆయన కంగారుగా 'ఏమైంది సాబ్? ఎనీ ప్రాబ్లం?' అన్నాడు. నేను నవ్వుతూ 'అదేం లేదని' చెప్పి కూర్చున్నాను.

"చెప్పండి సార్!" అన్నాడు ఆయన కంగా రుగా.

"సార్! మీరు కంగారు పడకండి."

"యాడ్ షూటింగ్ అయిపోయిందా సార్?" అని ఆయనను అడిగాను.

"హవ్ సాబ్. మేడం గారి కోఆపరేషన్‌తో ఒక్క రోజులోనే అయిపోయింది సాబ్! ఎందుకు అలా అడుగుతున్నారు సాబ్?" అన్నాడు అనుమానంగా.

"మీకు నచ్చిందా?" అని ప్రశ్నించాను.

"హాఁ! మాదీ బేటాకు నచ్చింది. క్యాం సాబ్? మీకు నచ్చలేదా?" అని అడిగాడు.

నాకు నచ్చలేదని చెప్పాను.

**(ముగింపు వచ్చేవారం)**





# గూఢనారి నెంబర్ 1

**ఏదైనా విషయం జరిగిందనుకోండి, ఇంట్లో ఆడవాళ్లు ఏమయింది, ఎందుకైంది, ఎలా అయింది ఇలా అన్ని విషయాలూ కూపీలాగుతుంటారు. అందుకే అంటారు ఆడవాళ్లకి ఆరాలు తీసే మనస్తత్వం ఉందని. ఈవిషయమై మగమహారాజులు జోకులు కూడా వేసుకుంటారు. అయితే అది నవ్వాల్సిన విషయం కాదనీ, కామెంట్ చేయాల్సిన విషయం అంతకన్నా కాదనీ ఈ కథనం చదివాక మీరే తెలుసుకుంటారు. ఎందుకంటే ఈ ఆరాలు తీసే లక్షణమే ఆమెను డిటెక్టివ్‌గా మార్చింది మరి. అదే ఆమె వృత్తి అయింది, సెన్సేషనల్ లేడీ డిటెక్టివ్‌గా కితాబులు అందుకుంది. ఆమె ఎన్నో పురస్కారాలు, ప్రశంసలు సంపాదించుకునేలా చేసింది ఆ కూపీలాగే తత్వమే!**

**ఇంతకీ ఎవరామె? అనుకుంటున్నారా... అయితే తెలుసుకోండి మరి!**

మహిళలు గెలవని రంగమంటూ ఏమీలేదు. నేటికాలంలో పురుషులతో సమానంగా అన్ని రంగాల్లో మహిళలూ దూసుకెళుతున్నారు. ఆ కోవకు చెందిన మహిళే ముంబయికి చెందిన రజనీ పండిట్. ఇప్పుడు మనం చెప్పుకోబోయేది ఆమె గురించే. భారతదేశంలోనే మొట్టమొదటి మహిళా ప్రైవేట్ ఇన్వెస్టిగేటర్‌గా పేరు సాధించిన ఈ సూపర్ ఉమెన్ స్టోరీ ఏంటంటే....

### పుట్టింది..పెరిగింది

రజనీ పండిట్ పుట్టింది మహారాష్ట్ర. థానేజిల్లాలో ఉన్న పాల్‌ఘర్ ఆమె స్వస్థలం. తండ్రి శాంతారామ్ పండిట్. ఆయన ముంబై సిఐడి ఇన్‌స్పెక్టర్. ముంబైలోనే గ్రాడ్యుయేషన్ పూర్తిచేసింది రజనీ పండిట్. డిటెక్టివ్ కావాలంటే చదువుతో పనిలేదనీ, కావాల్సింది తెలివితేటలేననీ చెబుతోంది రజని.

### ఆసక్తి ఎలా వచ్చిందంటే?

సి.ఐ.డి ఇన్‌స్పెక్టర్ కావడంతో చిన్ననాటి నుండే తండ్రి ప్రభావం రజనీ మీద పడింది. తండ్రి విచారణ జరిపే కేసులను ఆసక్తిగా పరిశీలించేది. ఆయనను ప్రశ్నిస్తూ సందేహాలు తీర్చుకుంటూ ఎన్నో విషయాలు తెలుసుకునేది. కేసు విచారణా విధానం, ఎలాంటి అంశాలను పరిగణనలోకి తీసుకుంటారు లాంటి ప్రతి విషయాన్ని లోతుగా తెలుసుకోవడం అక్కడి నుంచే ఆమె ప్రారంభించింది. దాంతో ఎదిగే కొద్దీ ఆమెలో అవగాహన పెరుగుతూ వచ్చింది. కేసు దర్యాప్తు విధానాలు, వాటిని పరిష్కరించిన తీరు తెన్నులు వంటి విషయాలపై మరింతగా ఆసక్తి పెంపొందించుకుంది.

### డిటెక్టివ్‌గా మలిచిన సంఘటన

ఒక సంఘటన ఆమెను పూర్తిగా ఇన్వెస్టిగేటివ్ రూట్‌లోకి వెళ్ళేలా చేసింది. తన దారిని మార్చేసింది. గ్రాడ్యుయేషన్ పూర్తికాగానే మూడునెలలు వేరే ఉద్యోగం చేసింది రజనీ. ఆ తర్వాత ఐదంకెల జీతంతో వచ్చిన పెద్ద ఉద్యోగం కూడా వదులుకుని తన దారి ఇది కాదని తెలుసుకుని డిటెక్టివ్‌గా అవతరించింది. ఇంతకీ ఆ సంఘటన ఏమిటంటే, తన స్నేహితురాలికి వచ్చిన సమస్య!

రజనీ తనకున్న ఇన్వెస్టిగేటివ్ బ్రెయిన్‌తో కాలేజీలో తన స్నేహితురాలి సమస్యను పరిష్కరించింది. ఆమెను మంచి మార్గంలో పెట్టింది. చెడు మార్గం పట్టిన యువకులతో తన స్నేహితురాలు తిరుగుతూ ఉండేది. ఎంత చెప్పినా వినేది కాదు. ఈ విషయం ఆమె తల్లిదండ్రులతోచెప్పి ఆ అమ్మాయిని వారి నుంచి రక్షించాలనుకుంది. దాంతో ఒకసారి ఆ కాలేజి క్లర్క్ దగ్గరకు వెళ్ళి తన స్నేహితురాలికి ఒక గిఫ్ట్ పంపించాలనే మిషతో ఆమె అడ్రస్, ఇతర వివరాలు సంపాదించింది రజని. ఆమె ఇంటికివెళ్ళి తల్లిదండ్రులకు జరుగుతున్నదంతా చెప్పింది. వాళ్లు నమ్మలేదు. దాంతో తన సొంత డబ్బుతో టాయాక్సీలో తీసుకెళ్ళి మరీ ఆ అమ్మాయి ఎలా ప్రవర్తిస్తోందో తల్లిదండ్రులకు చూపించింది.

ఇలా ఆధారాలతో సహ అన్నీ పక్కాగా రుజువులు చూపిస్తున్న నీలో ఒక SPYకి ఉండాల్సిన లక్షణాలన్నీ ఉన్నాయని ప్రశంసించారు. స్పై అంటే గూఢచారి. అపరాధ పరిశోధకురాలన్నమాట. ఆ మాటే రజని మనసులో బలంగా నాటుకుపోయింది. ఆమె డిటెక్టివ్‌గా మారాలని అనుకుంది.

ఆ తర్వాత ఇలాంటిదే మరో మహిళ సమస్య ఆమెకు తారసపడింది. ముంబైలో ఉండే ఒక రిపోర్టర్ తన చెల్లెలికి మ్యాట్రిమోనియల్ సైట్లో ఓ సంబంధం చూసి పెళ్ళి చేద్దాం అనుకున్నాడు. కానీ ఆ రిపోర్టర్‌కి కాబోయే వరుడిపైన ఏదో సందేహం రావడంతో వచ్చి రజనీని సంప్రదించాడు. ఆమె వారికి తెలియకుండా వరుడి వివరాలన్నీ కూపీ లాగింది. ఆ వరుడి వేషగాడికి అప్పటికే పెళ్ళయిందనీ, ఇద్దరు పిల్లలు కూడా ఉన్నారనీ తేలింది. దాంతో ఆ రిపోర్టర్ తన పత్రికలో ఈ కేసు దర్యాప్తు వివరాలు, ఆ మ్యాట్రిమోనియల్ వెబ్‌సైట్ గురించి, తన పత్రికలో రాస్తూ రజనీ చేసిన డిటెక్షన్ గురించి కూడా రాశాడు. దేశంలో ఆ వార్త సంచలనం సృష్టించింది. అలా ఆమె ప్రతిభ వెలుగులోకి వచ్చింది.

ఇలా తన తెలివితేటలతో ప్రధానంగా రెండు సమస్యలు పరిష్కరించిన తర్వాత ఫుల్‌టైమ్ డిటెక్టివ్‌గా మారిపోవాలని బలంగా నిర్ణయించుకున్నారు రజని. అందుకోసం రెజ్యూమ్‌తో డిటెక్టివ్ ఏజెన్సీస్

చుట్టూ తిరిగింది. ఈమెకెంత చదువు, చలాకీదనం ఉన్నా, స్త్రీ సహజసిద్ధమైన అబల అనే ఒకే ఒక్క మాట కారణంగా ఎవరూ ఆమెను డిటెక్టివ్‌గా తీసుకోలేదు. ఏ చిన్న పొరపాటు జరిగినా తమ ఏజెన్సీ పరువు ప్రతిష్టలు పోతాయని వారు భావించారు.

## డిటెక్టివ్ ఏజెన్సీ

ముంబైలోని శివాజీ పార్క్ దగ్గరలోనే ఉంది 'రజనీ పండిట్ ప్రైవేట్ డిటెక్టివ్' ఆఫీసు. ఎంతో క్లిష్టమైన కేసులకు సైతం అతి తక్కువ ఫీజు తీసుకుంటారు రజని. అందుకే డిటెక్టివ్‌గానే కాక మంచి మనిషిగా కూడా రజనీకి పేరుంది. 1991లో తన ఇంట్లోనే ఒక చిన్న గదిలో 'రజనీ పండిట్ డిటెక్టివ్ ఏజెన్సీ' ప్రారంభించింది. అప్పటికి రజనీ వయసు కేవలం 25 సంవత్సరాలు. మొదటిసారి ఈ రంగంలోకి అడుగుపెట్టిన తర్వాత చాలా సవాళ్లనే ఎదుర్కోవాల్సి వచ్చిందని చెబుతోంది రజని. అంతేందుకు, తండ్రి కూడా మొదట ఆమె డిటెక్టివ్ వృత్తిని ఎంచుకోవడానికి ఒప్పుకోలేదు. కానీ తల్లి సపోర్ట్‌తో చిన్న గదిలో తనింటి నుంచే కెరీర్ ప్రారంభించింది. ఎన్ని కష్టాలొచ్చినా లెక్కచేయకుండా తనకు ఇష్టమైన గూఢచర్యం వృత్తిలో విజయాలు సాధించి, కొన్ని కేసుల్లో పోలీసులే తనపై ఆధారపడేలా చేసుకుంది. పాతికేళ్ళ సర్వీసులో ఏకంగా 75,000 పైగా కేసుల్ని ఛేదించింది. ఆ కేసులన్నీ విజయవంతం అయ్యాయి.

ప్రస్తుతం రజని ఏజెన్సీలో 20 మంది సభ్యులు ఉన్నారు. ఇండియాలోనే కాదు వేర్వేరు దేశాల్లోనూ ఈ డిటెక్టివ్‌కు క్లయింట్స్ ఉన్నారు. 'జాగ్రత్తగా గమనిస్తే మనచుట్టూ, తెలిసినవారి ఇళ్ళల్లో ఎన్నో సమస్యలు, మిస్టరీలు కనిపిస్తాయి. అందరూ ఆ సమస్యల్ని తమంతట తాము పరిష్కరించుకోలేరు. సాక్ష్యాలు సేకరించలేరు, నేరం నిరూపించలేరు. ఇలాంటప్పుడే వాళ్లకి ఇన్వెస్టిగేటర్ సహాయం అవసరమవుతుంది. ఆ పని మేము ఇట్టే చేసిపెడతామని అంటారు రజని.

## డిటెక్టివ్‌గా ఎన్నెన్నో అవతారాలు!

రహస్యాలు ఛేదించేందుకు రజని రకరకాల అవతారాలెత్తింది. ఎన్నో కష్టాలు ఎదుర్కొంది. తన ఐడెంటిటీని కాపాడుకుంటూనే నేరస్థులెవరో కనిపెట్టి దోషులను చట్టానికి అప్పగించింది. ఓ హత్య కేసులో నిందితులను బయటపెట్టడం కోసం పని మనిషిగా మారిపోయింది. నేరస్థుల ఇంట్లో ఆరు నెలలు మకాం వేసింది. ఒక మహిళ మరోవ్యక్తితో అక్రమ సంబంధం పెట్టుకుని భర్తను కడతేర్చిందని పోలీసులు నిర్ధారించారు. అసలు దోషి ఆమె ప్రియుడే అయి ఉంటాడని పోలీసుల అనుమానం. కానీ అతనేమో పోలీసుల కంట పడకుండా తిరుగుతున్నాడు. అప్పుడే పోలీసులకు రజని గుర్తొచ్చింది. వెంటనే ఆమెని ఆశ్రయించారు. రాత్రివేళ మాత్రమే ఆ ఇంటికొచ్చి వెళ్లే హంతకుణ్ణి పట్టుకోవాలంటే ఆ ఇంట్లో తిష్ట వేయాలి. ఇందుకోసం రజని ఆ ఇంటి పనిమనిషిని మచ్చిక చేసుకుని సర్వెంట్ రూపంలో ఆ ఇంట్లో పాగా వేసింది. ఆరునెలలు నమ్మకంగా మసులుకుంది. ఊహించినట్టే ఓ రోజు హంతకుడు ఆ ఇంటికొచ్చి ప్రియురాలితో వాదనకు దిగాడు. ఇదంతా వంటగదిలో ఉండి వింటున్న రజని చురుగ్గా ఆలోచించి కత్తితో గాయం చేసుకుంది. ఆమె అరుపు విని ఆ ఇంటి యజమాని, ఆమె ప్రియుడు తనను ఆస్పత్రికి వెళ్ళిరమ్మని చెప్పారు. గాయం సాకుతో తెలివిగా ఇంటి నుంచి బయటపడ్డ రజని నేరుగా వెళ్ళి పోలీసులకు సమాచారం అందించి, ఆరు నెలలుగా దొరకని ఆ హంతకుడిని పట్టించింది.

## కౌన్సెలింగ్ కూడా ఇస్తారు

అలాగే మరొక కేసును కూడా విజయవంతంగా పరిష్కరించింది రజని. 72 సంవత్సరాల బామ్మ ఫేస్‌బుక్‌లో పరిచయమైన ఒక విదేశీయుడి ఆకర్షణలో పడింది. దాంతో వారిద్దరూ ఆన్‌లైన్‌లో రోజూ చాటింగ్ చేసుకున్నారు. ఖరీదైన బహుమతులను ఆ విదేశీయుడికి పంపించింది ఆ బామ్మ. కుటుంబ సభ్యులకు అనుమానం వచ్చింది. వెంటనే వారు రజనీని ఆశ్రయించారు. రజని తన టీమ్‌తో కలిసి ఆ అబ్బాయి వివరాలు సేకరించి, బామ్మకు అర్థమయ్యేలా అన్ని విషయాలు వివరించి చెప్పారు. ఈ సంఘటనతో తను చెప్పేదొక్కటే ఆన్‌లైన్లో అపరిచిత వ్యక్తులతో మన ఎమోషన్స్ షేర్ చేసుకోవద్దని. కేసు అంతు తేల్చడం కోసం రజని రకరకాల వేషాల్లోకి మారిపోయేవారు. అంధురాలిగా, గర్భిణిగా, తోపుడుబండి వ్యాపారిగా.. ఇలా! భార్యాభర్తల అనుమానం కేసులు ఎక్కువగా వచ్చేవి. అలాగే అక్రమ సంబంధాల కేసులు, పెళ్ళి సంబంధాల కోసం వధూవరుల వివరాలు ఆరాతీసే కేసులు. కొన్ని సందర్భాల్లో రజని క్లయింట్లకు ధైర్యం చెప్పేవారు. వాళ్లకు అండగా ఉండేవారు. స్ఫూర్తినిచ్చేవారు. ప్రేరణ కలిగించేవారు. అలా సోషల్ సర్వీస్ కూడా తన వృత్తిలో భాగంగా చేసుకున్నారు రజని. అందుకే ఆమె ఎంతో పేరు సంపాదించుకున్నారుగానీ, డబ్బు మాత్రం సంపాదించుకోలేకపోయారు ఈ భారత దేశపు తొలి మహిళా డిటెక్టివ్.

## టెక్నాలజీ సహాయం

టెక్నాలజీని అందిపుచ్చుకున్నారు డిటెక్టివ్ రజని. స్పై కెమెరాలు, రికార్డర్ల సాయంతో నేరస్థులను ఇట్టే పట్టేస్తున్నామని అంటున్నారామె. 'మహిళలు ఏం చేయాలనుకుంటే అది చేయాలి. అది ఎలాంటి పనైనా సిగ్గుపడకూడదు. ఆత్మవిశ్వాసం, ధైర్యం, మొండితనం.. ఈ మూడు లక్షణాలు మనం ఎంతో ఎత్తుకు ఎదిగేందుకు తోడ్పడతాయని అంటున్న ఈ లేడీ డిటెక్టివ్‌కు హాట్సాఫ్ చెప్పేద్దాం.

– సంతోషలక్ష్మి దహగాం

## అవార్డులు

*రజని తన అనుభవాలతో 'ఫేసెస్ బిహైండ్ ఫేసెస్', 'మాయాజాల్' అనే పుస్తకాలు రాశారు. మొదటి పుస్తకానికి రెండు అవార్డులు వచ్చాయి. రెండో పుస్తకానికి ఆరు అవార్డులు వచ్చాయి! తన పనితనం గురించి తెలుసుకోవాలంటే ఆవిడ పుస్తకాలు చదివితే సరి! ఇవి కాక కెరీర్ మొత్తం మీద ఆమె 54 అవార్డులు సాధించారు. ఆస్ట్రేలియాకు చెందిన ఓ టీవీ ఛానల్ ఆమెపై డాక్యుమెంటరీ కూడా తీసింది. ప్రస్తుతం విదేశాలకు సంబంధించిన అపరాధ పరిశోధన కూడా చేస్తున్నారు రజని.*

## దేని గురించీ భయపడదు

ఆమె ఓ సాహస కెరటం. "ఆత్మవిశ్వాసం, ధైర్యం, దృఢచిత్తం ఉంటే అమ్మాయిలు ఎంతటి పురుషాధిక్య రంగంలోనైనా రాణిస్తారు. తామేమిటో నిరూపిస్తారు. నేనెప్పుడూ దేనికీ భయపడను. చావే కదా మన అల్టిమేట్ భయం. అది ఏదో ఒక రూపంలో వచ్చి మనల్ని తీసుకెళుతుంది. ఊరికే కూర్చుని ఉన్నాగానీ పైనుంచి సీలింగ్ విరిగిపడి చనిపోవచ్చు. ఇక భయపడడానికి ఏముంది? 'ఆన్ డ్యూటీ'లో చనిపోవడం ఒక గొప్ప గౌరవం" అంటుంది రజని.



# మూడోపాదం

**-సలీం**

**ఉదయం నుంచీ మెసేజ్‌ల ద్వారా, మరికొంతమంది నేరుగా ఫోన్‌చేసి అభినందనలు తెలుపుతున్నారు. పోటీలో బహుమతి వచ్చిన నా కథ ఓ ప్రముఖ వారపత్రికలో ప్రచురించ బడింది. అందులో నా పరిచయం, ఫోటోతోపాటు మొబైల్‌నంబర్ కూడా ఇవ్వడంవల్ల కథ బావుందని చాలామంది ప్రశంసలతో ముంచెత్తుతున్నారు.**

ఏ రచయితకైనా విస్కీకన్నా మత్తు కలిగించే మధువు ప్రశంస కాక మరేముంటుంది? కథ చదివిన తోటి యూనివర్సిటీ విద్యార్థులూ, లెక్చరర్లు కూడా అభినందనలు తెలిపారు. ఆ రోజు రాత్రి పడుకోబోయే ముందు నా వాట్సప్‌కి ఓ మెసేజ్ వచ్చింది. "మీ కథ హృదయాన్ని కదిలించింది. నేను మీ అభిమానిని. ఇప్పటివరకూ పత్రికల్లో వచ్చిన మీ ప్రతి కథా చదివాను. ఇంత చిన్నవయసులో అంతటి పరిణతితో కథలు రాయటం మీకెలా సాధ్యపడింది? నాకైతే మీ చేతుల్ని కళ్ళకు అద్దుకోవాలని ఉంది. మీ వేళ్ళు ముద్దుపెట్టుకోవాలని ఉంది" మెసేజ్ కింద పేరు లేదు.

ఆడో మగో అర్థం కాలేదు. ఎంత వయసో ఏ ఊరో తెలియటం లేదు. ఓ క్షణం ఆ నంబర్‌కి ఫోన్ చేసి థాంక్స్ చెప్పాలనుకున్నా. మళ్ళా మనసు మార్చుకుని "ధన్యవాదాలు" అని మెసేజ్ పెట్టాను. మరునాడు ఉదయం లేవగానే మొబైల్‌చూస్తే వాట్సప్‌లో అదే నంబర్ నుంచి మరో మెసేజ్ ఉంది.

"మీ నుంచి మెసేజ్ వస్తుందని ఊహించలేదు తెలుసా.. మీ వంటి గొప్పరచయిత నాలాంటి సామాన్యురాలి అభినందన పట్టించుకోవాల్సిన అవసరమేలేదు. అది మీ సహృదయతకు నిదర్శనం. నాకు అత్యంత ఇష్టమైన రచయిత ఇచ్చిన ఆటోగ్రాఫ్ కదా. గుండెల్లో పదిలంగా దాచుకుంటాను. రోజూ ఉదయం లేవగానే నేను చేసే మొదటి పనేంటో తెలుసా? మీ అందమైన మొహాన్నిచూడటం... మీ ఫొటోల్ని పత్రికల్లోంచి కత్తిరించి పటం కట్టించి నా దిండుకింద పెట్టుకున్నాలెండి. మరో విషయం మా ఇంట్లో దేవుళ్ళ పటాలుండవు".

అంతటి అభిమానాన్ని తట్టుకోవడం కష్టమైంది. నన్ను దేవుడిలా ఆరాధిస్తున్న విషయం ఎంత సున్నితంగా చెప్పిందో! "మీ అభిమానం అపురూపం. నాకంత అర్హత లేదనే అనుకుంటున్నా. గత నాలుగైదేళ్ళ నుంచే కథలు రాస్తున్న సాహితీ విద్యార్థిని. ఎందరో మహామహులకు జన్మనిచ్చిన తెలుగు నేల.... నేనెంత? ఇంతకూ మీ పేరు చెప్పలేదు. ఏం చేస్తుంటారు? ఏ ఊరు? మీ గురించి తెలియబర్చండి. కుతూహలంగా ఉంది" అంటూ మెసేజ్ ఇచ్చాను.

వెంటనే సమాధానం రాలేదు. క్లాసులో పాఠాలు వింటున్నప్పుడు కూడా మధ్యమధ్యలో వాట్సప్ తెరిచి చూశాను. తను ఆన్‌లైన్లోకి వచ్చి వెళ్తోన్న సమాచారంతప్ప నేనడిగిన వాటికి జవాబు మాత్రం రాలేదు.

వయసులో పెద్దావిడయి ఉంటుందా? పెళ్ళై పిల్లలున్న ప్రౌఢ స్త్రీనా? కొద్దిగా రెచ్చగొట్టడం వల్ల ప్రయోజనం ఉంటుందేమోననిపించి "మీ గురించి చెప్పడానికి ఏమైనా అభ్యంతరాలుంటే ఇబ్బంది పడకండి" అని సాయంత్రం మెసేజ్ ఇచ్చాను.

మరో అరగంటకి సమాధానం వచ్చింది. "నా పేరు వర్ష. నా గురించి చెప్పుకోడానికి పెద్దగా ఏమీ లేదు. నాన్న లేడు. అమ్మ పేరు సీత. నేను ఇంటర్ చదివి కంప్యూటర్ కోర్సులో డిప్లొమా చేశాను. చిన్న ఉద్యోగం. అమ్మకూడా గ్రానైట్ కంపెనీలో పని చేస్తుంది. నాకు చిన్నప్పటి నుంచీ సాహిత్యమంటే ఇష్టం. ఇప్పుడు మీ కథలంటే పిచ్చి. ఎంత పిచ్చంటే మీరు రాసే ప్రతి పదాన్ని పెదవుల్తో అద్దాలన్నంత".

నన్నో మోహప్రపంచంలోకి మత్తుగా లాక్కెళ్ళే మెసేజ్‌లు ఇవ్వటం వర్షకే సాధ్యమనుకుంటాను. నాకు తెలియకుండానే తనవైపు బలంగా ఆకర్షించబడ్డాను. నేనంటే తనకు ఎంతటి ఆరాధనో... రోజూ నా నుంచి శుభోదయం శుభరాత్రి అని మెసేజ్‌లు రాకపోతే తనకు తెల్లారదట. నిద్ర పట్టదట. వాట్సప్‌లో ఫోటో పంపించింది. ఎంతబావుందో... నాజూగ్గా... సన్నజాజి తీగలా... ఎంతందమైన కళ్ళో... వాటిని చూస్తూ మొదటిసారి కవిత్వం రాశాను. ఆ నవ్వేమిటో... అప్సరసల దరహాసంలా సమ్మోహనంగా...

ఇక ఆగలేక తన నంబర్‌కు ఫోన్‌చేశాను. బదులివ్వలేదు. నాలుగైదు సార్లు ప్రయత్నించి కోపంతో మెసేజ్ చేశాను. "నన్ను ప్రాణం కన్నా మిన్నగా ప్రేమించే అమ్మాయి గొంతు వినాలని నాకుండదా? ప్లీజ్.. ఒక్కసారి మాట్లాడు".

"వద్దు. మనం మాట్లాడుకోవద్దు. ఇలానే మెసేజ్‌లు చేసుకుందాం. నన్ను బలవంతపెట్టి బాధపెట్టకండి" అని జవాబొచ్చింది.

అప్పటికి మా పరిచయమై నాలుగు నెలలు. ఎందుకు మాట్లాడనంటోంది? తనున్నంత అందంగా తన గొంతు ఉండదా? "నీ గొంతు ఎలా ఉన్నా నాకిష్టమే. అందరి గొంతులూ జానకిగారి గొంతులా శ్రావ్యంగా ఉండాలని లేదుగా. ఎన్నాళ్ళిలా మెసేజ్‌లతో సంభాషించుకోవటం... మనసువిప్పి మాట్లాడుకోవాలని ఉండదా.. ఈరోజు శ్రావణ పూర్ణిమ. నీక్కూడా వెన్నెలంటే ఇష్టమనీ, అర్ధరాత్రి వరకు పడుకోకుండా వెన్నెలని ఆస్వాదిస్తూ ఉంటావనీ రాశావు, గుర్తుందా? నేనీ రోజు అర్ధరాత్రి వరకు నిద్రపోకుండా నీ ఫోన్ కోసం ఎదురుచూస్తుంటా" అని రాశాను.

రాత్రి పదిన్నరకు మెసేజ్ వచ్చింది. "నేను చాలా దురదృష్టవంతురాల్ని. ఏడాది క్రితం ఈ బతుకు



మీద రోతపుట్టి ఆత్మహత్య చేసుకుందామనుకున్నా. నా ప్రయత్నం ఫలించ లేదు. కానీ మీ పరిచయభాగ్యం తర్వాత నాకు జీవితం మీద ఆశ పుట్టింది. బతకాలనే కోరిక బలపడింది. మీ ప్రేమచాలు, ఎన్ని కష్టాలెదురైనా వాటిని సంతోషంగా ఎదుర్కొని బతికేస్తాను. మీరిచ్చిన ఈ వరాన్ని నాకు దూరం చేయకండి. మనిద్దరం మాట్లాడుకోవద్దు. మెసేజ్‌లున్నాయిగా చాలదూ... మొబైల్ ఫోన్లు, వాట్సప్‌లు కనిపెట్టిన వాళ్ళెవరోగానీ, వాళ్ళ పాదాల్ని నా కన్నీళ్ళతో కడగాలని ఉంది."

నాలో మొలకెత్తుతూ ఓ అనుమానం. తను మూగదా? అంతే అయి ఉంటుంది. లేకపోతే మాట్లాడటానికి ఎందుకు నిరాకరిస్తుంది? కానీ తనంటే నాకు అనంతమైన ఇష్టం. తనెలా ఉన్నా పర్లేదు. నా ప్రేమలో మాత్రం మార్పు రాదు. అదే విషయం తనకు రాశాను.

"మీలాంటి మంచి వ్యక్తితో అనుబంధం పెనవేసుకోవటం నా అదృష్టం. ఏ జన్మలోనో దేవుణ్ణి తూలనాడి ఉంటాను. శాపగ్రస్తురాలినైనాను. మరేదో జన్మలో బంగారుపూలతో పూజచేసి ఉంటాను. మీ ప్రేమను పొందాను. ఈ జన్మకీ తృప్తిచాలు. ప్రేమలోని మాధుర్యాన్నంతా మనసారా రుచి చూపిస్తున్నారు. మీ రుణం ఎప్పటికీ తీర్చుకోలేని అభాగ్యురాలిని. మన్నించండి" అని రాసింది.

"ఆ శాపమేమిటి? నువ్వెందుకు అభాగ్యురాలిననుకుంటున్నావు? నాకు చెప్పవా?" అని ఎన్నిసార్లు అడిగి ఉంటానో! ప్రతిసారీ ఒకటే సమాధానం. "దయచేసి ఆ విషయం మాత్రం అడక్కండి. నేను చెప్పలేను" అని.

వర్ష పరిచయమై ఏడాది పూర్తి కావస్తోంది. తనకోసం రాసిన కవితలన్నీ ఓ పుస్తకంగా తీసుకురావాలన్న ఆలోచన. దానికి ముందు అవన్నీ వర్ష చదివి ఆనందించాలన్న కోరిక. అడ్రస్ అడిగాను. మొదట భయపడ్డాను, ఇవ్వడానికి నిరాకరిస్తుందేమోనని. తనుండేది మార్కాపూర్ అని తెలుసుగానీ పూర్తి చిరునామా తెలియదు.

ఆశ్చర్యంగా తన చిరునామా తెలుపుతూ మెసేజ్ పంపింది. కవితలన్నీ జిరాక్స్ చేయించి, స్పైరల్ బైండ్ చేయించి వర్ష అడ్రస్‌కి పార్సెల్ చేశాను. వారం తిరక్కుండానే నా కవితల మీద చక్కటి సమీక్ష చేస్తూ మెసేజ్ పంపింది. సాహిత్యంమీద తనకెంత అవగాహన ఉందో ఆ కవితల్ని విశ్లేషించిన విధానం చూస్తేనే అర్థమవుతుంది. తన కథల్ని చదివి, కవితల్ని అర్థం చేసుకుని ప్రతిస్పందించే సహచరి ఉండటం కన్నా అదృష్టం ఏ రచయితకైనా ఏం ఉంటుంది?

నాకు వర్షను చూడాలన్న బలమైన కోరిక. ఇంకొన్ని రోజుల్లో ఎం.ఏ చదువు పూర్తవుతుంది. ఏదో ఒక ఉద్యోగం తెచ్చుకుని వర్షను పెళ్ళి చేసుకుని, కథలూ కవితలూ రాసుకుంటూ... తనకు చదివి వినిపిస్తూ... తన విశ్లేషణ విని ముచ్చటపడుతూ.. ఎంతందమైన జీవితమో కదా.

"ఈ వారాంతంలో నాలుగు రోజులు సెలవులు ఉన్నాయి. నేను మార్కాపూర్ రావచ్చా? మనం ఓసారి కలుద్దాం వర్షా. నువ్వేదో ఆత్మన్యూనతతో హింసపడ్తున్నావనిపిస్తోంది. నా సామీప్యంలో దాన్ని తప్పకుండా అధిగమిస్తావన్న నమ్మకం నాకుంది" అని రాశాను.

వెంటవెంటనే చాలా మెసేజ్‌లు వచ్చాయి. "మీరు నా సామీప్యంలో లేరని ఎవరన్నారు? మీరు నా దగ్గరే ఉన్నారు. నాతోనే ఉన్నారు. రాత్రంతా నా నడుంచుట్టూ చేయివేసి కదా పడుకున్నారు. ఉదయం నేను నిద్రలేచే సమయానికి ఎంత గాఢనిద్రలో ఉన్నారో.. మీకు నిద్రా భంగం కలక్కూడదని మెల్లగా మీ చేతిని విడిపించుకుని పనులు చేసుకుంటున్నాను తెలుసా?

'ఎంతందమైన ఊహ అనుకుంటున్నారు కదూ శశీ. మీరు నా యెడల చూపిన ఆత్మీయత, అనురాగం... నేను నా చుట్టూ ఓ స్వర్గాన్ని నిర్మించుకున్నాను. దయచేసి దీన్ని పగులకొట్టకండి. నేను కంటున్న అద్భుతమైన కలని భగ్నం చేయకండి. మనం ఎప్పటికీ కలవకూడదు. నాకిలానే బావుంది. నన్నిలానే బతకనీయండి. ప్రేమకు మనసులేగా ముఖ్యం. మనది అమలిన ప్రేమ... అజరామరమైన ప్రేమ... శరీరాలతో సంబంధంలేని ప్రేమ. మిమ్మల్ని కన్నీళ్ళతో వేడుకుంటున్నా, మీరు రాకండి".

"ప్రేమకు పరాకాష్ఠ పెళ్ళి కదా వర్షా, మనం పెళ్ళి చేసుకుందాం" అని రాశాను.

"నాకంత అదృష్టం లేదు" అని రాసింది.



ఎందుకు లేదు? ఆమెకున్న సమస్య ఏమిటి? శారీరక వైకల్యం ఏమైనా ఉందా? లేక మానసికంగా కుంగుబాటులో ఉండి అలా మాట్లాడుతోందా?

పరీక్షలైపోయాక వర్షకు చెప్పకుండా మార్కాపూర్ వెళ్ళి తనని కలుసుకోవాలని నిర్ణయించుకున్నాను.

***

"టైం ఎంతయిందో తెలుసా? తొమ్మిదిన్నర. అన్నం ఎప్పుడు తింటావు? ఎప్పుడు పడుకుంటావు? ఎప్పుడు చూసినా ఆ ఫోన్లో తలదూర్చి మెసేజ్‌లు చదువుకుని మురిసిపోవటంతప్ప చుట్టుపక్కల ఏం జరుగుతోందన్న ధ్యాసేమైనా ఉందా? వండిన పదార్థాలన్నీ చల్లబడిపోయి ఉంటాయి. అన్నం తిందాం రా వర్షా" నావైపు మురిపెంగా చూస్తూ అంది సీత.

నన్ను అమ్మలా ఆదరించిన మహాతల్లి సీత. తనని అమ్మా అని పిలవటమే అలవాటు. "అయ్యో నువ్వింకా తిన్లేదా? నాకు ఆకలిగా లేదమ్మా. నువ్వు తినేయ్" అన్నాను వాట్సప్‌లో మెసేజ్ టైప్ చేస్తూ.

"ఎందుకుంటుందీ? ఏడాదిపైగా ఆ మెసేజ్‌లు తిని తాగి బతుకుతున్నావుగా. ఎలా చిక్కిపోతున్నావో తెలుసా?"

"నా మొహం ఎలా వెలిగిపోతుందో చూశావా అమ్మా? అంతా ప్రేమ మహత్యం. అసలెప్పటికైనా ఈ ప్రేమను పొందగలనా? అని ఎలా పరితపించానో. నా జీవితం ధన్యమైంది. ఈ ప్రేమ నా స్వంతమైంది. ఇక ఏం ఉన్నా లేకున్నా పర్లేదు, సంతోషంగా బతగ్గలను".

"సర్లె. నువ్వు తినకుండా నేనెప్పుడైనా ఒక్కదాన్నే కూచుని తిన్నానా? రా వర్షా... నాకు ఆకలేస్తోంది" అంది సీత.

మేమిద్దరం మార్కాపూర్ వచ్చాక తను తినకుండా నాకు పెట్టి పస్తులు పడుకున్న రోజులు గుర్తొచ్చాయి. ఈ అమ్మే లేకపోతే నా బతుకేమైపోయేదో? తల్చుకుంటేనే భయమేస్తుంది. ఫోన్ పక్కనపెట్టి అమ్మ మెడచుట్టూ చేతులేసి "అందరూ నన్ను ఛీదరించుకున్న రోజుల్లో పిడికెడు ప్రేమ కోసం గుప్పెడు ఆత్మీయతకోసం అలమటించానమ్మా. నువ్వు ఆదుకుని అమ్మ ప్రేమను దోసిళ్ళ కొద్దీ అందించావు. ఇప్పుడు శశికాంత్ ప్రేమలో తడిసి ముద్దయిపోతున్నా. ఈ క్షణం చావొచ్చినా తృప్తిగా చనిపోతానమ్మా" అన్నా.

"చాల్లే పాడు మాటలు" అంటూ సీత కసురుకుంది.

అన్నం తిన్నాక తను పడుకుంది కానీ నాకు నిద్ర పట్టలేదు. ఏవేవో జ్ఞాపకాలు. నా చిన్ని జీవితంలో ఎన్నెన్ని మలుపులో...

నాకు ముగ్గురన్నలు... ఇద్దరక్కలు.. నేను ఆరోదాన్ని. కాదు కాదు. ఆరో వాణ్ణి. నా పేరు హర్ష. నాన్న మోతుబరి. దాదాపు పాతికెకరాల వ్యవసాయ భూమి. లంకంత ఇల్లు.. నాన్న ఊరికి సర్పంచ్ కూడా కాబట్టి దర్జాకి, గౌరవానికి లోటు లేని జీవితం.

చిన్నప్పటినుంచీ నాకు ఆడపిల్లలా సింగారించుకోవాలని ఉండేది. అక్కలు వాడిన పాత గౌన్లు వేసుకుని అద్దంముందు కూచుని మొహానికి పౌడరు, నుదుట తిలకం దిద్దుకుని అమ్మకు చూపిస్తే ఎందుకు తిట్టేదో అర్థమయ్యేది కాదు. అక్కలతోపాటే వాళ్ళ గదిలో నిద్రపోయే వాడిని. అందరికంటే చిన్నవాడిని కాబట్టి అక్కలు బాగా

**అతడో గొప్ప రచయిత. బహుమతి పొందిన ఆ రచయితకు ఆ రోజు ఎంతోమంది మెసేజ్‌లు, ఫోన్ల ద్వారా అభినందనలు తెలియజేశారు. కానీ వర్ష నుండి వచ్చిన మెసేజ్ మాత్రం చాలా చాలా ప్రత్యేకం. ఆ మెసేజ్ అతడి హృదయాన్ని కొల్లగొట్టింది. వాట్సప్‌లో ఏడాదికాలం ప్రేమించుకున్నారు. కానీ కలుసుకునేందుకు మాత్రం ఆమె ససేమిరా ఒప్పుకోలేదు. ఎందుకని? ఇంతకీ ఆమె ఎవరు? ఎందుకలా?**

ముద్దు చేసేవారు. వాళ్ళు బట్టలు వేసుకుంటే 'ఆ కళ్ళు తిప్పడం, మాటల్లో వయ్యారం.. అచ్చం ఆడపిల్లలా ఉన్నావురా' అంటూ వాళ్ళే దగ్గరుండి నన్ను ఆడపిల్లలా సింగారించి, ముసిముసిగా నవ్వుకునే వాళ్ళు.

'వీణ్ణి మన అమ్మాయిల గదిలోకి వెళ్ళకుండా కట్టడిచెయ్. ఆడంగి లక్షణాలు అలవాటు చేసుకుంటున్నాడు' అని నాన్న ఓసారి అమ్మను హెచ్చరించాడు.

అప్పటినుండి అన్నల గదిలోనే నివాసం. జైల్లో బంధించినట్లుండేది. ఆరో తరగతి కొచ్చాక సాటి విద్యార్థులు ఏడిపించడం మొదలైంది. నా నడకలో వయ్యారం చూసి 'అరే వీడు పాయింట్ ఫైలా ఉన్నాడురా' అని నా మొహం మీదే అనేవారు. నాకు బాధ వేయాల్సింది పోయి అదేదో పొగడ్తలా సంబరపడేవాడిని.

ఎవ్వరూ చూడకుండా కళ్ళకు కాటుక పెట్టుకుని, పెదాలకు లిప్‌స్టిక్ రాసుకుని అద్దంలో చూసుకుని మురిసిపోయేవాణ్ణి.

ఎనిమిదో తరగతికొచ్చాక నాలోని ఆడలక్షణాలు ప్రస్ఫుటంగా బైట పడసాగాయి. అమ్మాయిలకంటే కూడా అబ్బాయిలు ఆకర్షణీయంగా కనిపించేవాళ్ళు. వాళ్ళను తాకాలని, కౌగిలించుకోవాలని అనిపించేది.

నా వల్ల వాళ్ళకు తలవంపులుగా ఉందని అన్నలు నాన్నదగ్గర చెప్పుకోవటం ఎక్కువైంది. నన్ను పురుగుని చూసినట్టు అసహ్యించుకునేవాళ్ళు. నా పద్ధతులు మార్చుకోమని కోపగించుకునే వాళ్ళు. అక్కలు మాత్రం నన్ను చూసి బాధపడే వాళ్ళు.

లోకుల అపహాస్యం తట్టుకోలేక నాన్న కూడా ఛీదరించుకునేవాడు. 'వీడు నాకు పుట్టకుండా ఉన్నా బాగుండేది. వీడికి చావొచ్చినా బావుండేది. బతికి మనల్ని చంపుతున్నాడు. అంతా మన ఖర్మ' అని అమ్మతో చెప్పుకుని బాధపడేవాడు.

నాకో విషయం స్పష్టంగా అర్థమైంది. నా



## ఆమెను పట్టించుకోవడం లేదట!

టాలీవుడ్ అంటే చిన్నచూపున్న హీరోయిన్లు దక్షిణాదిలో దాదాపు ఎవరూ లేరు. ఒకే ఒక్క హీరోయిన్ నయనతార మాత్రం కోలీవుడ్‌ని చూసుకొని టాలీవుడ్‌ని అస్సలు పట్టించుకోలేదు. అప్పుడు ఏ భాషనయితే వద్దనుకుందో ఇప్పుడు తిరిగి అదే భాషలోకి రావలసిన పరిస్థితి వచ్చింది! ఇంతకీ అసలు సంగతి ఏమిటంటే నయనతారకు టాలీవుడ్‌లో సీనియర్ హీరోలు తప్ప కుర్ర హీరోలు సెట్ కారు. కోలీవుడ్‌లో సినిమాలు అయిపోవడంతో తన దృష్టిని టాలీవుడ్ వైపు తిప్పింది. కాకపోతే ఆమెకు ఛాన్స్ ఇచ్చేవారే ఇక్కడ కరువయ్యారట! ఛాన్సుల విషయంలో నయనతార తనకి బాగా క్లోజ్ అయిన ఒకరిద్దరు సీనియర్ హీరోలను ఫోన్‌లో సంప్రదించినా వారందరూ ముఖం చాటేశారే తప్ప 'ఎస్' చెప్పలేదట! దాంతో తనకి టాలీవుడ్‌లో ఎవరు అవకాశం ఇస్తారా? అని నయన ఎదురు చూస్తోందని అంటున్నారు. గతంలో నమిత కూడా కోలీవుడ్‌ని నమ్ముకుని, టాలీవుడ్‌ని ఖాతరు చేయలేదు. సరిగ్గా నయన పరిస్థితి కూడా నమితలాగే అవుతుందంటున్నారు.

శరీరం మగది. కానీ అందులో ఉన్న మనసు మాత్రం ఆడది. మాది పల్లెటూరు కావడం వల్ల ఊళ్ళో ప్రతి వ్యక్తికి నా విషయం తెలిసిపోయింది. ఇంటికొచ్చి నాన్నకు రకరకాల సలహాలు ఇచ్చేవాళ్ళు. 'ఇలాంటి వాళ్ళని ఇంట్లో ఉంచుకుంటే అరిష్టం. ఇలా ఆడా మగా కాకుండా పుట్టిన వాళ్ళదగ్గర ఏవో శక్తులుంటాయంటారు. మీ ఇంట్లో శుభకార్యం జరక్కుండా అడ్డుకునే పీడ... బైటికి తరిమేయండి' అని ఒకరు, 'మీ ఆడపిల్లలకు పెళ్ళిళ్ళవుతాయా? మీ మగపిల్లలకు పిల్లనివ్వడానికి ఎవరైనా ముందుకొస్తారా? మీ ఇంట్లో పుట్టిన ముసలం' అని ఇంకొకరు, 'ఇలాంటి వాళ్ళు గుంపులు గుంపులుగా వస్తుంటారుగా. ఇచ్చేయండి. కళ్ళకద్దుకుని తీస్కెళ్ళి వాళ్ళతో పాటే ఉంచుకుంటారు' అని మరొకరు.

ఇల్లు నరకంలా మారింది. ఊరు కాట్లకుక్కలా వెంటబడి తరమసాగింది. తట్టుకోవడం నావల్ల కావడంలేదు. ఓ రోజు ఇంట్లోంచి కొంత డబ్బు తీసుకుని పారిపోయాను. ఎక్కడికెళ్ళాలో తెలియదు. గుంటూరు వెళ్ళే బస్ కన్పిస్తే ఎక్కి కూచున్నాను. గుంటూరు చేరాక పగలు రోడ్లు పట్టుకు తిరగడం రాత్రుళ్ళు బస్టాండ్‌లో పడుకోవడం... గమ్యం లేని బతుకు... రాత్రుళ్ళు ఏదో మూల కూచుని అమ్మ గుర్తొచ్చి ఏడ్చేవాణ్ణి. తిరిగి వెళ్ళిపోవాలనిపించేది. కానీ ఊరు, ఊళ్ళో మనుషుల వెకిలి చూపులు గుర్తొచ్చి గుండె రాయి చేసుకున్నాను.

ఓరోజు బస్టాండ్‌లో పడుకున్న నన్ను ఇద్దరు మనుషులు లేపారు. గొంతుని బట్టి రూపం చూసి మగవాళ్ళనుకున్నా. కానీ వాళ్ళు చీరలు ధరించి ఉన్నారు. నన్ను వాళ్ళతో పాటు పిల్చుకెళ్ళారు. ఆ వీధి చాలా అపరిశుభ్రంగా ఉంది. మురిక్కాలువ, దుర్గంధం... పందులు తిరుగుతున్నాయి. అక్కడి గుడిసెల్లో ఓ గుడిసెలోకి తీసుకెళ్ళారు. నన్ను చూడటానికి గుంపులు గుంపులుగా అలాంటి వాళ్ళే వచ్చారు.

మరునాడు నన్ను వాళ్ళ జాతిలోకి మార్చే కార్యక్రమం జరిగింది. రక్తం... నొప్పితో చచ్చి పోతాననుకున్నాను. పేరేమిటని అడిగారు. హర్ష అని చెప్పాను. 'ఈ రోజు నుంచి నీ పేరు వర్ష' అని నవ్వుకున్నారు. 'మన వర్ష ఈ రోజు రజస్వల అయింది' అంటూ సంబరాలు చేసుకున్నారు. గాయం మాని మామూలు మనిషి కావడానికి నెలకు పైగా పట్టింది.

నాకు లంగా ఓణి తొడిగారు. చేతులకు గాజులు వేశారు. చెవులకు దుద్దులు. మొహానికి స్నో రాసి పౌడర్ అద్దారు. పెదవులకు లిప్‌స్టిక్ పూశారు. కళ్ళకు కాటుక దిద్దారు. అద్దంలో చూసుకుంటే నాకు నేనే ముద్దొచ్చాను. ఇలా సింగారించుకోవాలనేగా నేను కోరుకున్నది. నాలోని ఆడతనం పురులు విప్పి నాట్యం చేసింది.

ఆ ఆనందం కొన్ని గంటలే మిగిలింది. రాత్రి కాగానే నరకం ఎలా ఉంటుందో చవి చూశాను. అప్పటినుండి ప్రతిరాత్రి నాకు కాళరాత్రే. ఎవరెవరో మగవాళ్ళు.. నన్ను పట్టుకెళ్ళిన ఆ ఇద్దరూ నా చేత బలవంతంగా వ్యాపారం చేయించేవాళ్ళు. నాకిష్టం లేదంటే తిండి పెట్టకుండా చావగొట్టేవాళ్ళు.

మా నాన్న ఊరు సర్పంచ్ కాబట్టి గ్రంథాలయం కోసం తెప్పించే దిన వార పత్రికలు మొదట మా ఇంటికి వచ్చేవి. అవి చదవడం అలవాటు కావడం వల్ల మనసునిండా అందమైన భావుకత. దానికి స్త్రీ సహజమైన లాలిత్యం తోడై అందమైన ఊహల్లో తేలిపోయేదాన్ని. ప్రేమించాలనీ, ఓ మగవాడి చేత ప్రేమించబడాలనీ, పెళ్ళి చేసుకుని పిల్లల్ని కనాలనీ... ఇలా శరీరాన్ని అమ్ముకోవడం సుతరామూ ఇష్టం ఉండేది కాదు.

ఓరోజు గాజులు కొంటానికి బజారుకెళ్ళి నా హీనమైన బతుకు తల్చుకుని చెట్టుకింద కూచుని ఏడుస్తుంటే నా తలమీద గరుగ్గా ఉన్న చేయి పడింది. తలయెత్తి చూస్తే మరో శిఖండి.. 'ఎందుకేడుస్తున్నావు?' అందామె. నా గుడిసెలో ఉన్న ఇద్దరిలా ఆమె కళ్ళలో కాఠిన్యం లేదు. కరుణ ఉంది. క్రూరత్వం లేదు, జాలి ఉంది. అమ్మలా ఆప్యాయంగా దగ్గరకు తీసుకుని 'నా పేరు సీత. నీకేం కష్టమొచ్చిందో చెప్పు. నా చాతనైనంత సాయం

## మనమీదేనర్రోయ్!

సరసి





చేస్తాను' అంది.

'నాకీ రకమైన జీవితం ఇష్టం లేదు. గౌరవంగా బతకాలని ఉంది. చదువుకుని ఉద్యోగం చేయాలని ఉంది. ప్రేమించి పెళ్ళి చేసుకోవాలని ఉంది. పిల్లల్ని కనాలని ఉంది' అన్నాను ఏడుస్తూ.

ఆమె నన్ను ఓదార్చింది. 'నీలో అమాయకత్వం పోలేదు. మన జీవితాల్లో ప్రేమకు అవకాశం లేదు. పెళ్ళీ పిల్లల్లాంటి అదృష్టాలు మన నుదుట రాసి లేవు. నాకు గౌరవంగా బతకాలని ఉంది. ఇక్కడ బతికిన బతుకుతో రోతపుట్టింది. అందుకే ఈ వాతావరణం నుంచి పారిపోతున్నా. నాతో రా. నిన్ను కన్న కూతురికన్నా ఎక్కువగా చూసుకుంటాను' అంది.

మరో ఆలోచన లేకుండా బస్సెక్కి సీతతో మార్కాపూర్ వచ్చాను. ఏదైనా పని దొరుకుతుందని సీత కాళ్ళరిగేలా తిరిగినా ఎవ్వరూ పనివ్వలేదు. ఆకలికి తట్టుకోలేక అల్లాడిపోయేవాళ్ళం. చివరికి గ్రానైట్ కంపెనీ యజమాని దయతలచి అమ్మకు




పనిచ్చాడు. వాళ్ళ భవంతిలో ఓ మూల వాచ్‌మెన్ కోసం కట్టిన గదిలో ఉండటానికి చోటిచ్చాడు.

నేను మళ్ళా చదువు కొనసాగించాను. వర్ష పేరుతో ప్రైవేట్‌గా పదోతరగతి పరీక్షలు రాసి పాసయ్యాను. ఇంటర్ పూర్తయ్యాక కంప్యూటర్ కోర్సుల్లో చేరాను. ఓ మంచి కంపెనీలో డేటా ఎంట్రీ ఆపరేటర్‌గా ఉద్యోగం తెచ్చుకున్నాను. మొదట్లో ఈ చుట్టుపక్కల మమ్మల్ని చూసి మొహాలు తిప్పుకున్నవాళ్ళే ఇప్పుడు ఆప్యాయంగా పలకరిస్తున్నారు. మమ్మల్ని సాటి మనుషుల్లా గౌరవిస్తున్నారు.

చివరికి ఒకే ఒక కోరిక మిగిలిపోయింది. ప్రేమించబడాలనే కోరిక. ప్రేమలోని మాధుర్యాన్నంతా రుచి చూడాలన్న కోరిక. అది శశికాంత్ వల్లా, వాట్సప్ పుణ్యం వల్లా తీరింది. నన్ను చూస్తే ఏ మగాడైనా ప్రేమిస్తాడా? అసహ్యించుకుంటాడు గానీ, అందుకే శశి ఫొటో పంపమన్నప్పుడు ఇంటర్నెట్లో ఓ అమ్మాయి ఫొటోకి కొన్ని మార్పులు చేసి పంపించాను.

***

మార్కాపూర్లో దిగి వర్ష అడ్రస్ వెతుక్కుంటూ బయల్దేరాను. సమయం పన్నెండు కావస్తోంది. ఎండాకాలం కావటం వల్ల సూర్యుడు నిప్పులు కక్కుతున్నాడు. ఓ అరగంట వెతికాక అడ్రస్ పట్టుకోగలిగాను. ఎంత పెద్ద భవంతో.. పెద్ద పెద్ద ఆఫీసర్లో లేకపోతే బాగా డబ్బున్న వ్యాపారవేత్తలో ఉండే ఇల్లులా ఉంది. వర్ష ఉండేది ఇక్కడేనా? చాలా చిన్న ఉద్యోగం అని కదా చెప్పింది. రాంగ్ అడ్రస్ ఇచ్చిందా? లేదు. నా కవితలు చదివి చక్కటి సమీక్ష రాసిందిగా.

గేట్ పక్కనున్న కాలింగ్‌బెల్ నొక్కాను. కుక్క అరుపు... భయంకరంగా అరుస్తోంది. ఆల్సేషియన్ అయి ఉంటుంది. ఎవరో స్త్రీ దాన్ని అరవొద్దని అదిలిస్తోంది. కొన్ని నిముషాల తర్వాత ఒకావిడ తలుపు తీసి ఎవరు కావాలని అడిగింది. 'వర్ష ఉండేది ఇక్కడేనా?' అని అడిగాను,

తను పనిమనిషిలా ఉంది. "వర్ష కోసం ఎవరో వచ్చారమ్మా" అంటూ లోపలికి విన్పించేలా గొంతు పెంచి చెప్పింది. "లోపలికి రమ్మను" అని విన్పించింది.

వసారాలో కేన్ కుర్చీలు వేసి ఉన్నాయి. కూచున్న రెండు నిమిషాలకు ఓ పెద్దావిడ బయటికొచ్చింది. వయసు యాభైకి దగ్గరగా ఉంటుంది. ఖరీదయిన చీర... చూడగానే ధనికురాలని తెలిసిపోయేలా నగలు...

***

"నా పేరు శశికాంత్ అండీ. వర్షను కలుద్దామని విశాఖపట్నం నుంచి వచ్చాను" అన్నాను లేచి నిలబడ్తూ.

కూచోమని సంజ్ఞ చేసి తనూ ఓ కుర్చీలో కూచుంటూ అడిగింది. "మీకు వర్ష ఏమవుతుంది?".

నేను సిగ్గుపడుతూ చూపులు కిందికి వాల్చి చెప్పాను. "తనూ నేనూ ప్రేమించుకుంటున్నాం".

"వర్షని మీరు చూశారా?"

"లేదండి. తన ఫోటో చూడటమే. మెసేజ్‌లు తప్ప ఎప్పుడూ మాట్లాడుకోలేదు కూడా".

"ఏదీ ఆ ఫోటో చూపించండి"

నా మొబైల్లో దాచుకున్న ఫొటో తీసి చూపించాను.

ఆమె ఓ దీర్ఘ నిశ్వాస విడిచింది. కొన్నిక్షణాల మౌనం తర్వాత చెప్పింది. "నేనిది ఊహించాను. పిచ్చిపిల్ల. మా మూడో అమ్మాయి వయసే ఉంటుంది. ప్రేమకోసం తపించేది. కంప్యూటర్ కోర్సు చేసే చోట ఓ కుర్రాణ్ణి ఇష్టపడింది. వాడు దీని మొహం మీదే ఛీ అన్నాడు. ఉరేసుకోబోతుంటే చూసి నేనే కాపాడాను. ప్రేమ లేని బతుకు వృథా ఆంటీ అని నన్ను పట్టుకుని ఎలా ఏడ్చిందో".

"తనని వెంటనే కలవాలి. ఉండేది ఇక్కడేనా?" అసహనంగా అడిగాను. నాకు వీలైనంత తొందరగా నా వర్షను చూడాలని ఉంది. ఈమె చెప్పేదాన్ని బట్టి వర్ష మూగది కాదు. మాట్లాడగలదు.

"వాళ్ళమ్మ సీత మా కంపెనీలోనే పని చేస్తుంది. అదుగో ఆ ఇంటి వెనుక కన్పిస్తుందే రేకుల షెడ్డు... అందులో ఉంటారు. వర్ష కూడా ఉద్యోగం చేస్తుందిగా. మా ఆయనే ఇప్పించారు. సాయంత్రం ఆరు దాటాక ఇద్దరూ వస్తారు."

"తను పని చేసే ఆఫీస్ అడ్రస్ తెలిస్తే చెప్పండి. వెళ్ళి కలుస్తాను. లేదంటే ఇక్కడే మరికొన్ని గంటలు తన కోసం వేచి చూస్తాను."

"మొదట నీకు వర్ష ఎవరో చెప్పాలి బాబూ. కలిశాక నువ్వు షాక్‌కి లోను కాకూడదు."

"షాకా? ఎందుకు? నేను చూపించిన ఫొటోలో అమ్మాయేగా వర్ష?" అనుమానంగా అడిగాడు.

"కాదు బాబూ. వర్ష అమ్మాయి కాదు".

"కొంపదీసి అబ్బాయా?" భయంగా అడిగాను.

"రెండూ కాదు. అబ్బాయి శరీరంతో పుట్టిన అమ్మాయి. సీత కూడా అదే జాతి. స్వంత తల్లి కాదు. నేను వర్షలో గమనించిన విషయం చెప్పనా బాబూ... తను మానసికంగా పరిపూర్ణమైన స్త్రీ. సున్నితమైన సుకుమారమైన హృదయమున్న స్త్రీ".

వర్ష ఎందుకు నాతో మాట్లాడలేదో నాకర్థమైంది. ఎందుకు కలవొద్దని కన్నీళ్ళతో వేడుకుందో అర్థమైంది.

"నేను వెళ్తాను" అని లేచాను.

"ఇంత దూరం వచ్చి కలవకుండానే వెళ్ళిపోతావా?" అందామె.

"మీరు నాకో మాటివ్వాలి. నేను వచ్చిపోయినట్టు వర్షకు చెప్పకండి ప్లీజ్" చేతులు జోడిస్తూ అన్నాను.

"ఎందుకని?"

"మీరూ నేనూ కోరుకునేది ఆమె సంతోషంగా ఉండాలని కదా... అందుకని"

రైల్లో తిరుగు ప్రయాణం.. రాత్రి ఎనిమిదింటికి వర్ష మెసేజ్ వచ్చింది. ప్రేమతో కూడిన మెసేజ్.. నేను వెంటనే వాట్సప్‌లో సమాధానమిస్తున్నప్పుడు మొబైల్ స్క్రీన్ మీద నా కన్నీళ్ళు పడి అక్షరాలు అలికినట్టు కన్పించాయి.

*సెల్: 075886 30243*

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో
## 'ఆంకిలోసింగ్ స్పాండిలైటిస్' సమస్యకు సరైన వైద్యం

డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్



మన శరీరంలో సహజంగా ఏర్పాటై ఉన్న రక్షణ వ్యవస్థ, సూక్ష్మక్రిములు మరియు జబ్బుల నుండి మనల్ని నిత్యం కాపాడుతుంటుంది. ఇటువంటి అద్భుతమైన రక్షణ వ్యవస్థ ఒక్కోసారి పొరబడి ఏకంగా మన శరీర భాగాల మీద దాడి చేస్తుంది. దీని ఫలితమే రకరకాల ఆటోఇమ్యూన్ సమస్యలు. ఈ కోవకు చెందినదే 'ఆంకిలోసింగ్ స్పాండిలైటిస్'. సాధారణంగా వెన్ను సమస్యలు – వెన్నుపూసలు అరిగిపోవడం మరియు వాటి మధ్యలో ఉండే డిస్కులు దెబ్బతినటం వలన సంభవిస్తాయి. కానీ ఈ సమస్య మాత్రం వెన్ను దగ్గరలోని కణజాలంపై మనలోని రోగనిరోధక వ్యవస్థ స్వయంగా దాడి చేయడం వలన సంభవిస్తుంది. ముఖ్యంగా ఇన్‌ఫ్లమేషన్ ప్రభావంతో వెన్నెముక బిరుసుగా మారడాన్ని 'ఆంకిలోసింగ్ స్పాండిలైటిస్' అని అంటారు.




ఈ సమస్య సాధారణంగా 15 నుండి 25 సం॥ల మధ్య వయస్సు వారిలో కనబడుతుంది. అందులోనూ స్త్రీల కంటే పురుషులలో 3 రెట్లు దీనిని ఎక్కువగా చూడవచ్చు. సహజంగా వెన్నెముక నిర్మాణం చాలా సంక్లిష్టమైనది. డిస్కులు, కండరములు, లిగమెంట్లు, టెండాన్‌లు మరియు కార్టిలేజ్‌ల సముదాయంతో వెన్నెముక ఏర్పడుతుంది. మనిషి వంగడానికి మరియు ఇతర కదలికలకు ఇది తోడ్పడుతుంది. 'ఆంకిలోసింగ్ స్పాండిలైటిస్' అనేది ఆర్థరైటిస్ గ్రూప్‌కు చెందిన వ్యాధి. దీనిని 'సీరో నెగటివ్ స్పాండైలో ఆర్థరైటిస్' అని అంటారు. ఎప్పుడైతే వెన్నెముక దగ్గర కణజాలం 'ఫైబ్రోసిస్'కు గురి కాబడుతుందో లేదా వెన్నుపూసలు ఒకదానికొకటి కలసిపోవడం జరుగుతుందో అప్పుడు వెన్నెముక తన సహజ కదలికలు కోల్పోయి, ఒక గట్టి వెదురు కర్ర మాదిరిగా తయారవుతుంది. ఇటువంటి పరిస్థితినే వైద్యపరిభాషలో 'బ్యాంబూస్పైన్' అంటారు.

**కారణాలు:** ముఖ్యంగా జన్యుపరమైన కారణాల పరంగా – 'ఆంకిలోసింగ్ స్పాండిలైటిస్' బాధితులు 90% మేరకు $HLAB_{27}$ అనే జన్యువును కలిగి ఉంటారు. మరియు కుటుంబ చరిత్ర కూడా ఈ వ్యాధికి ఒక కారణం కావచ్చు.



**లక్షణాలు:** ఈ వ్యాధి యొక్క ప్రభావం ముఖ్యంగా నడుము, తుంటి కీళ్ళపై(Sacro-iliac Joint) ఉంటుంది. ఈ ప్రాంతంలో మరియు పిరుదులలో సాధారణం నుండి అతి తీవ్రమైన నొప్పి ఉండవచ్చు. • వెన్నెముకలోని వెన్నుపూసలు ఒకదానికొకటి కలసిపోవడం ద్వారా నడుము–తుంటి ప్రాంతము మరియు మెడ భాగము బిగువుగా మారి సాధారణ కదలికలకు ఆటంకం కలుగుతుంది. • 'ఆంకిలోసింగ్ స్పాండిలైటిస్' ప్రభావం కేవలం వెన్నెముకపై మాత్రమే కాకుండా కాళ్ళు, చేతులలోని కీళ్ళు, గుండె కవాటాలు, ఊపిరితిత్తులపై కూడా ఉంటుంది. • 40% మేరకు ఈ సమస్యతో బాధపడే వారిలో కంటికి సంబంధించిన దుష్ఫలితాలు మొదలవుతాయి. ముఖ్యంగా కళ్ళు ఎర్రగా మారడం మరియు కళ్ళ మంటలు, వెలుతురు చూడలేకపోవడం, కొన్ని సందర్భాలలో కంటిచూపు మందగించడం వంటి సమస్యలు తలెత్తుతాయి. వీటితో బాటుగా జ్వరం, నీరసం, ఆకలి మందగించడం వంటి లక్షణాలు కనిపిస్తాయి.

**నిర్ధారణ పరీక్షలు:** రోగి లక్షణాలను బట్టి మరియు CBP, ESR, సి రియాక్టివ్ ప్రోటీన్, (C.R.P.), X-Ray, MRI-Spine, $HLAB_{27}$ మొదలగు టెస్ట్‌ల ద్వారా ఈ వ్యాధిని నిర్ధారించవచ్చు.

**దుష్ఫలితాలు:** వెన్నుపూసలు 'ఆస్టియో పోరోసిస్'కు గురి కావడం వలన వెన్నెముక ఫ్రాక్చర్లు సంభవిస్తాయి. • ఈ వ్యాధి తీవ్రంగా ఉన్నవారిలో వెన్నెముక నుండి వచ్చే నరాలు ఒత్తిడికి గురికావడం వలన, కాళ్ళు–చేతులలో తిమ్మిర్లు, సూదులు గుచ్చినట్లుగా ఉండటం, సత్తువ కోల్పోవడం వంటి లక్షణాలు స్పష్టంగా కనిపిస్తాయి. • ఈ సమస్య ఊపిరితిత్తులపై ప్రభావం చూపడం వలన శ్వాస తీసుకోవడంలో ఇబ్బందులు కలుగుతాయి. • నొప్పిని నివారించే మందులు ఎక్కువగా తీసుకోవడం వలన కిడ్నీ సమస్యలు తలెత్తుతాయి.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ చికిత్స:** 'ఆంకిలోసింగ్ స్పాండిలైటిస్' అనేది ఒక దీర్ఘకాలిక సమస్య. సమస్యాత్మకమైన ఈ వ్యాధిని ప్రాథమిక దశలోనే గుర్తించి – తక్షణ వైద్యం ద్వారా వెన్నెముక దెబ్బతినకుండా కాపాడుకునే వీలుంది. హోమియో మందులతో ఇది సమర్థవంతంగా నయం కాబడుతుంది. సూక్ష్మీకరణ పద్ధతిలో తయారైన మందులతో జరుపబడే జెనెటిక్ కాన్‌స్టిట్యూషనల్ చికిత్స మేరకు, కేవలం వ్యాధి లక్షణాలుగా చెప్పబడే – నొప్పి, తిమ్మిరి, మంటలను తగ్గించడమే కాకుండా, వ్యాధి మూలకారణాన్ని గుర్తించి చికిత్సను అందివ్వడం జరుగుతుంది. తద్వారా వ్యాధి తీవ్రతను తగ్గించి, వ్యాధిని పూర్తిగా నయం చేసే అవకాశం ఉంది లేదా వ్యాధి వలన కలిగే దుష్ఫలితాల బారిన పడకుండా కాపాడే అవకాశం ఉంటుంది.

టోల్ ఫ్రీ 1800 108 1212
కన్సల్టేషన్ ఉచితం
955 000 1199
www.homeocare.in



## ఇంటర్వ్యూ

# మానసిక పరివర్తన తెచ్చేది సాహిత్యమే

## -సుధామ

**బాల్యం నుండే తెలుగు భాషా పరిపోషణకు అంకితమైన సాహిత్యవేత్త సుధామ. పువ్వు పుట్టగానే పరిమళిస్తుందంటారు.. ఆ కోవకుచెందినవారే ఆయన. తోటి పిల్లల్ని పోగేసి నాటక రచన, దర్శకత్వం, ప్రదర్శనలతో నాయకత్వ ప్రతిభా పాటవాల్ని నిరూపించుకోవడమే కాదు, బుక్ రీడర్‌గా, లిఖిత పత్రికా శిల్పిగా అకుంఠిత దీక్షతో భాషా సేవ చేసిన వారు సుధామ. నాటక రచన సహా సకల సాహితీ ప్రక్రియల్లో రాటుదేలినప్పటికీ కవిగా చెప్పుకోవడంలోనే ఆయనకు ఆనందం ఎక్కువ. కవి, కార్టూనిస్టు, చిత్రకారుడు, కథా రచయిత, కాలమిస్టు, సమీక్షకుడు, విమర్శకుడు, పజిల్స్ నిర్మాత, ఆకాశవాణి కేంద్రంలో కార్యక్రమ నిర్వహణాధికారిగా కీలక బాధ్యతలు నిర్వహించి శ్రోతల సేవలో తరించిన అరవై ఐదేళ్ళ అలుపెరుగని సాహితీజీవి సుధామ ఇంటర్వ్యూ ఈ వారం.....**

విశాఖపట్నంజిల్లా అనకాపల్లిలో 1951 నవంబరు 25న జన్మించాను. మేం ఆరుగురు సంతానం. నలుగురు మగపిల్లలు, ఇద్దరు ఆడపిల్లలు. నేను రెండోవాణ్ణి. మా నాన్నగారు అల్లంరాజు కామేశ్వర రావు. అమ్మ రాజేశ్వరమ్మ. నా పూర్తిపేరు అల్లంరాజు వెంకటరావు. నాన్న వైద్య ఆరోగ్యశాఖలో కీలక బాధ్యతలు నిర్వహించేవారు. ఆయన కూడా స్టేజీ నటులు. మహాత్మాగాంధీ సమక్షంలో 'ఆత్మార్పణ' నాటకం ప్రదర్శించారాయన. నా విద్యాభ్యాసమంతా హైదరాబాద్‌లోనే. హెచ్.ఎస్.సి పాసై, వివేకవర్ధనిలో పి.యు.సి పూర్తిచేశాను. ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు మా స్కూలు వార్షికోత్సవంలో చేసిన ప్రసంగమే నా సాహిత్యాభిరుచికి హేతువు. ఆంధ్ర సారస్వత పరిషత్ ప్రాచ్య కళాశాలలో బ్యాచిలర్ ఆఫ్ ఓరియంటల్ లాంగ్వేజెస్, మాస్టర్ ఆఫ్ ఓరియంటల్ లాంగ్వేజెస్ పూర్తి చేసి ఉస్మానియాలో ఎం.ఏ, 'అభ్యుదయ తెలుగు కవిత్వంలో భావ చిత్రాలు' అంశంపై ఎంఫిల్ చేశాను.

### రేడియో అనుబంధం

బాల్యం నుండి నాకు రేడియోతో అనుబంధం ఉండేది. రేడియో అన్నయ్య న్యాయపతి రాఘవ రావుగారి ఒడిలో కూర్చుని పిల్లల కార్యక్రమంలో చేతవెన్నముద్ద... పద్యం చదివాను.

హైస్కూలు రోజుల్లో 'ఆంధ్రబాలానంద సంఘం' సభ్యునిగా రేడియోలోనూ, వేదికమీదా ధ్రువుడు, బాలచంద్రుడు వంటి నాటకాల్లో కథానాయకపాత్రలు ధరించాను. 'పన్నా' హిందీ నాటకంలో నటించాను. 'అమర్ జవహర్ బాలానంద సంఘం' స్థాపించి మలక్‌పేట కాలనీ పిల్లలతో గణపతి ఉత్సవాల్లో, రేడియోలో నాటకాలు వేసేవాణ్ణి. 'భారతదేశం, చైనా భూతం' నాటిక నేనే సొంతంగా రాసి దర్శకత్వం వహించాను.

### లిఖిత పత్రికలు

నేను పదవ తరగతిలో ఉండగా చందమామ, బాలమిత్ర తరహాలో 'విజ్ఞానజ్యోతి' లిఖిత పత్రిక నిర్వహించాను. 'చిట్టిపాపలు' గేయం, 'బాలబంధు' పత్రికలో 'చెడు సహవాసం' కథ, 'పానుగంటి విశిష్టత' అనే వ్యాసం 1965-66లలో నా తొలి రచనలు.

'యువమిత్ర' పేరిట లిఖిత మాసపత్రిక ఏడేళ్ళు నడిపాను. ప్రతిపేజీనీ ఎంతో అందంగా ఆర్టిస్టిక్‌గా తీర్చిదిద్దేవాణ్ణి. పత్రికను ఎంతోమంది ప్రముఖులు చదివి ప్రశంసించేవారు. "నేటి ముద్రిత పత్రికలు ముఖం చూసుకోదగ్గ అద్దం ఈ లిఖిత పత్రిక. ఇందులో ఉన్నవన్నీ శబ్దచిత్రాలు, చిత్ర శబ్దాలు. "శేముషి+కృషి=సుధామ" అంటూ సినారె మా పత్రికను ప్రశంసించారు. నా జీవితానికి ఇంతకంటే గొప్ప అవార్డు ఇంకేం కావాలి చెప్పండి? అవన్నీ బైండింగ్ చేయించి ఇప్పటికీ ఎంతో జాగ్రత్తగా దాచుకున్నాను. ఆ రోజుల్లో అలా 15-20 లిఖిత పత్రికలు వచ్చినప్పటికీ, నాదే తొలి లిఖిత పత్రికగా నమోదైంది.

### రేడియోలో ఉద్యోగం

ఎంఎల్ చదువుతూ రేడియోలో క్యాజువల్‌గా పనిచేసేవాణ్ణి. అప్పుడే కరీంనగర్ బిషప్ సాల్మన్ జూనియర్ కాలేజీలో తెలుగు లెక్చరర్‌గా ఉద్యోగం వచ్చింది. రెండేళ్ళు పనిచేసి, రీసెర్చ్ చేయాలనే తపనతో ఆ ఉద్యోగం వదిలేశాను. ఈలోపే రేడియోలో డ్యూటీ ఆఫీసర్‌గా 1978లో ఉద్యోగం వచ్చింది. తర్వాత ఎంఫిల్ పూర్తిచేశాను.

ఇక రేడియోలో ఉద్యోగం నా పూర్వజన్మ సుకృతం. ఎందుకంటే అప్పటికి ప్రజలతో అనుసంధానం కాగలిగిన ఏకైక మీడియం అదే. అప్పటికే నేను కవి, రచయిత కావడంవల్ల రేడియో ద్వారా ప్రజల్లోకి చొచ్చుకుపోగలిగాను. మంచి జీవితం, పేరు లభించాయి. అంతకుముందే క్యాజువల్‌గా రేడియోలో జాతీయ కవిసమ్మేళనానికి ఒరియా కవితను అనువదించే అవకాశం లభించింది. ఉద్యోగంలో చేరాక 1983లో కవి ప్రతినిధిగా జాతీయ కవిసమ్మేళనంలో పాల్గొని 'ఎండలో సామాన్యుడు' అనే కవిత చదివాను. దీంతో నా కవిత జాతీయ కవితగా ఎంపికై అన్ని భాషల్లోకి అనువాదమై దేశమంతటా ప్రసారమైంది.

రేడియో ద్వారా కొత్త రచయితలను, కళాకారులను పరిచయం చేశాను. ఆనాడు శ్రోతలు పంపిన జోకుల్ని నాటికీకరించి చేసిన 'హ్యూమరసం' కామెడీ కార్యక్రమం ఎంతో పాపులరైంది.

### పుస్తక రచనలు

నా తొలి కవితా సంకలనం 'అగ్నిసుధ' తర్వాత 'చిత్రగ్రంథి', 'కవికాలమ్' కవితా సంకలనాలు వచ్చాయి. రేడియో, దూరదర్శన్‌లలో నేను రాసిన పాటలు 'మనసు పావనగంగ' సంపుటిగా వచ్చాయి. ఈ మాసపుపాటలు, బృందగీతాలు, ఎన్నో లలిత గీతాలు కూడా రాశాను.

1979 అంతర్జాతీయ బాలల దినోత్సవానికి రాసిన 'బాలలంమేం ఒక్కటే/లోకమూ మాకు ఒక్కటే.. అనే సమైక్య గీతం యూనిసెఫ్ వారి బాలల గేయంగా జనాదరణ పొందింది. నాలుగో తరగతి పాఠ్యాంశంలో, నాటి పెద్ద బాలశిక్షలో కూడా దీన్ని చేర్చారు.

1965లో 'బాలబంధు' పక్షపత్రికలో నా మొదటి కథ అచ్చయింది. 'గడ్డిమొలవని భూమి' కథకు జ్యోతివారి బహుమతి లభించింది. ఆ రోజుల్లో 'తరుణ' పత్రికలో నేను రాసిన 'మనువు చెప్పిన మాట' కథ సంచలనం సృష్టించింది. నేను రాసిన పది నాటకాల్లో 'తెల్లవారింది', 'అడ్రస్ ప్లీజ్', 'కను విప్పు' నాటకాలు ఎంతో ఆదరణ పొందాయి. రేడియో నాటకాలెన్నో రాశాను. నటించాను కూడా. వివిధ పత్రికల్లో కాలమ్స్ నిర్వహించాను. 116 పుస్తకాలకు పీఠికలు రాశాను. ఒక పత్రిక ఎడిట్ పేజీలో పదిహే నేళ్ళు నేను నిర్వహించిన 'సం.సా.రాలు' (సంస్కృతి, సాహిత్యం, రాజకీయం) శీర్షికలో వ్యాసాలు అదే టైటిల్‌తో పుస్తకంగా వచ్చింది. ఆ పుస్తకానికి 2004లో తెలుగు విశ్వవిద్యాలయం ఉత్తమ సాహిత్య పుర స్కారం లభించింది. ఇలా ఒక కాలమ్ వ్యాసాల పుస్తకానికి అవార్డు రావడం అదే ప్రథమం. యువ భారతి సంస్థలో సభ్యునిగాచేరి, కార్యకర్తగా ఎదిగి ప్రస్తుతం యువభారతి ప్రచురణల సంపాదకునిగా ఉన్నాను.

### పజిల్స్

నవ్య వారపత్రికలో 'పదగారడి' పేరుతోనూ, మరో తెలుగు దినపత్రికలో 'పదబంధం' పేరిట పజిల్స్ నిర్వహిస్తున్నాను. పి.యు.సిలో ఉండగానే శ్రీశ్రీ, ఆరుద్ర ప్రభావంతో చుక్కాని వారపత్రికలో క్రాస్‌వర్డ్ పజిల్స్ రాసేవాణ్ణి. పజిల్స్ వల్ల తెలుగుభాష మీద పట్టు వస్తుంది. మేధకు పదునుపెడుతుంది పజిల్. భాషా మాధుర్యం, సొబగు తెలియాలంటే పజిల్స్ పూర్తి చెయ్యాలి. ఒక పత్రికలో 'రామా యణపథం' అనే పేరుతో 88 వారాలు పజిల్ నిర్వ హించాను. రామాయణం మొత్తం సమాధానాల్లో వచ్చేయడమే ఈ పజిల్ ప్రత్యేకత!

### కవిగా గుర్తింపే ఇష్టం

వైవిధ్యమైన ఎన్నో సాహితీ ప్రక్రియల్లో రచ నలు చేసినప్పటికీ నా ప్రథమ వ్యాసంగం కవి త్వమే. మౌలికంగా కవిగా గుర్తింపు పొందడమే నాకు ఇష్టం. నా కవిత్వం మానవీయకోణాన్ని ప్రతి బింబిస్తుంది. సామాజిక జీవితానికి దర్పణం పడు తుంది. కవులు గుర్తింపబడని శాసనకర్తలు. మను షుల్లో మానసిక పరివర్తన తెచ్చేది సాహిత్యం మాత్రమే. సామాజికంగా కవిత్వంలో ఎన్నో మార్పులు వచ్చాయి. కవిత్వం, వాదాలు పేరిట, ప్రయోగాల పేరిట బుకాయింపులు వస్తున్నాయి. కవిత్వం ఒక ఆలోచనామృతం. రాసేవారికీ, పాఠకులకూ కవిత్వం అర్థం కావాలి. ఒట్టి నినాదాలు, పైపై మాటలు కవిత్వం కాదు. కవిత్వం హృదయానికి పట్టునివ్వాలి. చెప్పా లంటే కవిత్వం స్పాంటేనియస్‌గా వస్తుంది. ఆలోచ నల్ని స్పాంటేనియస్‌గా చెప్పగలిగేదే కవిత్వం. నేను పొయిట్రీలో జీవిస్తాను. కానీ వైవిధ్యం నాకు ఇష్టం.

ఒక పత్రికలో వారం వారం జరిగిన జాతీయ అంతర్జాతీయ సంఘటనలను కవిత్వం రూపంలో రాసేవాణ్ణి. ఈ విధమైన ప్రయోగం అదే మొదలు. ఇవన్నీ 'కవికాలమ్' పుస్తకంగా వెలువడింది. అంత ర్జాలంలో 'సుధామధురం' బ్లాగ్ నిర్వహిస్తున్నాను. రేడియోలో 1500 పుస్తక సమీక్షలు చేశాను. పత్రి కల్లో ఇప్పటికీ పుస్తక సమీక్షలు చేస్తున్నాను.

దివాకర్ల సాహితీ పురస్కారం, తిరుమల సాహితీ పురస్కారం, ఉమ్మడిశెట్టి అవార్డు, వంశీ ఇంటర్నేషనల్ అవార్డు సహా ఎన్నో సాహిత్య పుర స్కారాలు అందుకున్నాను.

### కవిత్వ రచన

నాలుగు దశాబ్దాలుగా అన్ని పత్రికల్లో నా కవి తలు ప్రచురితమవుతున్నాయి. దివాకర్ల, ఉత్పల, సినారె, దాశరథి, బోయిభీమన్న, శశాంక వంటి ప్రముఖుల సరసన కవిసమ్మేళనాల్లో పాల్గొన్నాను. కె.శివారెడ్డి, దేవిప్రియ, శిలాలోలిత రాజు ప్రభృతులతో సంచరించాను.

హైదరాబాద్ నారా యణగూడ వైఎంసిఏ హాలులో 1967లో జరిగిన కవి సమ్మేళనంలో నేను చదివిన 'నే రాస్తా!' తొలి కవిత 1968లో నవ్యవా ణిలో ముద్రితమైంది. పద హారేళ్ళ వయసులో రాసిన 'కనీస కోర్కెలు' కవిత 'ప్రతిభ' వారపత్రికలో ప్రచు రితమైంది. అలా కవిగా నా ప్రస్థానం ప్రారంభమైంది. విద్యార్థిగా ఉండ గానే కేంద్ర సాహిత్య అకాడమీవారు దేవులపల్లి రామానుజారావుగారి సంపాదకత్వంలో ప్రచురించిన 'స్వాతంత్ర్యానంతర తెలుగు కవిత' కవితా సంకల నంలో నా కవిత చోటు చేసుకుంది. ఐదవ అఖిల భారత తెలుగు రచయితల సావనీర్‌లో శశాంకగారు విద్యార్థి కవులను ఉటంకిస్తూ తొలుత ప్రస్తావిం చింది నా గురించే. నాటి పత్రికలో కవితలు, కథలు, ఛందోబద్ధమైన నా పద్యాలు ప్రచురితమయ్యేవి. మొదట నా పేరుతోనే రచనలు చేశాను. తర్వాత 'సుధామ' కలం పేరు పెట్టుకున్నాను. సుధామ అంటే సువ్యవస్థ, మంచి ప్రదేశం అని అర్థం.


కుటుంబసభ్యులతో...


శివారెడ్డి, ఎన్.గోపిలతో సుధామ

### ఆర్టిస్టు, కార్టూనిస్టు

బాల్యం నుండీ నేను ఆర్టిస్టుని, కార్టూనిస్టుని. బాపుగారి బొమ్మల్ని అనుకరిస్తూ స్వయంగా కార్టూనిస్టుగా, చిత్రకారుడుగా ఎదిగాను. నా తొలి కార్టూన్ 1968లో 'లత' మాసపత్రికలో అచ్చయింది. ఆనాటి అన్ని పత్రికల్లోనూ 800 పైగా కార్టూన్లు వేశాను. ఈనాటికీ వేస్తున్నాను. అదేవిధంగా 'తెలుగు పత్రికల్లో కార్టూన్లు, జోకులు' అనే వ్యాసం 'మహతి' అనే సంకలనంలో రాశాను.

తర్వాతి కాలంలో అందులో నేను అభిలషించిన విధంగానే తెలుగు కార్టూనిస్టుల సంఘం ఏర్పడి సభలు జరిగాయి. 'కార్టూన్లు-ధ్వనిసిద్ధాంతం' అనే వ్యాసం జ్యోతి మాసపత్రికలో రాశాను. అలా కార్టూన్లపై సైద్ధాంతిక వ్యాసాలు రాసింది నేనే. దాదాపు 100కు పైగా పుస్తకాలకు ముఖచిత్రాలు వేశాను. సమైక్యభారతివారి కార్టూనోత్సవంలో సీని యర్ కార్టూనిస్టుగా సత్కారం, హాస్య రచనలకు గాను మునిమాణిక్యం హాస్యనిధి పురస్కారం, తురగా కృష్ణమోహనరావు స్మారక సాహితీ పుర స్కారం అందుకున్నాను.

### కుటుంబం

నా శ్రీమతి పేరు ఉషారాణి. ప్రస్తుతం హైద రాబాద్ ఆకాశవాణిలో రీజినల్ అకాడమీ ఆఫ్ బ్రాడ్‌కాస్టింగ్ అండ్ మల్టీ మీడియా (ప్రసారభా రతి ట్రైనింగ్ సెంటర్) అధిపతిగా పనిచేస్తోంది. మా అబ్బాయి స్నేహిత్. అమెరికా నోబుల్ బయో కేర్ కంపెనీ కన్సల్టెంట్. కోడలు స్రవంతి అమెరికా లోనే ఇన్ఫోసిస్‌లో పనిచేస్తోంది.

**-తాతిరాజు**



# సాఫ్ట్‌వేర్‌లో సరిగమలు

21

- కంఠంనేని స్వప్న



**ఆన్‌లైన్ డిటెక్టివ్ పంపిన మెయిల్ చదువుతోంది కావ్య.**

**"హేయ్... ఐయామ్ సారీ! చిన్న గందరగోళం జరిగింది నా అనాలిసిస్‌లో. టైమ్‌జోన్ డిఫరెన్స్ మర్చిపోయాను. నైరా కిడ్నాప్ సంఘటన జరిగిన మర్నాడు పగలు ఆ ఇంట్లో హర్ష ఉన్నాడు. అది యు.ఎస్. టైమ్ ప్రకారం కిడ్నాప్ జరిగిందంటున్న టైమ్‌లోకి వస్తుంది. నేను ఇండియాకీ, యు.ఎస్.కీ మధ్య ఉన్న టైమ్ తేడా సంగతే మర్చిపోయాను".**

"బట్ నా అనాలసిస్ కొనసాగిస్తున్నాను. హోప్‌ఫుల్లీ... అతి త్వరలో మనమీ కిడ్నాప్ మిస్టరీని ఛేదిద్దాం."

ఆ మెయిల్ చదివి విపరీతమైన షాక్‌కి గురయింది కావ్య.

వీడి అనాలిసిస్ తగలెట్టా! చిన్న గందరగోళం అంటున్నాడు పైగా!

లాగిపెట్టి కొట్టాలి వెధవని.

ఈలోగా తనేమో నోటిదూలకొద్దీ ఊరంతా ప్రచారం చేసింది. అక్షయ్‌కీ, రోహిణీకి, సీమకీ, బ్రహ్మీకీ... ఇంతమందికి చెప్పింది. అక్షయ్, రోహిణి తనను తిట్టారు కూడా. హర్ష కాదని ఇప్పుడు వాళ్ళకు చెప్పి మళ్ళీ తిట్టించుకోవాలి. సీమ పెద్దగా పట్టించుకోదు కాబట్టి ఫర్వాలేదు.

బ్రహ్మీ, తను పెద్ద డిటెక్టివ్స్‌లాగా పరిశోధన చేయటానికి, హర్ష ఇంట్లోకి చొరబడటానికి కూడా ప్రయత్నించారు. కీస్ దొరకలేదు కాబట్టి సరిపోయింది. ఆ అపార్ట్‌మెంట్స్‌లో వాళ్ళు తనను ఆల్‌రెడీ పనిమనిషి అనుకున్నారు. యాభై ఏళ్ళ పైనున్న వాచ్‌మెన్ తనని ఆంటీ అన్నాడు. ఇప్పుడు వీటికి తోడు తాళం చెవుల కోసం ప్రయత్నించినందుకు దొంగ అని కూడా అనిపించుకోవాలేమో!

దేవుడా!

నన్నెందుకింత తెలివితక్కువగా పుట్టించావు?

తనకి సరే! బ్రహ్మీకి ఎందుకు బుద్ధిలేకపోయింది. హర్ష అయ్యుండకపోవచ్చు. ఒకసారి మళ్ళీ కనుక్కో అని చెప్పాల్సింది పోయి, హీరోలాగా హర్ష ఇంటిలోకి దొంగతనంగా దూరి సోదా చేయాలనే ఐడియా ఇచ్చాడు.

అయినా అతన్నెందుకు అనుకోవటం? పాపం దేవుడు తనలాగే బ్రహ్మీని కూడా తెలివితక్కువగా పుట్టించాడు.

గత రెండు రోజుల్లో హర్ష పట్ల తన ప్రవర్తన గుర్తొస్తే ఆమెకి భూమి తవ్వేసి అందులోకి దూరిపోవాలనిపిస్తోంది.

వెంటాడిందతన్ని.

ఏమిటో అని అతను తనను మాట్లాడిస్తే పెడసరంగా సమాధానాలు చెప్పింది.

అంత ఇబ్బందికరమైన పరిస్థితిలోనూ ఆమెకి ఒక విషయం సంతోషాన్ని కలిగిస్తోంది. హర్ష అక్షయ్‌కి నిజమైన మిత్రుడే! అతనేమీ అక్షయ్‌ని మోసం చేయలేదు.

తను రెండు రోజుల నుంచీ చేసిన హడావుడికి ఫుల్‌స్టాప్ పెట్టాలి.

ఫోన్‌చేసి మాట్లాడటానికి ధైర్యం చాలలేదు.

పైగా అర్ధరాత్రవుతోంది.

అక్షయ్, రోహిణి, సీమ, బ్రహ్మీ... నలుగురికీ మెసేజ్ చేసింది.

కాసేపటికి అక్షయ్ నుంచీ రిప్లయ్ వచ్చింది.

"నాకు తెలిసిందే కదా! ఇప్పటికైనా నిజం తెలుసుకున్నందుకు థాంక్స్. నా ఫ్రెండ్స్ అందరినీ చెడ్డవాళ్ళని ఊహించడం మానేయి.. నువ్వేమీ నైరా విషయం పరిశోధించక్కర్లేదు. నన్ను ప్రశాంతంగా ఉండనిస్తే అదే పది వేలు."

"ఫ్రెండ్స్ అందర్నీ తనేమంది? ఒక్క హర్ష గురించేగా అనుమానించింది. అదీ ఆ ఇంగ్లీష్ వెధవ తనకి తప్పుడు సమాచారం ఇవ్వడం వల్ల జరిగింది. ఫ్రెండ్స్ అందరినీ అంటాడేమిటి? సీమ గురించేమో!

అతను కూడా ఎవరినైనా తనిష్టపడినంతగా ప్రేమిస్తే తెలుస్తుంది. ఇన్‌సెక్యూరిటీ అనేది ఎలా ఉంటుందో! తనేమీ నైరా విషయం పరిశోధించక్కర్లే



దట. అతనెవరు చెప్పటానికి? తనిష్టం. తనకు చేత నయినంత తను చేస్తుంది.

అతన్ని తను ప్రశాంతంగా ఉండనిస్తే చాలట. పెద్దగా నవ్వాలనిపించింది కావ్యకి. అసలు తన ఉనికే అతనికి గుర్తుండదు. అతని ప్రశాంతతకి తన వల్ల వచ్చిన లోటేముంది.

అందంగా ఉన్నానని పొగరు" గొణుక్కుంది కావ్య.

అసలు అందమైన మగవాళ్ళని ప్రేమించ కూడదు. అనుక్షణం అభద్రతాభావంతో చావాలి. చాలామంది అందమైన అమ్మాయిలు బాగోని అబ్బాయిలని పెళ్ళి చేసుకోవటం చూసి జాలి పడ తారు కానీ, అసలు వాళ్ళే తెలివైన వాళ్ళు. జీవి తాంతం హ్యాపీగా ఉంటారు. లావైనా, నల్లబడినా, తెల్లజుట్టొచ్చినా, ఆఖరికి పళ్ళూడిపోయినా సరే కాన్ఫిడెంట్‌గా బ్రతికేస్తారు.

ఉక్రోషంగా ఉంది కావ్యకి.

ఏడుపొస్తోంది.

ఫోన్ మళ్ళీ బీప్ మంది.

రోహిణి నుంచీ మెసేజ్.

గబగబా ఓపెన్ చేసి చూసింది.

ఒక స్మయిలీ ఉందంతే. ఇంకేమీ లేదు.

అంతకంటే తనని లాగిపెట్టి కొట్టినా కొంచెం ఊరటగా ఉండేదేమో.

ఒట్టి స్మయిలీ ఏమిటి?

"యూ ఆర్ హోప్‌లెస్" అనేగా!

కావ్య కళ్ళలో నుంచి నీళ్ళు జారుతున్నాయి.

***

మర్నాడు రెస్ట్‌రూమ్‌లో సీమ కనపడి కావ్యను పలకరించింది.

"నీ మెసేజ్ ఈ రోజు పొద్దున చూశాను. ఆఫీస్‌లో మాట్లాడవచ్చులే అని రిప్లయ్ చేయలేదు".

"పర్వాలేదు. అతనెవరో రాంగ్ ఇన్‌ఫర్మేషన్ ఇచ్చాడు. అది పట్టుకుని మీకందరికీ చెప్పాను" దిగులుగా అంది కావ్య.

## జరిగిన కథ

అక్షయ్, కావ్య, సీమ, హర్ష ఓ మల్టీ నేషనల్ కంపెనీలో పని చేస్తుంటారు. అక్షయ్ వాళ్ళ అక్కా, బావ యాక్సిడెంట్‌లో చనిపోవడంతో, వారి కూతురు నైరాని తన సంరక్షణలోకి తీసుకుంటాడు అక్షయ్. ఒకరోజు నైరా కనిపించకుండా పోతుంది. పోలీస్ ఇన్వెస్టిగేషన్ మొదలవుతుంది. పేపర్లలో వచ్చిన వార్తల ఆధారంగా, ఇన్‌స్పెక్టర్ శ్రీకాంత్ ఇచ్చిన సమాచారం మేరకు నైరా ఆచూకీ కోసం రకరకాలుగా ప్రయత్నిస్తుంటాడు అక్షయ్. ఆ ప్రయత్నాల్లో బాగంగా ఎంతోమంది చిన్న పిల్లలను కాపాడతాడు. నైరా ఆచూకీ కోసం కావ్య ఒక ఆన్‌లైన్ డిటెక్టివ్‌ను కాంటాక్ట్ చేస్తుంది. నైరాని హర్ష కిడ్నాప్ చేసుండొచ్చని చెబుతాడా డిటెక్టివ్. ఆ విషయాన్ని అక్షయ్‌కి చెబితే, అతడామెను తిట్టి పోస్తాడు. ఆఫీసులో సీమకి, రోహిణికి, బ్రహ్మికి కూడా చెబుతుంది. హర్షని ఫాలో చేస్తుంటుంది కావ్య. **ఆ తర్వాత...**

"దట్స్ ఓకే! నీ వైపు నుండి నువ్వు ప్రయత్నిస్తున్నావు. నీ వద్దనున్న సమాచారాన్ని నువ్వు షేర్ చేశావు. తప్పేముంది? పోన్లే.. హర్ష కాదని తెలిసిందిగా!" ఓదార్చినట్లుగా అంది సీమ.

"అవుననుకో. తనని ఈ రకంగా అనుమానించానని తెలిసినరోజు హర్ష నన్నెంతగా తిట్టుకుంటాడో. అయినా నాకు తొందరెక్కువ" తన తల మీద తనే ఒకటి కొట్టుకుంటూ బయటికి వెళ్ళిపోయింది కావ్య.

రెస్ట్‌రూమ్‌లో అద్దాలు, వాష్‌బేసిన్లకి ఎదురుగా రాతితో ఒక బల్లలా వేసుంటుంది. బాగ్స్ పెట్టుకోవటానికీ, కూర్చోవటానికీ వాడుతుంటారా బల్లని. కావ్య బయటికి వెళ్ళగానే ఆ ప్రదేశంలో కూలబడిపోయి పగలబడి నవ్వ సాగింది సీమ.

ఆమెకు అంతకుముందు రోజు హర్ష తనతో అన్న మాటలు గుర్తొస్తున్నాయి.

"కావ్యకి మెంటల్‌గా ఏదో ప్రాబ్లమ్ ఉన్నట్లుంది. అక్షయ్ కనబడకపోయే సరికి ఇలా తయారయిందో ఏమో అర్థం కావటం లేదు. ఈ మధ్య నన్ను వెంబడిస్తోంది. ఇదివరకు చక్కగా మాట్లాడేది. ఇప్పుడు కొట్టినట్లు మాట్లాడుతోంది. కొంచెం పిచ్చన్నా ఎక్కి ఉండాలి. లేదా అక్షయ్ కనబడేదేమోనని నా వెంటన్నా పడుతుండి ఉండాలి!" మొహం ముటముటలాడుతోంది అతనికి.





## రకూల్ ఏంటి అంత మాటనేసింది?

*రకూల్‌ప్రీత్‌సింగ్ చాలా మంచి అమ్మాయి. బాగా సర్దుకుపోతుంది. అందరితో బాగా మాట్లాడుతుంది. ఆమెతో సినిమా చేయడం చాలా ఈజీ. ఇవీ.... రకూల్ పట్ల టాలీవుడ్ దర్శకనిర్మాతలు, హీరోల మాట! ఈ మాటలు విన్న వారెవరికైనా రకూల్‌ది ఎంత మంచిమనసో అనుకోకుండా ఉండలేరు. కానీ ఇప్పుడు రకూల్ మాటల్లో చాలా తేడా వచ్చేసింది అంటున్నారు సినీ జనాలు. ఇప్పటి వరకూ తను చేసిన సినిమాల్లో తనకు ఏమాత్రం ప్రాధాన్యం లేని పాత్రలే చేసిందట! ఇప్పుడు చేస్తున్న 'రా రండోయ్ వేడుక చూద్దాం' సినిమాలో హీరోకి సమానమైన పాత్ర లభించిందట! మామూలుగా ఏ హీరోయిన్ అయినా తను చేస్తున్న సినిమా హీరో లేదా దర్శకుడిని కాకాపట్టడానికి ఇలాంటి మాటలు చెబుతుంది. రకూల్‌కి ఆ అవసరం లేదు. ఆమె చేయలేను అంటున్నా ఆమె కోసం నెలల తరబడి వెయిట్ చేసే దర్శకనిర్మాతలు, హీరోలు చాలా మందే ఉన్నారు. ఇలాంటి సమయంలో అలాంటి మాటలు మాట్లాడింది అంటే.... ఇప్పటివరకూ తను చేసిన సినిమాల పట్ల రకూల్ అసంతృప్తిగా ఉన్నందు వలనే అంత మాట అంది అంటున్నారు.*

"ఇంత చపలచిత్తమైనదనుకోలేదు ఆ అమ్మాయి" చెప్తూనే ఉన్నాడు అతను.

సీమ నవ్వాపుకోవటం చూసి నిలదీశాడు హర్ష.

"ఏదో జరుగుతోంది. నీకు తెలుసు."

సీమకి చెప్పక తప్పలేదు.

ఒక్క నిమిషం నోట మాట రాలేదతనికి.

కళ్ళార్పకుండా నోరు తెరిచి ఆలోచిస్తున్నాడు.

"వ్వాట్? ఆమెకి ఏమైనా పిచ్చా? నైరాని నేను కిడ్నాప్ చేయటమేమిటి?" అరిచినట్లే అన్నాడు కాసేపటికి తేరుకుని.

"ఎవరో ఆన్‌లైన్ డిటెక్టివ్ ఇచ్చిన సమాచారం అట" చెప్పింది సీమ.

"నాన్సెన్స్. అక్షయ్ వింటే ఏమనుకుంటాడు నా గురించి?" ఆందోళనగా ఉంది హర్ష గొంతు.

"ఏమనుకుంటాడు? కావ్యనే చెడామడా తిట్టాడట నిన్ను అనుమానించినందుకు" అంది సీమ.

"హి ఈజ్ మై బడ్డీ" గర్వంగా గొణిగాడు హర్ష.

***

బ్రహ్మీ, కావ్యని వెతుక్కుంటూ వచ్చాడు.

ఆ టైమ్‌కి ఆమె వేరే ప్రాజెక్ట్ మీటింగ్‌లో ఉంది.

అర్జంట్ పని అని ఆ మీటింగ్ హోస్ట్ చేస్తున్న ప్రాజెక్ట్ మేనేజర్‌కి చెప్పి వేరే కాన్ఫరెన్స్ రూమ్‌కి తీసుకెళ్ళాడు.

"ఏమిటిసార్? నా కోడ్‌లో బగ్స్ ఉన్నాయా?" ఆందోళనగా అడిగింది కావ్య.

"కాదు. నువ్వు పంపిన మెసేజ్ గురించి డిస్కస్ చేద్దామని పిలిచాను."

"ఓ..... అదా? హర్ష కాదంట" కులాసాగా కాళ్ళూపుతూ చెప్పింది కావ్య.

"లేదు కావ్యా! వీడే అయ్యుంటాడు. ఇంత తెలివైనవాళ్ళే సైకోలుగా ఉంటారు. ఇన్ని సినిమాల్లో చూశాను" తన జుట్టు పట్టుకుని చూపించబోయాడు. బట్టతల తగిలింది. దొంగచూపు చూసి ఊరుకున్నాడు.

"అయ్యో... కాదంట సర్! అతను టైమ్‌జోన్ వల్ల కన్‌ఫ్యూజ్ అయి తప్పు ఇన్‌ఫర్మేషన్ ఇచ్చాడట."

"ఊరుకోవమ్మా! ఎవరేది చెప్తే అది నమ్మేస్తావు. ఖచ్చితంగా వాడే!" నమ్మడానికి ఒప్పుకోవటం లేదు బ్రహ్మీ.

"మెయిల్ ఉంది, చూపిస్తానుండండి" ఓపెన్ చేసి చూపించింది కావ్య.

మొత్తం చదివాక అన్నాడు బ్రహ్మీ.

"అదీ సంగతి. నాకు మొత్తం అర్థమైంది."

ప్రశ్నార్థకంగా చూస్తోంది కావ్య.

"నీ మెయిల్ హాక్‌చేసి ఉంటాడు హర్ష. అందులో ఈ డిటెక్టివ్‌తో జరిపిన మెయిల్ సంభాషణలు కనబడి ఉంటాయి. తర్వాత ఆ డిటెక్టివ్ మెయిల్ హాక్‌చేసి అందులో నుంచీ నీకు ఈ మెయిల్స్ పంపి ఉంటాడు" అపారమైన ఆత్మవిశ్వాసం అతని గొంతులో.

కావ్య మళ్ళీ కన్‌ఫ్యూజన్‌లో పడింది.

కాసేపు ఆలోచించి తల విదిల్చింది.

"ఎవరేది చెప్తే అది కరెక్టనిపిస్తుందేమిటి తనకి?" లేదు.. లేదు.. హర్ష అయి ఉండడు. ఎవరో ఒకరి మాట నమ్మాల్సి వచ్చినప్పుడు అక్షయ్ మాట నమ్మటం ఉత్తమం!"

"ఏమో మరి. అయినా నాకెందుకులెండి. నేనింక కల్పించుకోదలుచుకోలేదు" డిప్లొమేటిక్‌గా చెప్పి తప్పించుకుంది.

మనం అమాయకులమనే చాలామందిలో ఇటువంటి డిప్లొమసీ బీభత్సంగా కనబడుతుంది, కొంచెం జాగ్రత్తగా పరిశీలిస్తే.

"నేను మాత్రం హర్షని వదలను" పిడికిళ్ళు బిగించి అన్నాడు బ్రహ్మీ. అతని కళ్ళు మెరుస్తున్నాయి.

***

నిద్ర లేచేసరికి హర్ష ఫోన్‌లో గులాబీరంగు లైట్ వెలుగుతూ ఆరుతూ కనిపిస్తోంది. బాగా నిద్ర పట్టిందేమో రింగ్‌టోన్ వినపడలేదు.

"మన పిల్లలు ఏవరేజ్‌గా ఉంటే ఫర్వాలేదు కానీ అచ్చు గుద్దినట్లు నీ తెలివితేటలు మాత్రం రావాలి."

నవ్వుకుంటూ దిండులో తలదాచుకున్నాడు హర్ష.

***

శనివారం పొద్దున తొమ్మిదవుతోంది.

ఆఫీస్ నుంచి బస్ లియోనియా రిసార్ట్‌కి బయల్దేరింది. కార్స్‌లో వచ్చేవాళ్ళు కొందరు ఇళ్ళ నుంచి డైరెక్ట్‌గా వస్తామంటే, మరికొందరు ఆఫీస్‌కి వచ్చి ఫ్రెండ్స్‌ని తమతో వెంట తీసుకెళ్ళారు. మిగిలిన వాళ్ళంతా బస్‌లో వెళ్తున్నారు.

తిట్టుకుంటూ ఆఖరు నిమిషంలో వచ్చి బస్ ఎక్కింది కావ్య.

సెలవు రోజుల్లోనూ ఈ చెత్త ఆఫీస్ మొహాలను చూడాలా? రానంటే అదొక తప్పన్నట్లు, తనొక యాంటీ సోషల్ ఎలిమెంట్ అన్నట్లు మాట్లాడతారు.

చిరాగ్గా ఉందామెకి.

ఆఫీస్‌లో ఫన్ ఈవెంట్స్‌గా చెప్పుకోబడే కొన్ని కార్యక్రమాలు కొంతమందికి సంతోషాన్నిస్తే, మరి కొందరికి తీవ్రమైన ఒత్తిడిగా పరిణమిస్తాయి. కొందరు ఇంట్రావర్ట్స్ ఉంటారు. ఇంకొందరికి ఫన్ లేదా రిలాక్సేషన్ అంటే కాఫీ తాగుతూ బుక్ చదువుకోవటం మాత్రమే అవచ్చు. మరికొందరు అందరి కంపెనీని భరించలేకపోవచ్చు. తమకు కంఫర్టబుల్‌గా ఫీలయ్యే మిత్రులతో మాత్రమే గడపాలనుకోవచ్చు.

ఒకరినొకరు తెలుసుకోవాలనీ, నెట్‌వర్కింగ్ అనీ రకరకాల కారణాలతో అందరూ వచ్చేవరకూ వేపుకు తిన్నాడు రాజేష్.

'బండ వెధవ', 'పంది' 'కుక్క' తిట్టుకుంటూనే ఉంది కావ్య.

బోలెడంత పని పెండింగ్ ఉండిపోయింది.

ఇప్పుడిటు వెళ్తే మళ్ళీ ఆదివారం రాత్రంతా కూర్చొని పని పూర్తిచేసుకోవాలి.




రోహిణి, సీమ బస్‌లో కనబడ్డారు.

రోహిణితో మాటల్లో పడింది కావ్య.

అప్పుడే వేసవి మొదలైంది.

విండో ఓపెన్ చేస్తే వేడిగాలి లోపలికొస్తోంది.

మూసి ఉన్న విండోని చూస్తూ ఏదో ఆలోచిస్తోంది సీమ.

మాటల మధ్యలో సీమ వైపు చూసింది కావ్య. ఎటు చూస్తోందో అర్థం కాలేదు. నల్ల కిటికీ వైపు చూడటానికి ఏముంటుంది? సైడ్ ఆంగిల్‌లో తీర్చి దిద్దినట్లున్న కనుముక్కు తీరు కనబడుతోంది.

డార్క్‌బ్లూ స్లిమ్ ఫిట్‌జీన్స్, తెల్లటి టీ షర్ట్ వేసింది. నల్లటి శాండల్స్ వేసుకున్న పాదాల చివరన బ్లూ కలర్ నెయిల్ పెయింట్ కనబడుతోంది. బొటన వేలి పక్క వేలుకి ఉన్న గోరుకి తెలుపు రంగు వేసింది, రెండు కాళ్ళకీ.. బ్లూ జీన్స్, వైట్‌షర్ట్‌కి మాచింగ్ కావచ్చు. పొద్దున లేచి ఇంత తయారవటానికి ఎంత ఓపికో! లేకపోతే నిద్ర పోయేప్పుడు పనివాళ్ళెవరన్నా వేస్తారా?

ఈ కంపెనీలో జాయిన్ అయిన కొత్తల్లో ఒక అమ్మాయి ఇలాగే గ్రే కలర్ మాచింగ్ నెయిల్ పెయింట్ వేసుకుంటే గోళ్ళు పుచ్చిపోయాయేమో అని తననుకోవటం, అంతా తనని ఎగతాళి చేసి నవ్వటం గుర్తొచ్చింది.

మోచేయి మడిచి అరచేతిలో తల ఆనించి ఉంది సీమ.

పెద్ద గుండ్రటి డయల్ ఉన్న 'ఎస్ప్రీ' వాచ్ ఆమె చేతికి మరింత అందాన్నిస్తోంది. గాలికి ఊగుతోన్న పట్టులాంటి జుట్టు.

ఏం ఆలోచిస్తోందబ్బా ఈ సీమ?

అక్షయ్ గురించా?

అంతే! ఆ ఆలోచనకే మొహం మాడిపోయింది కావ్యకు. అప్పటివరకూ సంతోషంగా మాట్లాడుతున్న కావ్య అంతలోనే సడన్‌గా సీరియస్‌గా కొంపలు మునిగినట్లు మొహం పెట్టటం చూసి రోహిణి తల కొట్టుకుంది.

విసుక్కుంటూ రోహిణి అక్కణ్ణుంచీ లేచి వెళ్ళి సీమతో కబుర్లేసుకుంది.

గంటన్నర తర్వాత బస్ లియోనియా ముందు ఆగింది.

అప్పటికే కార్లలో వెళ్ళిన వాళ్ళు చేరుకున్నట్లున్నారు. ఎదురొచ్చి పలకరిస్తున్నారు.

రూమ్స్ రిజిస్ట్రేషన్ ఒక పక్క జరుగుతుండగా మరోపక్క వెల్‌కమ్ డ్రింక్స్ అందిస్తున్నారు రిసార్ట్ సిబ్బంది.

వెకిలిగా నవ్వుతున్నాడు రాజేష్. 'రప్పించాను చూశావా?' అన్న గర్వం కనబడుతోంది. జుట్టు పట్టుకుని లాగి అక్కడున్న పెద్ద ఇనప సింహపు ఆకారానికి వేసి అతని తల పగల గొట్టాలనిపించింది కావ్యకి.

కీస్ తీసుకుని చెకిన్ చేయటానికి ఎలివేటర్‌లో వెళ్తుండగా కావ్య చేయి పట్టుకుంది సీమ.

మృదువుగా, వెన్నలా ఉందామె చేయి.

కావ్య ఆశ్చర్యంగా చూస్తుండగా కీస్ మార్చేసిందామె. లిఫ్ట్‌లో ఉన్న వాళ్ళందరి రూమ్స్ మారిపోయాయి.

భుజాలెగరేశారు అంతా.

పెద్దగా పట్టించుకోలేదు ఎవరూ.

ఎటూ అందరికీ ఒకేలాంటి రూమ్స్. ఏ రాయైతేనేం పళ్ళు రాలగొట్టు కోవటానికి అనుకున్నారేమో!

చెకిన్ చేసి లంచ్ అయ్యాక కాసేపు విశ్రాంతి తీసుకున్నాక నాలుగింటికి అందరూ స్పోర్ట్స్ దగ్గర కలవదల్చుకున్నారు.

***

అవుటింగ్‌కి వచ్చిన వాళ్ళంతా రెండు గ్రూపులుగా ఏర్పడి క్రికెట్‌కి సిద్ధపడ్డారు.

రెండు టీమ్స్‌లోనూ చెరో ఇద్దరు ఆడవాళ్ళుండేలా టీమ్‌లు ఫామ్ చేశారు. చాలామంది అమ్మాయిలు ప్రెగ్నెంట్ అనీ, కాలు విరిగిందనీ, మోకాళ్ళనొప్పనీ చెప్పి తప్పించుకున్నారు. ఎండలో ఆడితే నల్లబడతారు కాబట్టే ఆడకుండా సాకులు చెప్పారని, ప్రెగ్నెంట్ అని చెప్పుకున్న వాళ్ళలో కొందరికి పెళ్ళికూడా కాలేదని కావ్యకి అనుమానం.

ఒక టీమ్‌కి రాజేష్ కెప్టెన్ కాగా మరొక టీమ్‌కి బ్రహ్మి కెప్టెన్.

జీవితంలో ఒక్కసారయినా క్రికెట్ బాట్ పట్టుకోలేదని నెత్తీ నోరూ కొట్టుకున్నా కావ్య గోడెవరూ పట్టించుకోలేదు. కొంతలో కొంత బెటర్ ఆమె బ్రహ్మి టీమ్‌లో ఉంటాననడం.

క్రికెట్ నేర్పే వంకన చేతులు పట్టుకుని నేర్పొచ్చని ప్లాన్ చేసిన రాజేష్ ఖంగు తిన్నాడు.

ఆడవాళ్ళకి ఆటరాదు కాబట్టి మూడుసార్లు అవుటవ్వచ్చట. ఇదేం టార్చరో కావ్యకి అర్థం కాలేదు. రాదన్నప్పుడు తమని ఎందుకు బలవంతంగా ఆడిస్తున్నారో మరి.

ఆట రానివాళ్ళంతా బ్రహ్మి టీమ్‌లో పడ్డారు.




## గత చిత్రం

ఖాళీ గొట్టం లాంటి వర్తమానంలో
విధిగా కదులుతున్న చీకటి జీవితం
కంఠానికి బిగుసుకోని ఉరిలాంటి లేమి.
వేలాడే కొక్కెం మా నాన్న
నన్నాతడు పట్టుకున్నాడో

నేనతణ్ని పట్టుకున్నానో
ఒకే ఒక్క ఆధారం అతడు.
తాను అస్తమిస్తూ
ఉదయిస్తున్న నాలో
కాంతిపుంజం అయ్యాడు.
గొంగళి పురుగుపై రెక్కలకోసమే
అతని ధ్యాసంతా.
చేతులు కాల్చుకుంటేగాని
అన్నం దొరకని దైన్యం.
ఒక్క రూపాయికోసం ఎన్ని తాకట్లో
మరెన్ని తలవంపులో...
అది ముద్దగా మారడానికి అన్ని ఇక్కట్లు
భావి ఓ ఎండమావి.
చెరువుల్లో వెనుకీత
పంట కాలువలో ఎదురీత
నూతుల్లో నిలువీత
తీసే నీటి చేపను.
చేనుగట్లపై కట్టు వదిలిన లేగనై
చెరుకు గడ్డిలో ఎలుగునై
పచ్చని తోటల్లో పసిరికనై



ప్రకృతిమాత లాలనలో బాలుడినై
పల్లె నిద్రలోకి జారుతున్న వేళ
చెరువు గట్టుపై యువ సమ్మేళనం
గులకరాళ్ళ బొంతపై వెల్లకిలా పడుకొని,
దోస్తుల గోష్టిలో పరవశించి
వెన్నెలను తాగుతున్న ఆనందం,
నేటికీ లోలోనికి జారుతున్న మకరందం
నలభై వసంతాల కిందటి రంగుల చిత్రం
ఇప్పటికీ చెరగని వెన్నెల స్వప్నం

*—గార రంగనాథం*

***సెల్: 98857 58123***

అతను మాత్రం తనకు కెప్టెన్సీ ఇచ్చిన ఆనందంలో ఉన్నాడు.

రాజేష్ టీమ్ డెబ్బై పరుగులు చేసింది.

బ్రహ్మీ టీమ్ గెలవాలంటే డెబ్బై ఒకటి చేయాలి.

వరసపెట్టి టపటపా అందరూ ఔటయిపోతున్నారు.

సీమ వంతొచ్చింది.

అప్పటికి స్కోర్ నాలుగు మాత్రమే!

సిక్సర్లు, బౌండరీలు కొడుతూ చెలరేగిపోతోందామె. ఆడవాళ్ళంతా చప్పట్లు కొడుతున్నారు. స్కోర్ అరవై దాటింది.

మిగిలిన వాళ్ళంతా ఔటయిపోయారు. కావ్య సీమకి తోడుగా ఫీల్డ్‌లోకి దిగింది. బాట్ ఎటువైపు నుంచి కొట్టాలో కూడా తెలీదామెకి.

గబగబా వచ్చి పడ్డాడు రాజేష్.

చేతులు పట్టుకుని చూపించాడు.

"ఒకసారి ప్రాక్టీస్ చేసి చూస్తాను" అని బాట్ గాల్లోకి విసిరింది.




ఫాట్‌మని రాజేష్ మోకాళ్ళ మీద పడిందది.

కింద కూర్చొని విలవిలలాడాడు.

"కావాలని చేయలేదు. సారీ!" బ్రతిమాలుతున్నట్లుగా ఉంది కావ్య గొంతు. ఏడుపే తక్కువ ఆమెకి. ఈ దెబ్బకి వీడు చచ్చిపోతే తనని జైల్లో పెడతారేమో!

రెండు సార్లు వికెట్స్‌కి బాల్ తగిలింది. ఇంకో ఛాన్స్ మిగిలింది కావ్యకి.

ఈసారి సీమ బాటింగ్ మొదలయింది.

ఈజీగా సిక్స్‌లు కొట్టేస్తుంది అనుకోసాగారు, అప్పటివరకూ ఆట చూసిన వాళ్ళు. కానీ ఆమె టార్గెట్ వేరే! బాల్ వేశాడు అవతల టీమ్‌లో వ్యక్తి.

గట్టిగా బాట్‌ని విసిరింది.

రాజేష్ కుప్పకూలాడు.

బాల్ సూటిగా వెళ్ళి అతనికి తగిలింది.

కొరకొరా చూస్తున్నాడు సీమ వైపు అంత బాధలోనూ.

"సారీ రాజేష్!" కళ్ళార్పుతూ అందామె.

"బాగా తగిలిందా?"

రాజేష్ టీమ్ విన్ అయిందని డిక్లేర్ చేసి, ఆ ఆటను ఆపేశారక్కడితో.

"ఖోఖో ఆడదామా" ఉత్సాహంగా అంది కావ్య.

"అబ్బా, చిన్నపిల్లలాడే ఆట... బోర్" అన్నారొకళ్ళు.

కొందరు ఆడటానికి రెడీ అయ్యారు.

"రాజేష్‌కి తగలరాని చోట తగిలినట్లుంది. ఇప్పుడే ఆడలేడనుకుంటా" ఓరగా చూస్తూ అంది సీమ.

"అయామ్ ఫైన్... లెట్స్ ప్లే!" రోషంగా అన్నాడు రాజేష్.

రెండు టీమ్స్ ఫామ్ అయ్యాయి మళ్ళీ.

ఈసారి రాజేష్ టీమ్‌లో ఉంది సీమ.

బతికిపోయాననుకున్నాడతను లోలోపల.

రాజేష్ టీమ్ కూర్చుని ఉన్నారు అటొకరు, ఇటొకరుగా.

అవతల టీమ్ నుంచి ఇద్దరు వచ్చారు.

రాజేష్ పరిగెత్తే పరిస్థితిలో లేడు కాబట్టి బెస్ట్ బెట్‌గా భావించి సీమని రంగంలోకి దింపారు.

రెండో టీమ్‌లో వాళ్ళు పరిగెత్తుతుండగా తమ వాళ్ళలో ఎవరికి పట్టుకోగలిగేంత దగ్గరగా ఉన్నారో చూసుకుని వాళ్ళని తట్టాలి. అప్పుడు వాళ్ళు లేచి రెండో టీమ్‌లోని వాళ్ళని పట్టుకునే ప్రయత్నం చేస్తారు.

వరసలో కూర్చుని రెస్ట్ తీసుకుంటున్నాడు రాజేష్.

సడన్‌గా ఎగిరి రెండు పల్టీలు కొట్టాడతను.

అయోమయంగా వెనక్కి చూశాడు.

సీమ తనని తట్టి చెప్పవలసింది, తన్ని చెప్పినట్లుంది.

ఎక్కడ కొట్టి ఉంటుందో అర్థం కావట్లేదతనికి.

తల వెనక, నడుము మీద అంతా నొప్పిగా ఉంది, రోకలిబండ తీసి కొట్టినట్లు. చాలామంది నవ్వాపుకోవటం కనబడుతోంది.

లోపల ఇంతమందికి ద్వేషం ఉందా తన మీద? మరి ఆఫీస్‌లో తీయగా మాట్లాడతారేమిటి?

"సీమా! చెప్తా నీ సంగతి. బక్కదానికి ఇంత బలం ఉందేమిటో!" పళ్ళు పటపట కొరికాడు.

పెద్దగా పట్టించుకోనట్లు ఆటలో మునిగిపోయి ఉంది సీమ.

***

రోడ్ పక్కగా నడుస్తున్నాడు అక్షయ్.

రెండువైపులా జాగ్రత్తగా పరిశీలిస్తున్నాడు.

అప్పుడే నైరా కనబడక రెండు నెలలవుతోంది.

ఎలా ఉందో? ఏ పరిస్థితిలో ఉందో?

తనకెప్పటికయినా కనబడుతుందా?

అసలు బ్రతికి ఉండి ఉంటుందా?

ఆగిపోయాడతను.

పొట్టలో ఏదో మెలితిప్పుతున్న భావన.

ఇంత చేతకాని వాడైపోయాడేమిటి తను?

"అక్కా! నైరాని జాగ్రత్తగా చూసుకోలేకపోయాను. నువ్వు నాకు అప్పజెప్పిన ఒకే ఒక బాధ్యతను నెరవేర్చలేకపోయాను."

"నైరా, ఎలా ఉన్నావు? ఎక్కడున్నావు? అక్కీ మామ ఏమీ చేయలేదు, నాకోసం రాలేదను కుంటున్నావు కదా? చాలా ప్రయత్నించాను. ఫెయిల్ అవుతున్నాను."

మనసులోనే వాళ్ళతో మాట్లాడుతున్నాడు.

కళ్ళలో నుంచి నీళ్ళు కారుతున్నాయతనికి.

నడుస్తున్నాడు.

ఎవరో పరిగెత్తుకొస్తున్న శబ్దం...

చిన్న పాప... పదేళ్లుంటాయి.

పరిగెత్తుకొచ్చి గట్టిగా పట్టుకుంది అతన్ని.

వెనక ఎవరో తరుముతున్నట్లుగా, వేటకుక్కల్లా పరిగెత్తుకొస్తున్నారు.

***

పొద్దునే తలుపు తోసుకుని లోపలికొచ్చాడు శ్రీకాంత్.

"ఏమైనా ఇన్‌ఫర్మేషన్ దొరికిందా?" అడిగాడు అక్షయ్ అతణ్ణి చూడగానే.

శ్రీకాంత్ వెనక నుండి సీఐ, ఇద్దరు పోలీసులు లోపలికి అడుగుపెట్టారు.

"ఏమైంది? అంతా ఓకేనా?" అడుగుతున్నాడు అక్షయ్.

"స్టేషన్‌కి పద" కర్కశంగా ఉంది సీఐ గొంతు.

"ఎందుకు? నైరా గురించి ఏమైనా తెలిసిందా?" బలహీనంగా ధ్వనిస్తోంది అక్షయ్ గొంతు. ఏదో కీడు శంకిస్తోందతని మనస్సు.

"నడు బే. డబ్బుల కోసం నువ్వే ఆ చిన్నపిల్లని చంపేసి మాకందరికీ కహానీలు చెప్తున్నావా?" అన్నాడు సీఐ.

శ్రీకాంత్ నిస్సహాయంగా చూస్తున్నాడు.

"వాట్ నాన్సెన్స్..." మాట్లాడుతున్నాడు అక్షయ్.

"వీడు మామూలుగా రాడు. బేడీలు పడాల్సిందే" పోలీసుల వైపు చూశాడు సీఐ.

చేతులకు బేడీలు వేశారు.

ఈడ్చుకుంటూ తీసుకెళ్ళి జీప్ ఎక్కించారు.

పోలీస్‌స్టేషన్ దిశగా దూసుకెళ్తోంది జీప్.

***(ఇంకా వుంది)***






## తల్లి గర్భంలోనే గ్రహిస్తారు

పిల్లలు తల్లి గర్భంలో ఉండగానే రుచులు, వినికిడి, శబ్దాలు గ్రహిస్తారు అన్న విషయం క్వీన్ యూనివర్సిటీ పరిశోధకులు నిర్వహించిన ఓ అధ్యయనంలో వెల్లడైంది. కొంతమంది గర్భిణుల మీద వీరు అధ్యయనం నిర్వహించారు. కొందరు గర్భవతులకు రోజూ క్రమం తప్పకుండా వెల్లుల్లిని ఆహారంలో కలిపి ఇచ్చారు. వీరి ప్రసవం అయిన తరువాత పిల్లల ఆహారపు అలవాట్లను వీరు పరిశీలించారు. ఈ పిల్లలు వెల్లుల్లి వాసన కలిగిన ఆహారాన్ని ఇష్టపడడాన్ని గమనించారు. అలాగే మరి కొందరు గర్భవతులను రెండు గ్రూపులుగా విభజించి ఒక గ్రూపు మహిళలకు ప్రతిరోజూ క్రమం తప్పకుండా జోలపాట వినిపించారు. ప్రసవం అయిన తరువాత రెండు గ్రూపుల పిల్లలను వీరు పరిశీలించారు. జోలపాట వినిపించిన తల్లులకు పుట్టిన పిల్లలు ఆ పాటలకు ప్రతిస్పందించగా, రెండో గ్రూపు మహిళలకు జన్మించిన శిశువులలో జోలపాటకు ఎలాంటి ప్రతిస్పందనను గుర్తించలేదు. గర్భవతిగా ఉన్న సమయంలో తల్లి తీసుకునే ఆహారం, జాగ్రత్తల మీదే శిశువు ఆరోగ్యం ఆధారపడి ఉంటుందని వీరు స్పష్టం చేస్తున్నారు.

## వేడి ఆవిర్లు ప్రమాదమే?

ఒక్కసారిగా శరీరం అంతా వేడిగా అయిపోవడం, వేడి ఆవిర్లు బయటకు రావడం లాంటి అనుభవాలు చాలామంది స్త్రీలు అప్పుడప్పుడు ఎదుర్కొంటూనే ఉంటారు. ముఖ్యంగా రుతుక్రమం ఆగిపోయే వయస్సులో ఉన్న స్త్రీలకు ఇది సర్వసాధారణం. వేడి ఆవిర్లు రావడం సాధారణమే అయినా కొన్నిసార్లు ఇది గుండెజబ్బులకు సంకేతం కావచ్చు అంటున్నారు అమెరికా పరిశోధకులు. 40 నుంచి 60 సంవత్సరాల వయస్సున్న సుమారు 300 మంది స్త్రీల మీద వీరు అధ్యయనం నిర్వహించారు. వీరిలో దాదాపు 70 శాతం మందిలో వేడి ఆవిర్లు బయటకొస్తున్న విషయాన్ని వీరు గుర్తించారు. అదే సమయంలో వీరి ఆరోగ్యాన్ని పరిశీలించగా 30 శాతం మందిలో శరీర తత్వాన్ని బట్టి వేడి ఆవిర్లు బయటకొస్తుండగా, మిగతా వారిలో వేడి ఆవిర్లకు, ఎండోథీలియల్ (endothelial)కణాల పనితీరుకు సంబంధం ఉందన్న విషయం గమనించారు. ఈ కణాల పనితీరుకు గుండెజబ్బులకు సంబంధం ఉంటుందని పరిశోధకులు చెబుతున్నారు. వేడి ఆవిర్లను గుండెజబ్బులకు సంకేతాలుగా పరిగణించవచ్చు అన్న విషయాన్ని మాత్రం వీరు స్పష్టం చేయలేదు. తరచూ వేడి ఆవిర్లు వస్తున్న వారు గుండె ఆరోగ్యం విషయంలో ఓ కన్నేసి ఉంచాలని వీరు చెబుతున్నారు.



## ఆయుష్షు పెంచే గంట పరుగు!

ఏ పని చేసినా, ఏం తిన్నా ఆరోగ్యం కోసమే! నిండు నూరేళ్ళు ఆరోగ్యంగా జీవించాలని అందరూ కోరుకుంటారు. చాలామంది విషయంలో ఇది తీరని కోరికే అవుతోంది. అలా కాకుండా ఉండాలంటే వారం మొత్తంలో గంట నుంచి రెండు గంటల వరకూ పరిగెడితే ఆరోగ్యవంతమైన జీవితం గడపవచ్చు అంటున్నారు పరిశోధకులు. మనిషి ఆరోగ్యంగా జీవించడానికి వాకింగ్, రన్నింగ్ సహకరిస్తాయన్న విషయం తెలిసిందే! వాకింగ్ కన్నా రన్నింగ్ అనేది వ్యక్తుల జీవితకాలాన్ని పెంచుతుందని పరిశోధకులు చెబుతున్నారు. సుమారు ఐదు లక్షల మంది మీద వీరు దీర్ఘకాలం అధ్యయనం నిర్వహించారు. వీరిలో చాలా మందికి నడక, పరుగు వంటివి అలవాటు లేవు. వీరు తీవ్రమైన అనారోగ్య సమస్యలతో బాధపడుతూ మరణించడం గమనించారు. అయితే నడక, పరుగు ఉన్నవారు మాత్రం ఆరోగ్యవంతమైన జీవితం గడపడం పరిశోధకుల దృష్టికి వచ్చింది. నడక కన్నా పరుగు చాలా మంచిదని వీరు సూచిస్తున్నారు. వేగంగా పరుగెడుతున్నారా? లేక నెమ్మదిగా పరుగెడుతున్నారా? అన్నది ప్రశ్న కాదనీ, ఎలా పరుగెత్తినా వారం మొత్తంలో కనీసం గంట నుంచి రెండు గంటలు పరుగెడితే మంచిదనీ వీరు స్పష్టం చేస్తున్నారు.



## ఆలివ్ ఆయిల్‌తో గుండెజబ్బులకు చెక్!

రోజువారీ వంటలలో ఆలివ్ ఆయిల్ ఉపయోగించడం వలన కలిగే లాభాల గురించి తెలిసిందే! స్పెయిన్ పరిశోధకులు నిర్వహించిన పరిశోధనలో దీనిగురించి మరో ఆసక్తికరమైన అంశం వెలుగుచూసింది. ఈ నూనెను వంటలలో వాడడం వలన రక్తసరఫరా మెరుగుపడడంతో పాటు రక్తనాళాలలో గడ్డలను అరికడుతుందని, రక్తంలో చెడు కొలెస్ట్రాల్‌ను తగ్గించి మంచి కొలెస్ట్రాల్‌ను పెంచుతుందన్న విషయం వెల్లడైంది. 66 సంవత్సరాల వయస్సు కలిగిన కొందరు వృద్ధుల మీద వీరు పరిశోధన నిర్వహించారు. వీరిని రెండు గ్రూపులుగా విభజించి ఒక గ్రూపు వారికి క్రమం తప్పకుండా ఆహారంలో ఆలివ్ ఆయిల్‌ను అందించారు. రెండో గ్రూపు వారికి మామూలు నూనెలతో చేసిన ఆహారాన్ని ఇచ్చారు. అనంతరం వీరి ఆరోగ్యాన్ని పరిశీలించగా, మామూలు నూనెలతో చేసిన ఆహారం తీసుకున్న వారిలో రక్తప్రసరణలో మార్పులు, రక్తనాళాలలో గడ్డలు, చెడు కొలెస్ట్రాల్‌ను గుర్తించారు. ఆలివ్ ఆయిల్‌తో చేసిన ఆహారాన్ని తీసుకున్న వారిలో మంచి కొలెస్ట్రాల్ పెరగడాన్ని గమనించారు. అయితే ఆలివ్ ఆయిల్‌ను ఆహారపదార్థాలలో వాడే ముందు నిపుణుల సలహా తీసుకోవడం మంచిదని వీరు సూచిస్తున్నారు.



—అవినాష్

# మాస్టారు

-షేక్ అహమద్ బాష

**ఆదివారం సాయంత్రం నాలుగుగంటలవుతోంది. మా అబ్బాయి బయటకు వెళ్ళేందుకు తయారవుతున్నాడు. అతను ఎం.ఎస్.సి. చదివిన తర్వాత గత మూడు సంవత్సరాలుగా పిహెచ్‌డి చేస్తున్నాడు. ప్రతి ఆదివారం ఈ తంతు మామూలే.**

**"పార్టీ కేనా" అయిష్టంగానే అడిగాను. తప్పదు అన్నట్లు చిరునవ్వుతో తలాడించాడు. అతనికి వచ్చే స్కాలర్‌షిప్ దీనికే సరిపోతుంది.**

ప్రతి ఆదివారం అతని గైడ్, మరికొంతమంది ప్రొఫెసర్లు రీసెర్చ్‌లో పాల్గొనే విద్యార్థులతో తప్పని సరిగా పార్టీ ఉంటుంది. ఆ ఖర్చులన్నీ రీసెర్చ్ స్కాలర్లే భరించాలి. అందులో పాల్గొని డబ్బు ఖర్చు చేస్తే కానీ వారి సహకారం వీరికి లభించదు. మా అబ్బాయికి మద్యపానం అలవాటులేదు. కానీ పార్టీకి పోకపోతే అతని రీసెర్చ్‌కే మోసం వస్తుంది. అందుకే తప్పకుండా వెళతాడు, ఖర్చుకూడా భరిస్తాడు. ఎక్కడ ఈ అల వాటు చేసుకుంటాడో అనే భయంతో ఒక రోజు ప్రశ్నించాను. అప్పుడు చెప్పాడు. "లేదు నాన్నా, నాకు మద్యం వాసన అసలు పడదు. కానీ సార్ కోసం అలా నటిస్తాను. నేను నా గ్లాస్‌లో కేవలం కోక్ వేసుకుంటాను. తాగినట్లు నటిస్తాను. కాక పోతే వారందరూ మద్యం మత్తులో ఉన్న ప్పుడు నేను మాత్రం ఫుల్‌గా తినేసి బయట పడతాను. రాత్రి వచ్చినప్పుడు అనేకమార్లు పరిశీలించాను. అతని వద్ద వాసనకానీ, అతని ప్రవర్తన కానీ నాకు ఎప్పుడూ అనుమానం కలిగించలేదు. నాకు ఈ పద్ధతిపైన కోపం ఉన్నా ఏమీ చేయ లేని స్థితి.

ఒకరోజు స్కూటర్‌లో పోతున్న నాకు, గాంధీరోడ్‌లో ఒక వ్యక్తి నడక వెనకనుంచి సుపరిచితంగా అనిపిం చింది. చాలా రద్దీగా ఉంది గనుక ఆ వ్యక్తిని దాటుతూ చూసేందుకు వీలు కాలేదు. కాస్త దూరం వెళ్ళి ఆగి వెనక్కు తిరిగి చూశాను. ఆశ్చర్యం, ఆనందం ఒకే సారి కలిగాయి. ఆయన మా క్రిష్ణారావు మాస్టారు. మిడిల్ స్కూల్‌లో ఆరవ తరగతి నుంచి ఎనిమిదవ తరగతి వరకు ఆయన మాకు సైన్స్ మాస్టారు. ఆయన క్లాస్ అంటేనే ఎంతో ఇష్టం. కారణం ఆయన మాతో మెలిగేతీరు, పాఠం చెప్పే విధానం ఎంతో ప్రత్యేకం. సైన్స్‌పాఠం ఆయన బోధిస్తే మరోసారి చద వాల్సిన పని ఉండదు. మాతో సరదాగా ఉండేవారు. ఆయన ప్రతి ఒక్కడినీ పేరుతో పిలవడం మాలో ఎంతో సంతోషం కలగజేసేది.




ఆయన చిన్నగా వస్తున్నారు. జనం ఎక్కువగా ఉన్నందువల్ల జాగ్రత్తగా అడుగులో అడుగు వేస్తు న్నారు. ఆయన క్రాపు చాలా తమాషాగా ఒక అలలా పైకి లేచి ఉండేది. ఇప్పుడు కూడా ఆ అల అలాగే ఉంది కానీ అది ఒక తెల్లరంగు అల. పాత రోజుల్లోని ప్యాంటు, స్లాక్‌షర్టు వేసుకుని ఉన్నారు. ఆయన నన్ను గుర్తించలేదు. నా స్కూటర్ దాటు కుంటూ పోతుంటే "నమస్కారం సార్" అన్నాను. వెంటనే ఆయన ఆగి నన్ను చూశారు. "నేను మాస్టారూ, బాలను" అన్నాను. "ఒరే నువ్వట్రా బాల సుబ్రమణ్యం, ఎన్నిరోజుల తర్వాత చూస్తున్నా. లావు అయిపోయావు. పైగా ఆ బట్ట తల ఏమిట్రా" అంటూ ఎంతో సంతోషంగా పలకరిస్తూ నా బట్ట తలపై వేళ్ళతో చిన్నగా తట్టారు. నేను శ్రీకాళహస్తిలో డిగ్రీ చేస్తున్నప్పుడు కూడా ఆయన్ను అప్పుడప్పుడు కలిసేవాడిని. ఆ తర్వాత ఉద్యోగార్థం శ్రీకాళహస్తి నుండి వచ్చేశాక దాదాపు 30 సంవత్సరాల తర్వాత ఇదే కలవడం. ఇన్నిరోజుల తర్వాత కూడా ఆయనకు నా పూర్తి పేరు గుర్తు ఉండడం ఆయన వాత్సల్యా నికి ప్రతీక.

"ఎక్కడ ఉండావు, ఏమీ చేస్తున్నావయ్యా" అని విచారించారు. నన్ను 'రా' నుండి 'అయ్యా' చేసి మాట్లా డడం ఆయన నా వయస్సుకు ఇస్తున్న గౌరవం. కానీ మనసులో ఒక కొరత 'ఒరే' అంటేనే బాగుండేది.

"సార్, నేను రైల్వేలో స్టేషన్‌మాస్టర్‌గా పని చేస్తు న్నాను. ఈ మధ్యే ఇక్కడికి బదిలీపై వచ్చాను" విన యంగా చెప్తూ ఆయన గురించి విచారించాను. ఆరో గ్యంగానే ఉన్నానని, కొడుకు పక్క ఊర్లో బ్యాంక్ ఆఫీ సర్‌గా ఉన్నాడని, అతని వద్దే ఉంటున్నాననీ చెప్పారు ఆయన.

'పెన్షన్ తీసుకునేందుకు స్టేట్‌బ్యాంక్‌కు వెళుతు న్నాను" అన్నారు.

"కూర్చోండి సార్, మిమ్మల్ని నేను వదులుతాను. మీ పని అయిన తర్వాత అటే మా ఇంటికి పోదాం" అనునయంగా అన్నాను.

"నువ్వేదో పని మీద పోతున్నట్లున్నావు. మరో సారి వస్తాలే" అన్నారు మాస్టారు. నేను నిజంగానే

ఒక అర్జెంటు పని మీద ఉన్నాను. సరే ఆయన్ను మరోసారి ఇంటికి తీసికెళ్ళవచ్చు అనే ఆలోచనతో "సరేలెండి, కనీసం మిమ్మల్ని బ్యాంకు వద్ద డ్రాప్ చేసి వెళ్తాను. మరోసారి ఇంటికి వచ్చి కలుస్తాను" అంటూ ఆయన్ను స్కూటర్‌పై ఎక్కించుకున్నాను. వయస్సు మీద పడినందువల్ల స్కూటర్‌కు ఒకవైపే కూర్చోగలిగారు. నన్ను గట్టిగా పట్టుకున్నారు. ఆయన స్పర్శ నాలో ఒక వింత అనుభూతి. నా శరీరంలో అప్యాయతా తరంగాలు సృష్టించాయి. బ్యాంకువైపు వెళ్ళసాగాను. ఆయన పాత జ్ఞాపకాలు నాలో మెదిలాయి.

క్రిష్టారావుగారు సైన్సు పాఠం బోధించడానికే పుట్టారా అనిపించేది. ఆ రోజుల్లో మాకు ల్యాబ్‌లు ఉండేవి కావు. బోర్డుపై బొమ్మవేసి 'ఆక్సిజన్ తయారు చేయు విధానం' అని ఆయన వివరిస్తూ ఉంటే మాకు మరోసారి చదివే అవసరం వచ్చేదికాదు. ఓ రోజు జువాలజీ పాఠంలో పక్షులు గురించి చెబుతూ వాటి రెక్కల గురించి, అవి రూపాంతరం చెందిన విధం, వాటివల్ల అవి ఎలా ఎగురుతాయి, ఎలా వాతావరణం నుంచి తమను తాము రక్షించుకుంటాయి వివరిస్తూ "కొన్నింటికి రెక్కలు ఉండినా ప్రయోజనం లేదు. అవి ఎగరలేవు. ఉదాహరణకు కోడి, బాతు మొదలగునవి" అన్నారు. నా పక్కన చిన్నసుబ్బారెడ్డి అనే విద్యార్థికి కాస్తంత కొంటెతనం, హాస్యం ఎక్కువ. వెంటనే "ఎందుకు ప్రయోజనం లేదు సార్, ప్రయోజనం ఉంది" అన్నాడు.

"రేయ్, లేవరా, చెప్పు ఎగరలేని రెక్కలతో ఏం ప్రయోజనం" వాడిని లేపారు. వాడు లేస్తూ, "వాటిని కోసి ఫ్రై చేసుకుని తినవచ్చుసార్" అన్నాడు. క్లాసంతా నవ్వారు. మాస్టారికి కూడా నవ్వు వచ్చింది. కానీ ఆపుకుని గంభీరంగా వాడి దగ్గరకు వచ్చి చెవి మెలేసి "వెధవా, నేనొక బ్రాహ్మణుడిని, నా ఎదురుగానే కోడిని కోయడం, ఫ్రై చేసుకుని తినడం చేస్తావా" అన్నారు. వాడు నొప్పితో "సార్... సార్... సార్" అంటూ మెలికలు తిరిగాడు.

"వెధవా, కూర్చో... ఇకమీదట ఎప్పుడైనా నా ఎదుట ఇలా మాట్లాడితే నాలుక కోస్తా" అంటూ వెనుదిరిగారు.

"సార్ ఇది అన్యాయం" అన్నాడు చిన్నసుబ్బారెడ్డి.

ఆయన వాడివైపు తిరిగి "ఏదిరా అన్యాయం?" అంటూ అడిగారు.

"సార్ కోడిని కోస్తేనే చూడలేనివారు నా నాలుక ఎలా కోస్తారు" వాడి లాజిక్‌కి క్లాసంతా మరలా నవ్వులతో నిండిపోయింది. మాస్టారు కూడా గొంతు కలుపుతూ వాడిచేయి మెలిపెట్టి వీపుపై రెండు గుద్దులు గుద్దారు. ఆ దెబ్బల్లో నొప్పి ఉండదు, కేవలం ప్రేమ, వాత్సల్యం'. "ఈ తెలివి పరీక్షల్లో చూపించు" అన్నారు.

ఓరోజు క్రిష్టారావు మాస్టారు పాఠం చెబుతూ "ఒరే చిన్నోడా పెద్దోడు ఏం చేస్తున్నాడు" అంటూ చిన్నసుబ్బారెడ్డిని అడిగారు. వాడికి మొదట్లో అర్థం కాక "ఎవరు సార్" అంటూ లేచి నిలబడ్డాడు. మా ప్రాంతంలో ఇంట్లో ఒకే పేరు ఇద్దరికి పెడితే చిన్నవాడికి 'చిన్న' అని పేరుముందు పెట్టడం ఆనవాయితీ. అది తెలిసే మాస్టారు అడిగారు. "అదేరా, నువ్వు చిన్నసుబ్బారెడ్డి అయితే ఒక పెద్దసుబ్బారెడ్డి కూడా ఉండాలి కదా" అని. అది వింటూనే చిన్నసుబ్బారెడ్డి తలవంచేశాడు. కాస్సేపట్లో వెక్కివెక్కి ఏడ్వడం క్లాసులో అందరినీ ఆశ్చర్యపరిచింది. ఎప్పుడూ ఉల్లాసంగా జోకులేస్తూ తిరిగే వాడిలో అంత దుఃఖం ఉండడం చూచి విస్తుపోయాం. మాస్టారు కూడా

**ముప్ఫైఏళ్ళ క్రితం నాటి స్కూలు మాస్టారు బ్యాంక్ పనిమీద వెళుతూ దోవలో కనిపించారతనికి. ఎంతో ఆనందపడ్డాడతను. మరపురాని ఆయన ఆత్మీయత గుర్తు చేసుకున్నాడు. ఆయనతో కాసేపు గడిపి నేనూ మీతో వస్తా పదండి అన్నాడా శిష్యుడు. కానీ మాస్టారు తటపటాయించారు. బ్యాంక్‌లోకి వెళ్ళే ఉద్దేశం ఆయనలో కనిపించలేదు.. ఆయన అబద్ధం చెప్పారా? మరి ఈ శిష్యుడేంచేశాడు?**

బిత్తరపోయి అడిగారు "ఒరే ఒరే ఎందుకురా ఏడుస్తున్నావు" అని.

"సార్, మా అన్న చనిపోయాడు సార్, వాడు చాలా మంచివాడు సార్" అంటూ దుఃఖంస్థాయి పెంచాడు. సార్ వెంటనే అతన్ని దగ్గరకు తీసుకుని "నాకు తెలీక అడిగానురా, ఏడవొద్దు. అయినా మనమంతా శాశ్వతంగా ఉంటామా, ఎప్పుడో ఒకప్పుడు చనిపోవలసిన వాళ్ళమే" అంటూ అతన్ని హృదయానికి హత్తుకుని ఓదారుస్తూ, అతను దుఃఖంనుండి బయటపడేందుకు "ఎలా చనిపోయాడురా" అని అడిగాడు.

"ఓ రోజు రాత్రి కైలకు (పొలానికి) నీళ్ళు పెడుతూ ఉంటే పాము కాటేసింది సార్. మేం ఆసుపత్రికి తీసికెళ్ళే లోగా చనిపోయాడు సార్" వాడిలో దుఃఖం కాస్త తెరిపి ఇచ్చింది. కానీ మాస్టారు వాడిని సముదాయించినతీరు నేను ఇప్పటికీ మరువలేను.

ఆలోచనల్లో ఉండగానే బ్యాంకు దగ్గరకు వచ్చేశాం. మాస్టారికి టీ అలవాటు ఉంది. ఆ రోజుల్లో కూడా మేం ఆయన కనబడితే టీకి పిలిచేవాళ్ళం. ఆయన కాదనకుండా వస్తూ అధిక పర్యాయాలు ఆయనే డబ్బులిచ్చేవారు.

"రండి మాస్టారు టీ తాగుదాం" అంటూ అక్కడే రోడ్డుపక్కన ఉన్న టీ కొట్టువైపు దారి తీశాను. అలా రోడ్డుమీద నిలబడే ఎన్నోమార్లు టీ తాగి ఉన్నాం.

"మాస్టారు చక్కెర వేయమంటారా వద్దా" అడిగాను. ఈ రోజుల్లో ప్రతి మూడో వ్యక్తి చక్కెర వ్యాధితో బాధ పడుతున్నారు కనుక.

"డబుల్ స్వీట్, డబుల్ స్ట్రాంగ్" అని నవ్వుతూ, "నాకింకా చక్కెర వ్యాధి రాలేదు లేవయ్యా" అన్నారు. ఇంతవరకు రాలేదంటే ఇంకేం వస్తుంది అనుకున్నాను మనసులోనే. ఇద్దరం టీ తాగేశాం. ఆయన వద్దన్నా డబ్బులు నేనే ఇచ్చాను.

"పదండి, బ్యాంకులో నాకు తెలిసిన స్నేహితుడు ఉన్నాడు. మీకు పరిచయం చేస్తాను. ఏదన్నా అవసరం వస్తే సహాయం చేస్తాడు" అన్నాను.

"అబ్బే నా స్టూడెంట్ ఒకరు ఆఫీసరుగా ఉన్నాడు లేవయ్యా, అతనే అంతా చేసి పెడతాడు, నువ్వెళ్ళు" అంటూ నన్ను తొందరచేశారు. నాకు ఇంకాస్త సమయం ఆయనతో గడపాలని ఉంది.

"సరే పదండి, బ్యాంకు లోపలికి వస్తాను, నా స్నేహితుణ్ణి కూడా కలుస్తాను" అన్నాను.

"వద్దు లేవయ్యా, ఇప్పటికే నీకు ఆలస్యం అయింది, మరోసారి కలుస్తా కానీ వెళ్ళు" అంటూ నన్ను తోస్తూ బలవంతం చేశారు. కానీ ఆయన మాత్రం బ్యాంకు లోనికి పొయ్యేందుకు ఎటువంటి ప్రయత్నం చేయడం లేదు. సరే, ఆయన అంతగా చెబితే నేను వెళ్ళకపోతే బాగుండదు. నేను స్కూటర్ స్టార్ట్ చేశాను, కానీ నాలో ఒక ఆసక్తి "ఆయన బ్యాంకులోకి వెళ్ళకుండా ఇంకా ఎందుకు రోడ్డుపై ఆ బంకు ఎదురుగా ఆగి ఉన్నారు" నేను కాస్త దూరం వెళ్ళి స్కూటర్ ఆపి వెనుతిరిగి చూశాను. నేను వెళ్ళిపోయానని నిశ్చయించుకున్న మాస్టారు చిన్నగా బంకువైపు కదిలారు. అతని వద్ద ఏదో తీసుకున్నారు. కాస్సేపు తరువాత ఆయన ఇటే తిరిగారు. ఆయన పెదాలపై సిగరెట్. నింపాదిగా, తృప్తిగా సిగరెట్ ఊది పారేసి ఆయన బ్యాంకులోనికి ప్రవేశించారు.

ఆ దృశ్యం చూస్తూనే నా హృదయం ఆర్ద్రతతో నిండి పోయింది. తన స్టూడెంట్ ఎదురుగా, ఇంత వయస్సు మీరినా, రిటైరై ఇన్ని సంవత్సరాలయినా ధూమపానం చేయకూడదనే ఆయన ఇంగిత జ్ఞానం, క్రమశిక్షణ, నీతి సంఘంలో ఒక ఉపాధ్యాయుని స్థానానికి విఘ్నం కలిగించకూడదనే నిజాయితీ నా కళ్ళల్లో నీళ్ళు రప్పించింది.

ఎక్కడ ఆ రోజుల్లో గురువులు, ఎక్కడ ఈ రోజుల్లో గురువులు!

సెల్: 94406 50943



# సౌభాగ్య చక్రం

ఏప్రిల్ 26 నుంచి మే 2 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



**మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)**

పెట్టుబడులు, విద్యా విషయాలు, కుటుంబ వ్యవహారాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో డిపాజిట్లపై మంచి ప్రతిఫలం అందుకుంటారు. ఆర్థిక వ్యవహారాల్లో ఆచితూచి వ్యవహరించాలి. కీలకపత్రాలు కనిపించక ఇబ్బంది పడతారు. 28, 29 తేదీల్లో చర్చలు, ప్రయాణాల్లో నిదానం పాటించాలి. విద్యార్థులు లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. కాంట్రాక్టులు, అగ్రిమెంట్లకు తగిన సమయం కాదు. 30, 1, 2 తేదీల్లో కాంట్రాక్టులు, అగ్రిమెంట్లు లాభిస్తాయి. ఇంటికి అవసరమైన వస్తువుల రవాణాకు అనుకూలం. గృహరుణాలు మంజూరవుతాయి.



**వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)**

ఆర్థికపరమైన నిర్ణయాలు, బ్యాంకు లావాదేవీలు, చర్చలకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధ, గురువారాల్లో అదనపు ఆదాయం కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. ఆర్థిక విషయాల్లో తొందరపాటు నిర్ణయాల వల్ల నష్టపోయే అవకాశం ఉంది. 28, 29 తేదీల్లో పెట్టుబడులు, పొదుపు పథకాల్లో నిదానం అవసరం. ఖర్చులు అంచనాలు మించుతాయి. విలువైన వస్తువుల గురించి ఆరాతీస్తారు. 30, 1, 2 తేదీల్లో ఆర్థిక విషయాల్లో సన్నిహితుల సహకారం లభిస్తుంది. విలువైన పత్రాలు అందుకుంటారు. ఫీజులు, బిల్లుల చెల్లింపులకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి. ఆర్థికపరమైన చర్చలు ఫలిస్తాయి.



**మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)**

ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలు, ముఖ్య నిర్ణయాలు, పెట్టుబడులపై ఈ వారం శ్రద్ధ పెడతారు. బుధ, గురువారాల్లో సినీ, రాజకీయ రంగాల వారికి ప్రోత్సాహకరం. మనసు అశాంతిగా ఉంటుంది. ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు సంబంధించిన అంశాలు కలవరపెడతాయి. 28, 29 తేదీల్లో కొత్త వ్యూహాలు రచిస్తారు. కీలక నిర్ణయాలు వాయిదా వేయండి. మీ ఆలోచనలు సమీక్షించుకుంటారు. 30, 1, 2 తేదీల్లో పెట్టుబడులు, పొదుపు పథకాలు లాభిస్తాయి. కొత్త ఆదాయ మార్గాల అన్వేషణ ఫలిస్తుంది. విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు.



**కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)**

వేడుకలు, ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలు, పెట్టుబడులకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధ, గురువారాల్లో బృంద కార్యక్రమాలు ఉల్లాసం కలిగిస్తాయి. బ్యాంకులు, ఆర్థిక సంస్థలతో పనులకు ఆటంకాలు ఎదురవుతాయి. పెట్టుబడుల్లో నిదానం అవసరం. 28, 29 తేదీల్లో విద్య, దూరప్రయాణాలకు ఆటంకాలు ఎదురయ్యే అవకాశం ఉంది. సినీ, రాజకీయ రంగాల వారు ఆచితూచి వ్యవహరించాలి. బంధుమిత్రులతో వేడుకల్లో పాల్గొంటారు. 30, 1, 2 తేదీల్లో బోధన, న్యాయ, పరిశోధన, శాస్త్ర, సాంకేతిక రంగాల వారికి శుభప్రదం. ఒక సందేశం ఆనందం కలిగిస్తుంది. బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు.



**సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)**

ప్రముఖులతో సమావేశాలు, పెట్టుబడులు, ఆర్థిక సంస్థలతో లావాదేవీలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో ఆర్థిక విషయాల్లో పెద్దల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. వృత్తిపరమైన సమావేశాల్లో జాగ్రత్త అవసరం. 28, 29 తేదీల్లో పెట్టుబడుల్లో ఆచితూచి వ్యవహరించాలి. సమావేశాల్లో తొందరపాటు వల్ల నష్టపోయే అవకాశం ఉంది. బృందకార్యక్రమాల్లో పాల్గొంటారు. 30, 1, 2 తేదీల్లో బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. సినీ రాజకీయాలు, ఉన్నత విద్యా రంగాల వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. సన్నిహితులకు సంబంధించి కీలక నిర్ణయం తీసుకుంటారు.



**కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)**

వృత్తి, వ్యాపారాలు, సమావేశాలు, ప్రముఖుల కలయిక, బృంద కార్యక్రమాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో వృత్తిపరమైన అంచనాలు ఫలించకపోవచ్చు. పెద్దలతో చర్చల్లో నిదానం అవసరం. రాజకీయ, సినీ రంగాల వారు లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. 28, 29 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో ఆచితూచి వ్యవహరించాలి. పైఅధికారుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. ఉన్నత పదవుల కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. 30, 1, 2 తేదీల్లో సమావేశాల్లో ప్రముఖులను కలుసుకుంటారు. వృత్తి, వ్యాపారాల్లో ఆర్థికంగా ప్రోత్సాహకరం.



**తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)**

పెట్టుబడులు, వేడుకలు, వృత్తిపరమైన సమావేశాలు, ప్రయాణాలకు ఈ వారం అనుకూలం. బుధ, గురువారాల్లో రుణ ప్రయత్నాలు ఫలిస్తాయి. ఆర్థిక విషయాల్లో అంచనాలు తప్పే అవకాశం ఉంది. ఖర్చులు అధికం. 28, 29 తేదీల్లో సమావేశాలు, చర్చల్లో అసౌకర్యం కలిగే అవకాశం ఉంది. సంకల్ప సాధనలో శ్రమాధిక్యం తప్పకపోవచ్చు. వేడుకల్లో పాల్గొంటారు. 30, 1, 2 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో వ్యూహాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. సమావేశాల్లో ప్రముఖులను కలుసుకుంటారు. సంస్మరణల్లో పాల్గొంటారు.



**వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)**

స్పెక్యులేషన్లు, క్రయవిక్రయాలు, వేడుకలు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. స్పెక్యులేషన్లలో అంచనాలు తప్పే అవకాశం ఉంది. పెట్టుబడుల్లో ఆచితూచి వ్యవహరించాలి. 28, 29 తేదీల్లో రుణప్రయత్నాలు ఫలించకపోవచ్చు. సంస్మరణల్లో పాల్గొంటారు. క్రయవిక్రయాలకు అనుకూలం. 30, 1, 2 తేదీల్లో సమావేశాలు, వేడుకలకు ఏర్పాట్లు చేస్తారు. బృందకార్యక్రమాల్లో గతస్మృతులు నెమరు వేసుకుంటారు. పెట్టుబడులకు సంబంధించిన సమాచారం సేకరిస్తారు.



**ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)**

వేడుకలు, భాగస్వామ్యాలు, పెట్టుబడులు, స్పెక్యులేషన్లపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో విందు వినోదాల్లో పాల్గొంటారు. సన్నిహితుల ఆరోగ్యం కలవరపెడుతుంది. కృషి రంగంలో శ్రమాధిక్యం తప్పకపోవచ్చు. 28, 29 తేదీల్లో శ్రీవారు, శ్రీమతి వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. పందాలు, పోటీలకు దూరంగా ఉండాలి. వేడుకలు, సమావేశాలు ఉల్లాసం కలిగిస్తాయి. 30, 1, 2 తేదీల్లో పెట్టుబడులు లాభిస్తాయి. విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. ఆర్థిక విషయాల్లో సన్నిహితుల సహకారం లభిస్తుంది.



**మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)**

విద్యా విషయాలు, వృత్తి, వ్యాపారాలు, వేడుకలకు ఈ వారం ప్రాధాన్యమిస్తారు. బుధ, గురువారాల్లో సృజనాత్మకంగా వ్యవహరించి కృషి రంగంలో లక్ష్యాలు సాధిస్తారు. చిన్నారులు, ప్రియతముల ఆరోగ్యం కలవరం కలిగిస్తుంది. విందుల్లో పాల్గొంటారు. 28, 29 తేదీల్లో ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపించాలి. వృత్తి, వ్యాపారాల్లో లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. విందులు, వేడుకల్లో పాల్గొంటారు. 30, 1, 2 తేదీల్లో భాగస్వామి సహకారంతో వృత్తి వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు. జనసంబంధాలు విస్తరిస్తాయి. ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు.



**కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)**

విద్యా విషయాలు, వృత్తి, వ్యాపారాలు, వివాహాది శుభకార్యాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారికి శుభప్రదం. కుటుంబ సభ్యుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. మార్పులు, చేర్పులు అసౌకర్యం కలిగిస్తాయి. 28, 29 తేదీల్లో చిన్నారులు, ప్రియతముల విషయాలు ఆందోళన కలిగిస్తాయి. పొదుపు పథకాల్లో ఆచితూచి వ్యవహరించాలి. ప్రేమానుబంధాలు బలపడతాయి. 30, 1, 2 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో సృజనాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. కొత్త పరిచయాలు ఉల్లాసం కలిగిస్తాయి.



**మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)**

విద్యా విషయాలు, స్థలమార్పులు, కుటుంబ వ్యవహారాలకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధ, గురువారాల్లో కాంట్రాక్టులు, అగ్రిమెంట్లకు అనుకూలం. స్టేషనరీ, ఏజెన్సీ, విద్యారంగాల వారు జాగ్రత్తగా వ్యవహరించాలి. విద్యార్థులు లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. 28, 29 తేదీల్లో రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారు ఆచితూచి వ్యవహరించాలి. ఇల్లు, స్థలం మార్పిడి, బదిలీలకు అనుకూల సమయం. 30, 1, 2 తేదీల్లో చిన్నారులు, ప్రియతముల రాకతో ఇల్లు సందడిగా ఉంటుంది. వేడుకలకు ఏర్పాట్లు చేస్తారు. ఆర్థిక విషయాల్లో ఒక నిర్ణయానికి వస్తారు.






## కొడుకుని సినిమాల్లోకి తీసుకురారట!

సాధారణంగా హీరోగారి కొడుకు హీరోగా, నిర్మాత కొడుకు నిర్మాతగానో లేక హీరోగానో మారుతుండడం ఆశ్చర్యమేమీ కాదు. కానీ సుహాసిని, మణిరత్నంల కొడుకు మాత్రం ఇందుకు భిన్నంగా వ్యవహరిస్తున్నాడు. ఇతగాడికి సినిమాల కన్నా చదువు మీదే ఎక్కువ ఆసక్తి. అందుకే తల్లీ తండ్రీ ఉన్న రంగంవైపు కన్నెత్తి కూడా చూడకుండా బుద్ధిగా చదువుకుంటున్నాడట! త్వరలోనే డాక్టరేట్ తీసుకునే అవకాశం ఉంది అంటున్నారు సినీ జనాలు. మొత్తానికి సుహాసిని, మణిరత్నం కూడా కొడుకును బాగా చదువుకున్న వ్యక్తిగా చూడాలని కోరుకుంటున్నారట!

## వ్యవసాయంలోనే కిక్ ఉందట!



ఈ మాట అన్నది రవితేజ కాదు. క్యారెక్టర్ ఆర్టిస్టు కమ్ దర్శకుడు ప్రకాష్‌రాజ్! ప్రకాష్‌రాజ్‌కు ఫామ్ హౌస్ ఉన్నదన్న సంగతి తెలిసిందే! అక్కడ పశువులు ఉంటాయి. వాటి వ్యర్థాలనే ఎరువుగా వాడుతూ అక్కడ వ్యవసాయం చేస్తున్నాడట ప్రకాష్‌రాజ్. ఎప్పటికైనా ఉత్తమ రైతు అన్న బిరుదు సొంతం చేసుకోవాలన్నదే తన డ్రీమ్ అంటున్నాడు. వ్యవసాయంలో లభించే కిక్ మరెక్కడా ఉండదట! అందుకే సినిమాలను క్రమేణా తగ్గించుకుని వ్యవసాయం మీద దృష్టిపెట్టే పనిలో కూడా ఉన్నాడట!



## షాహిద్ పిలుపు ముచ్చట!

హీరోలు కొద్దిగా పాపులర్ కాగానే అభిమానులు వారికి కొత్త కొత్త బిరుదులు అంటగట్టేస్తుంటారు. పాపం మీడియా కూడా అవే బిరుదులతో సదరు హీరోగారిని వ్యవహరిస్తూ ఉంటుంది. హీరోయిన్లకు ఈ గోలేమీ ఉండదు. అంతా హీరోలకే పరిమితం! బాలీవుడ్ హీరో షాహిద్‌కి కూడా తన పేరు ముందు ఓ బిరుదు ఉంటే బాగుండును అనిపించింది. ఇప్పటి వరకూ తన అభిమానులు తనకెలాంటి బిరుదు కట్టపెట్టకపోవడంతో తనంతట తానే తన పేరు ముందు సూపర్‌స్టార్ అని తగిలించేసుకున్నాడు. ఈ పేరుతో పాపులారిటీ రావాలంటే మీడియాలో కూడా ఇదే బిరుదుతో వార్తలు రావాలి. దాంతో ఇటీవల మీడియాను పిలిచి ఇక నుంచి తనను సూపర్‌స్టార్‌గా వ్యవహరించాలని హుకుం జారీ చేశాడట! తన గురించి వార్తలు రాసేముందు సూపర్ స్టార్ షాహిద్ కపూర్ అని వ్యవహరించాలని ఆర్డర్ పాస్ చేశాడట! ఏదైనా అభిమానంగా పిలిపించుకోవాలి కానీ, ఇలా ఆర్డర్లు వేసి మరీ పిలిపించుకోవడం ఏమిటని బాలీవుడ్ జనాలు గొణుక్కుంటున్నారు.

## సంపూర్ణేష్‌పై పూరీ కన్ను!

**పూరీ** చేతిలో బాలకృష్ణ సినిమా తప్ప మరొకటి లేదు. స్టార్ హీరోల నుంచి చిన్న హీరోల వరకూ ఎవరూ పూరీతో సినిమా చేసే పరిస్థితి లేదంటున్నారు సినీ జనాలు. ఇలాంటి పరిస్థితుల్లో పూరీ కన్ను సంపూర్ణేష్‌బాబు మీద పడింది! ఎలాగంటారా? సంపూర్ణేష్‌బాబు తన తాజా సినిమా 'కొబ్బరి మట్ట'లో ఓ పాటను పూరీ చేతుల మీదుగా విడుదల చేయించాడు. అప్పుడే సంపూర్ణేష్‌బాబు సత్తా పూరీకి తెలిసిందట! అతగాడితో ఎలాగైనా ఒక సినిమా చేస్తానని అప్పటికప్పుడే ప్రకటించేశాడట కూడా! ఇదే కనుక జరిగితే ఇద్దరి కాంబినేషన్ అదుర్స్ అంటున్నారు ఆ హీరోగారి అభిమానులు.



## చూపిస్తే తప్పేంటి?



**బుల్లి**తెర, వెండితెర అన్న తేడా లేకుండా ఎక్కడైనా హాట్ హాట్‌గానే కనిపించడం యాంకర్ రష్మీ స్పెషాలిటీ! రెండు రంగాలలో ఆమె డ్రస్సింగ్ మీద ఎన్నో కామెంట్లు సోషల్ మీడియాలో ఎప్పుడూ హల్‌చల్ చేస్తూనే ఉంటాయి. వీటి మీద తాజాగా తనదైన స్టయిల్‌లో మండిపడింది రష్మీ. వెండితెర మీద హీరోయిన్లు ఎంత చిట్టిపొట్టి డ్రస్సులు వేసుకున్నా ఏమీ అనరు... అదే బుల్లితెర మీద యాంకర్లు వేసుకుంటే ఎందుకంత రాద్ధాంతం చేస్తారు? అంటూ ప్రశ్నించింది. బుల్లి తెర మీద అయినా, వెండితెర మీద అయినా తన అందాలు చూసే ప్రేక్షకులుంటే చూపించడానికి తనకెలాంటి అభ్యంతరం లేదని కుండబద్దలు కొట్టినట్టు చెప్పుకొచ్చింది.

తొలి సినిమాతోనే తెలుగువారితో అబ్బా అనిపించింది హెబ్బాపటేల్. ఉత్తరాది అమ్మాయే అయినా దక్షిణాదిన పాగా వేసింది. చిన్న సినిమాలకు మంచి ఆప్షన్‌గా మారిపోయింది. చిన్న సినిమాలతోనే సక్సెస్‌ఫుల్ హీరోయిన్ అనే ట్యాగ్ తగిలించుకుంది. తెర మీదే కాకుండా బయట కూడా బోల్డ్‌గా మాట్లాడడం, వ్యవహరించడం ఆమెకు అలవాటు. ఆ అలవాటుతోనే తన గురించిన ఓ నిజాన్ని నిర్భయంగా బయటపెట్టేసింది. ఆ నిజం ఏమిటో ఆమె మాటల్లోనే....

# అవును డేటింగ్ చేశా!

-హెబ్బా పటేల్

### మీ గురించి...

ముంబయిలో మాస్ మీడియాలో డిగ్రీ చేశాను. నాన్న నఫీజ్, అమ్మ సోఫియా. ప్రస్తుతానికి నా వ్యవహారాలన్నీ మా మదర్, మేనేజర్ చూసుకుంటూ ఉంటారు. నా సినిమాల విషయంలో నాన్న ప్రమేయం అంతగా ఉండదు. నా సినిమాలు చూసి నా నటన బాగుంటే బాగుంది అని మెచ్చుకుంటారు, అంతే!

### సినిమాల్లో అవకాశం ఎలా వచ్చింది?

కాలేజీ రోజుల్లోనే మోడలింగ్ చేసేదాన్ని. అప్పుడే కన్నడ, తమిళ సినిమాల్లో చేసే అవకాశం వచ్చింది. ఆ రెండు భాషల్లో నా సినిమాలు చూసి తెలుగులో 'అలా ఎలా'లో ఛాన్స్ వచ్చింది. కెరీర్ మలుపు తిప్పింది మాత్రం 'కుమారి 21 ఎఫ్' సినిమానే. ఆ సినిమా తరువాత ఇక వెనుతిరిగి చూసుకోవలసిన అవసరం లేకపోయింది. నా అదృష్టం కొద్దీ తెలుగులో చేసిన సినిమాలన్నీ మంచి విజయం సాధించాయి.

### పెద్ద హీరోలతో చేయలేదన్న బాధ లేదా?

ఏ హీరోతో చేసినా సినిమా సక్సెస్ గురించే మాట్లాడుకుంటారు కానీ, పెద్దా చిన్నా అన్న తేడా ఉండదు. అసలు నాకు గుర్తింపు తెచ్చిందే చిన్న సినిమాలు. ఇప్పుడిప్పుడే పెద్ద హీరోలతో చేసే అవకాశం వస్తోంది.

### మొన్నామధ్య ఓ వ్యక్తితో డేటింగ్ చేశానని చెప్పారు కదా....?

నిజమే! ఆ వ్యక్తితో డేటింగ్ చేశాను. ఆ వ్యక్తి ఎవరు? అన్నది అప్రస్తుతం. ఎందుకంటే ఇప్పుడు తనకీ నాకూ ఎలాంటి సంబంధం లేదు. నిజం చెప్పాలంటే అతని నుంచి చాలా విషయాలు నేర్చుకున్నాను. ఈ రోజు ఇలా ఉన్నాను అంటే అతని చలవే! ఎందుకో తెలియదు మా మధ్య ఉన్నట్టుండి దూరం పెరిగిపోయింది. తను మా కుటుంబానికి

కూడా తెలుసు. తనతో విడిపోయిన తరువాత ప్రేమా, పెళ్ళీ గురించి ఆలోచించే తీరిక లేనంత బిజీ అయిపోయాను. మా ఫ్యామిలీ అంతా ముంబయిలోనే ఉంటుంది. అక్కడ వాళ్ళకి ఓ మంచి ఇల్లు కొనాలి. దానికి డబ్బు సంపాదించాలి. డబ్బు కావాలంటే సినిమాలు చేయాలి. ప్రస్తుతానికి నా ముందు ఉన్న పెద్ద లక్ష్యం ఇదే! అయితే ముంబయిలో ఇల్లు కొనడం అంటే మాటలు కాదు. అందుకే వారికోసం, నాకోసం హైదరాబాద్‌లో ఓ ఇల్లు కొనే ఆలోచన ఉంది.

**రాజ్‌తరుణ్‌తో విభేదాలు సమసిపోయినట్టేనా?**

తనతో నాకు ఎప్పుడూ గొడవలు లేవు. మా మధ్య స్నేహం తప్ప మరొకటి లేదు. మా మధ్య ఏదో ఉంది అన్నది పుకారు మాత్రమే! రెండు మూడు సినిమాలు కలిసి చేసినంత మాత్రాన ఆ వ్యక్తితో సంబంధం ఉన్నట్టేనా?

**అంత మంచి స్నేహం ఉన్నప్పుడు రాజ్‌తరుణ్‌తో కలిసి ర్యాంప్ వాక్ ఎందుకు చేయనన్నారు?**

నేను చేయను అనలేదు. ఆ సమయంలో అత్యవసరంగా ఓ పెద్ద డైరెక్టర్‌తో ఫోన్‌లో మాట్లాడవలసి వచ్చింది. అదీ సినిమా గురించే! ర్యాంప్ వాక్ కన్నా ఇదే ముఖ్యం అనుకున్నా. అదే విషయం రాజ్‌తో చెబితే తను అర్థం చేసుకున్నాడు. ముందు డైరెక్టర్‌గారితో మాట్లాడు అని చెప్పాడు. మా మధ్య జరిగిన సంభాషణ తెలియని వాళ్ళు మా మధ్య ఏదో గొడవ జరిగిందనీ, అందుకే రాజ్‌తరుణ్‌తో కలిసి ర్యాంప్ వాక్ చేయలేదనీ పుట్టించేశారు. ఈ వార్తలు వచ్చిన తరువాత తనతో కలిసి ఓ సినిమా చేశాను. అప్పుడు మా మధ్య సయోధ్య కుదిరింది అన్నారు. ఎవరికి వారు ఇష్టం వచ్చినట్టు అనేసుకుంటే అందులో నా బాధ్యత ఎంత? మాట్లాడే ముందు ఆలోచించి మాట్లాడాలి కదా.

**తెర మీద బోల్డ్‌గా కనిపిస్తారు కదా? నిజజీవితంలో కూడా అంతేనా?**

తెర మీద కనిపించే దానికీ, నిజజీవితానికీ అస్సలు పొంతన ఉండదు. తెర మీద ఇద్దరు ముగ్గురు బాయ్‌ఫ్రెండ్స్‌తో కనిపిస్తాను. నిజజీవితంలో అలా ఉండను. నేను చదివింది ఉమెన్స్ కాలేజ్. అందుకే మగ స్నేహితులు చాలా తక్కువ మంది ఉంటారు. అదీ కాక మా ఇంట్లో రూల్స్ అండ్ రెగ్యులేషన్స్ ఎక్కువే! తెర మీద ఉన్నట్టు నిజజీవితంలో ఉంటానంటే ఒప్పుకోరు.

**అంత స్ట్రిక్ట్‌గా ఉండేవారు మిమ్మల్ని సినిమాల్లోకి ఎలా అనుమతించారు?**

నటన వేరు. జీవితం వేరు. అది ప్రత్యేకించి చెప్పక్కర్లేదు. తెర మీద ఉన్నట్టు నిజజీవితంలో ఉండనక్కర్లేదు కదా! తెర మీద ఎలా ఉన్నా ఇంట్లో సగటు ఆడపిల్లలాగే ఉంటాను.

**హెబ్బా తెర మీదా, బయటా కూడా ఎక్స్‌పోజింగ్ చేస్తుందంటారు కదా? ఎంత వరకూ నిజం?**

తెర మీద అంటే గ్లామర్‌గా కనిపించక తప్పదు. బయట సినిమా ప్రమోషన్లకొచ్చినప్పుడు చుడీదార్లు వేసుకొస్తే హెబ్బాకు ఫ్యాషన్ తెలీదు అంటారు. కాస్త ఫ్యాషన్‌గా వస్తే ఎక్స్‌పోజింగ్ చేస్తున్నాను అంటున్నారు. ఇంటా బయటా ఎలా ఉండాలో ఎవరైనా ఓ లిస్ట్ రాసి ఇస్తే ఇక నుంచి అలాగే ఉంటాను. అలా ఉండడానికి నాకేలాంటి అభ్యంతరం లేదు కూడా!

**వరుస విజయాలు సొంతం చేసుకుంటున్నారు కదా... మీ విజయ రహస్యం?**

అందులో నా క్రెడిట్ ఏమీ లేదు. దర్శకులు ఎలా చెబితే అలా చేసుకుంటూ పోవడమే నా పని. నన్ను బాగా చూపించినా, నా పాత్రకు మంచి పేరొచ్చినా అదంతా దర్శకుల ఘనతే!

**ఎలాంటి పాత్రలంటే ఎక్కువ ఇష్టం?**

ఇప్పటి వరకూ పక్కింటి అమ్మాయి, చిలిపి అమ్మాయి పాత్రలే ఎక్కువ చేశాను. ఆయా పాత్రల్లోనే ప్రేక్షకులు నన్ను ఎక్కువ ఆదరించారు. ఈ పాత్రలే చేయాలి, ఇవి చేయకూడదు అన్న నిబంధనలేమీ పెట్టుకోలేదు.

**హెబ్బా రెమ్యునరేషన్ పెంచేసింది అంటున్నారు?**

అసలు నాకు ఎంత ఇస్తున్నారో? ఎంత పెంచానో? ఎవరైనా చెబితే సంతోషిస్తాను. నా రెమ్యునరేషన్ విషయం మా మదర్, మేనేజర్ చూసుకుంటారు. ఆ డబ్బు వ్యవహారాలు నాకు అర్థం కావు. నేను పట్టించుకోను.

**తెలుగులో చేస్తున్న సినిమాలు?**

'ఏంజిల్' షూటింగ్ పూర్తి అయి విడుదలకు సిద్ధంగా ఉంది. మంచి డేట్ చూసుకుని విడుదల చేయబోతున్నారు. 'అంధగాడు' షూటింగ్ జరుగుతోంది. రెండు మూడు కథలు వినడం జరిగింది కానీ వేటికీ ఓకే చెప్పలేదు.

**కోలీవుడ్‌లో చేయడం లేదా?**

లేదు. ప్రారంభంలో చేశాను. కానీ అక్కడ ఇంత వరకూ ఏ సినిమాకీ ఓకే చెప్పలేదు.

**ముంబయి అమ్మాయి అయి ఉండి బాలీవుడ్‌లో ప్రయత్నించలేదా?**

మొదట నాకు అవకాశం ఇచ్చింది దక్షిణాది పరిశ్రమ. అందుకే నా దృష్టి అంతా ఇక్కడ పెట్టాను. అక్కడ అవకాశం వచ్చినా డేట్లు కుదరక చేయలేదు. ఉత్తరాది కన్నా దక్షిణాది నాకు బాగుంది. దీన్ని వదిలి అక్కడ నేను చేసే సినిమాలు ఉంటాయి అని అనుకోవడం లేదు.

—చిన్ని





పుస్తకావిష్కరణ దృశ్యం

**ఎడమ నుంచి:** సముద్ర, ఉత్తేజ్, తనికెళ్ళభరణి, జగన్నాథశర్మ, బ్రహ్మానందం, కూనపరాజు కుమార్, ప్రసాదమూర్తి, కుప్పిలి పద్మ, శశికిరణ్, విక్రమ్ సవ్యసాచి చిత్రంలో ఉన్నారు.

# ఎమ్మెస్ నారాయణ జీవితకథ

## పుస్తకావిష్కరణ

**కామెడీ కింగ్ ఎమ్మెస్ నారాయణ. కథా రచయితగా సినీరంగ ప్రవేశం చేసి 17 సంవత్సరాల అతి తక్కువ సమయంలో 700కి పైగా చిత్రాల్లో నటించిన అరుదైన నటుడు, సినీ కథా రచయిత, సాహిత్యవేత్త, స్నేహశీలి. హాస్య సంభాషణలతో నవ్వుకున్నోడికి నవ్వుకున్నంత అన్నచందంగా తెలుగునేలపై నవ్వుల పువ్వులు విరబూయించాడు. ఆత్మ విశ్వాసమే ఊపిరిగా బతికిన అజాత శత్రువు. ఆయన అకాల మరణం అందరినీ కలచి వేసింది. ప్రతి ఒక్కడూ ఆయనకు ఆత్మీయుడే..! ప్రపంచ ప్రఖ్యాత హాస్య నటుడు చార్లీ చాప్లిన్ పుట్టిన రోజునాడే తానూ పుట్టానని గర్వంగా చెప్పుకునేవారు ఎమ్మెస్ నారాయణ..**

ఎమ్మెస్ జీవితం ఎంతో విలక్షణం. సాహసాలకు నిలయం. ఆయన జీవిత కథ కొత్త తరానికి స్ఫూర్తిదాయకం. అంతటి లెజెండరీ పర్సన్ 'ఎమ్మెస్ నారాయణ జీవితకథ' నవ్య వీక్లీలో 36 వారాలు సీరియల్‌గా వెలువడి విశేష పాఠకాదరణ పొందింది. ఇప్పుడిది పుస్తకంగా వెలువడింది. ఎమ్మెస్ 66వ జయంతిని పురస్కరించుకుని హైదరాబాద్ ఫిలిమ్‌ఛాంబర్ హాలులో ఏప్రిల్ 16, ఆదివారం సాయంత్రం ఈ పుస్తకావిష్కరణ సభ జరిగింది.

ప్రముఖ నటుడు, కథకుడు, దర్శకనిర్మాత తనికెళ్ళ భరణి అధ్యక్షతన జరిగిన సభకు హాస్య చక్రవర్తి బ్రహ్మానందం ముఖ్యఅతిథిగా హాజరై 'ఎమ్మెస్ నారాయణ జీవితకథ' పుస్తకాన్ని ఆవిష్కరించారు. ఎమ్మెస్‌కు పాఠాలు చెప్పిన ఉపాధ్యాయుడు, ఆయనకు ప్రేమ వివాహం జరిపించిన ప్రముఖ సినీ కథా రచయిత, నటుడు పరుచూరి గోపాలకృష్ణ పాల్గొన్నారు.

### లెజెండరీ పర్సనాలిటీ

ఎమ్మెస్ చాలామందికి హాస్యనటుడుగా తెలుసు, ఎక్కువమందికి సాహితీవేత్తగా తెలుసు. కొద్దిమందికి ఇంటలెక్చువల్ అని తెలుసు. కానీ లోతుగా పరిశీలిస్తే అతడొక 'లెజెండరీ పర్సనాలిటీ ఆఫ్ టాలీవుడ్ ఇండస్ట్రీ అని అర్థమవుతుంది, అంతటి మహానుభావుడు ఎం.ఎస్. నారాయణ' అన్నారు బ్రహ్మానందం. ఎమ్మెస్ గురించి ఆయన ఇంకా ఇలా అన్నారు.

'ఎమ్మెస్ హాస్యంలో విజ్ఞానం తొణికిసలాడుతుంది. ఆయన మాటలు థాట్ ప్రొవోకింగ్. అలవోకగా హాస్యం పండించగల నటుడు. రోజుకో సారైనా ఎమ్మెస్ ప్రస్తావన లేకుండా ఇప్పటివరకు నా జీవితం గడవలేదు. సాహిత్యమైనా, నటనైనా లోతుల్లోకి వెళ్ళి దాన్ని పరిశీలిస్తాడు. కామెడీ గొప్పతనం, దాని అంతరాళం తెలిసిన నటుడు. అంతటిగొప్ప వ్యక్తిని ఇండస్ట్రీ కోల్పోవడం ఎంతో బాధగా ఉంది. ఎమ్మెస్ నా తమ్ముడు, నేను పోగొట్టుకున్న మనిషి. నా మనసులో సజీవంగా నిలిచిపోయాడు. కూనపరాజు కుమార్ ఎంతో ప్రేమతో, ఎంతో ఇష్టపూర్వకంగా ఈ రచన చేశారు అని బ్రహ్మానందం ప్రశంసించారు.





**ఎమ్మెస్ నారాయణ**
జీవిత కథ
**కూనపరాజు కుమార్**
**ధర:** 175 రూపాయలు
**పేజీలు:** 208
**ప్రతులకు:** సాహితి ప్రచురణలు
33-22-2, చంద్రం బిల్డింగ్స్
సి.ఆర్.రోడ్, చుట్టుగుంట
విజయవాడ-04.
**ఫోన్:** 0866-2436642/43

## ఇండస్ట్రీలో ఇంత చదువుకున్నవాడు అరుదు

ఎమ్మెస్ తనదైన ముద్రతో అవలీలగా ఏ పాత్రైనా చేయగలడనే కీర్తి సంపాదించుకున్నారన్నారు తనికెళ్ళ భరణి. ఎమ్మెస్‌కు కాళిదాసంటే ప్రాణం. సాహిత్యం అంటే ఇష్టం. కాళిదాసు పేరెత్తితే పులకించిపోయి పూనకం వచ్చినట్టు మాట్లాడేవాడు, రాగయుక్తంగా శ్లోకాలు చదివేవాడు, ఏ విషయాన్నైనా ఆసక్తికరంగా చెప్పే ప్రజ్ఞ ఎమ్మెస్‌కి ఉండేది, ఇండస్ట్రీలో ఇంత చదువుకున్నవాడు అరుదు అన్నారు భరణి.

## వ్యక్తి వికాసానికి దోహదం

జీవిత చరిత్రలు కూడా సాహిత్యమే అన్నారు నవ్య వీక్లీ సంపాదకులు, ప్రముఖ రచయిత, కళారత్న అవార్డు గ్రహీత ఎ.ఎన్.జగన్నాథశర్మ. వ్యక్తి వికాసం అనేకమంది జీవిత చరిత్రలకు ముడిపడి ఉంటుందనీ, ఎంతో ఉత్తేజకరమైన ఎమ్మెస్ జీవిత కథను పాఠకులకు అనుగుణంగా చక్కగా రచించారనీ కూనపరాజు కుమార్‌ను ప్రశంసించారాయన. నవ్య వీక్లీలో 36 వారాలపాటు సీరియల్‌గా ప్రచురితమైన ఎమ్మెస్ నారాయణ జీవిత కథకు పాఠకుల నుండి గొప్ప స్పందన లభించిందనీ, సంస్థకు, తమ వీక్లీకి ఎమ్మెస్ జీవితకథ ఎనలేని కీర్తిప్రతిష్టలు తెచ్చిపెట్టిందన్నారు.



## ఎమ్మెస్ ఇచ్చిన ఆస్తి నవ్వే

ఎమ్మెస్‌తో సన్నిహితంగా మెలిగిన నటుడు ఉత్తేజ్. ఆయన్ను ఎమ్మెస్ ఎంతో ప్రేమగా డార్లింగ్ అని పిలిచేవారు. 'షాడో' షూటింగ్ సమయంలో ఎమ్మెస్ పుట్టిన రోజు సందర్భంగా ఆయనపై ఉత్తేజ్ ఒక కవిత రాశారు. ఈ సభలో ఆ కవిత చదివిన ఉత్తేజ్ ఎంతో ఉద్వేగానికి గురై కన్నీటిపర్యంతమయ్యారు. ఎమ్మెస్ గుణగణాలను కళ్ళకు కడుతూ అంత్య ప్రాసలతో రిథమిక్‌గా నడిచిన ఈ వచన కవిత ప్రేక్షకులను మంత్రముగ్ధుల్ని చేసింది. తెలుగు ప్రేక్షకులకు నవ్వును ఆస్తిగా ఇచ్చిన ఎమ్మెస్ సంపూర్ణమైన జీవితం అనుభవించారన్నారు ఉత్తేజ్. ఆ కవిత విని పులకించిపోయిన బ్రహ్మానందం ఉత్తేజ్‌ను శాలువాతో సత్కరించి అక్కున జేర్చుకున్నారు.

## యువతకు సందేశం

ఎమ్మెస్ నారాయణ జీవిత కథలో యువతరానికి ఒక సందేశం ఉందని ప్రముఖ రచయిత్రి కుప్పిలి పద్మ అన్నారు. ఎమ్మెస్ కుటుంబ జీవితం, సాహిత్యం, సినిమాలు, కథా రచన వంటి అనేక అంశాలున్న ఈ పుస్తకం, పనిపట్ల ఎమ్మెస్‌కు ఉన్న క్రమశిక్షణ, నిబద్ధతలను చాటి చెబుతుందన్నారు. నవ్య వీక్లీలో ఈ సీరియల్ వస్తున్నప్పుడు ఒక పాఠకురాలిగా ప్రతివారం వదలకుండా చదివానన్నారు. ఎమ్మెస్ లాంటి ప్రేక్షకాదరణ పొందిన వ్యక్తి జీవితచరిత్ర రాయడం ఎంతో కష్టతరమని, కానీ ఈ కథా రచనలోని ప్రతి అక్షరంలో ఎమ్మెస్‌పట్ల కూనపరాజు కుమార్‌కున్న ప్రేమ కనిపిస్తుందన్నారు.



## కాళిదాసు, దోసావకాయ

ఎమ్మెస్‌తో ప్రతి ఒక్కరికీ తమదైన అనుబంధం, అనుభూతులూ ఉంటాయి. అలాంటి అనుభవాలే నాకూ ఉన్నాయి. ఎమ్మెస్‌కి కాళిదాసు, కారం అంటే ఎంతో ఇష్టం. ఆయనతో షూటింగ్ ఉన్నప్పుడు పచ్చడి తీసుకెళితే ఎంతో సంతోషించేవాడు. లంచ్ టైమ్‌లో ఒకసారి గిన్నెడు దోసావకాయ ఇచ్చాను. నేను పప్పు కలిపితే ఎమ్మెస్ ఎర్రగా దోసావకాయ కలిపాడు, నేను కూర కలిపితే ఆయన దోసావకాయ కలిపాడు, నేను పులుసు, మజ్జిగ...కలిపినా కూడా ఎమ్మెస్ దోసావకాయతోనే తిన్నాడు. తీరా ఆఖర్న చూస్తే గిన్నె మొత్తం ఖాళీ! ఆశ్చర్యపోయాను. పది రోజుల పాటు తింటాడుకదా అని ఇచ్చాను. మొత్తం ఖాళీ చేశాడు. అదుగో అంత ఇష్టం పచ్చడంటే ఎమ్మెస్‌కి. అయితే ఆయనలో కారం మమకారం రెండూ ఎక్కువే. ఆ దోసావకాయ ప్రభావంతో మర్నాడు ఆయన షూటింగ్‌కి రాలేదనుకోండి అది వేరే విషయం...' (సభలో నవ్వులు)



—తనికెళ్ళ భరణి

## తేనెమనసుల ప్రాంతంవాడు

కోనసీమ, గోదావరి జిల్లాల తేనెమనసుల ప్రాంతం నుండి వచ్చిన ఎమ్మెస్ నారాయణ అంటే తనకెంతో ఇష్టమని, అందుకే తానీ సభకు వచ్చాననీ ప్రజాకవి, వాగ్గేయకారుడు గోరటి వెంకన్న అన్నారు. కంచిపట్టు చీరకు సొబగులద్దే జరీఅంచు లాంటి తనదైన గొంతులోని జీరతో 'లచ్చువమ్మో..' అనే పాటపాడి గోరటి వెంకన్న ప్రేక్షకులను ఉర్రూతలూగించారు.



## ప్రతిభకు అద్దిన గంధం

ఎమ్మెస్ నారాయణతో తన జ్ఞాపకాలను నెమరువేసుకున్నారు ఆయన ఆప్తమిత్రుడు ప్రసాదమూర్తి. చార్లీచాప్లిన్ పుట్టినరోజునాడే నేనూ పుట్టానని ఎమ్మెస్ గర్వంగా చెప్పేవారన్నారు. తన కవిత్వాన్ని ఎమ్మెస్ ఎంతగానో ఇష్టపడేవారని, అలంకార శాస్త్ర లాక్షణిక గ్రంథాలలోని అంశాలను వెలికితీసి రాసిన కవికి కూడా తెలియని విషయాలను వివరణతో చెప్పడం ఎమ్మెస్ ప్రతిభకు దర్పణమని గుర్తుచేసుకున్నారు. మన బతుకుల్లో నవ్వుల టానిక్ పోసిన ఎమ్మెస్ మనోభావాలను శ్రమద మాదులకోర్చి కూనపరాజు కుమార్ పుస్తకంగా వెలువరించారన్నారు.



బ్రహ్మానందాన్ని సత్కరిస్తున్న రచయిత కూనపరాజు కుమార్

## కీర్తి సంపాదించారు నాన్న

నాన్న మమ్మల్ని విడిచివెళ్ళి రెండేళ్ళు గడిచిపోయినా ఆ వేదన, విషాదం మా మనసులలో ఇంకా పచ్చిగానే ఉండిపోయిందన్నారు ఎమ్మెస్ నారాయణ కుమార్తె శశికిరణ్. ఇంతమంది స్నేహితుల సమక్షంలో ఈ పుస్తకావిష్కరణ జరగడం, ఇంతమంది ప్రేమాభిమానాలు



నాన్న సంపాదించుకోవడం తనకు ఎంతో సంతోషంగా ఉందన్నారు. ప్రపంచమంతా చెప్పుకునేంత గొప్ప కీర్తి ప్రతిష్టలు నాన్న సంపాదించుకున్నారని ఆమె అన్నారు.

### మా నాన్న అజాత శత్రువు



పదిమంది ఉన్న కుటుంబంలో పుట్టి, ఎంతో కష్టపడి చదువుకుని ఎదిగిన తన తండ్రి, జీవితకాలంలో తనకు పరిచయమైన ప్రతి వ్యక్తికీ గుండెల్లో ప్రత్యేకస్థానమిచ్చి గౌరవించిన అజాత శత్రువని ఎమ్మెస్ కుమారుడు విక్రమ్ సవ్యసాచి అన్నారు. ఎంతడబ్బున్నా నాన్నలేని జీవితాన్ని ఇష్టపడక ఏడాది కాలానికే అమ్మ కూడా తనువు చాలించిందనీ, వాళ్ళిద్దరూ అంతగొప్ప ప్రేమికులనీ చెప్పారు. పరుచూరి గోపాలకృష్ణగారే వారిద్దరికీ ప్రేమ వివాహం జరిపించారన్నారు. తన తండ్రి సినిమాను కళగానే భావించారు తప్ప వ్యాపారంగా భావించలేదన్నారు.

## ఎమ్మెస్‌తో స్నేహం కత్తిమీద సాము

ఎమ్మెస్ పైకి ఐదడుగుల మనిషేగానీ, లోపల ఆకాశమంత విజ్ఞానం ఉంది. ఆయనతో స్నేహం కత్తిమీద సాము. ఏ క్షణంలో ఎటునుంచి ఎటెళతాడో తెలియదు. స్నేహం విలువ తెలిసిన వాడు. స్నేహానికి ప్రతిరూపం.



ఈరోజు ఇంతమంది ఆయనకోసం వచ్చారంటే అది ఆయన స్నేహభావమే.

'కొట్టుకుంటాం, తిట్టుకుంటాం, కలిసి భోజనం చేస్తాం, సంతోషపడతాం, అవన్నీ ఉంటేనే కదన్నయ్యా స్నేహం అంటే...' అంటాడు ఎమ్మెస్.

ఆయనతో మాట్లాడుతుంటే ఎన్నో జోకులు పేలేవి. 'హ్యాపీ మండే అన్నయ్యా' అంటాడు. 'అదేంట్రా' అంటే, 'హ్యాపీ దసరా, హ్యాపీ దీపావళి, బర్త్‌డే... ఇలారోజూ ఏదో ఒకటి ఉంటుంది కదన్నయ్యా, ఏదీ లేనప్పుడు ఏదో ఒకటి చెప్పాలికదా' అంటూ నవ్విస్తాడు. అతని మాట విరుపులో ఒక అందం, హాస్యం, చమక్కు ఉంటాయి. తక్కువ సమయంలో ఎక్కువ చిత్రాల్లో నటించాడు ఎమ్మెస్. నా వరకు ఐ మిస్డ్ ఎమ్మెస్.

—బ్రహ్మానందం

### అవకాశాన్ని అందిపుచ్చుకోవాలి

ఎమ్మెస్ నారాయణ ఆప్తమిత్రుడు, పుస్తక రచయిత కూనపరాజు కుమార్ మాట్లాడుతూ నేటి యువత ఈ పుస్తకం తప్పక చదవాలన్నారు. 'ప్రతి మనిషీ జీవితంలో ఏదో సాధించాలనుకుంటాడు. ఏదో అవ్వాలని కలలు కంటాడు. ఆ కల నెరవేరనప్పుడు, మరో మార్గంలో మనకు అవకాశాలు లభిస్తాయి. ప్రకృతి ఇచ్చిన అలాంటి అవకాశాన్ని మనం సకాలంలో అందిపుచ్చుకుని సద్వినియోగం చేసుకోవాలి. ఆ మార్గంలో ఎదగాలి. ఈ పుస్తకంలో ఉన్న సందేశమిదే! యువతరం ఈ పుస్తకం చదవాలి. మూడు సంవత్సరాలపాటు ఖాళీ ఉన్నప్పుడల్లా ఎమ్మెస్ జీవితానుభవాలను గ్రంథస్థం చేశాను. ఈ జీవిత కథను ధారావాహికంగా ప్రచురించిన నవ్య వీక్లీ సంపాదకులు ఎ.ఎన్.జగన్నాథశర్మగారికి, ఆంధ్రజ్యోతి యాజమాన్యానికి కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను అన్నారు కూనపరాజు కుమార్.

యాంకర్ వేమూరి రోహిణి ఈ సభా కార్యక్రమం నిర్వహించారు.

దర్శకుడు సముద్ర, ఎమ్మెస్ జీవితకథ పుస్తక ముఖచిత్రకారుడు చెన్నుపాటి వాసు, రచయిత అనిల్ బత్తులసహా ఎమ్మెస్ అభిమానులు పెద్దసంఖ్యలో పాల్గొన్నారు.

—రామ్మోహన్

## సుధామ పదగారడి-311

సెల్: 98492 97958

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ❖ | 1 | 2 | | 3 | ❖ | 4 | | |
| 5 | ❖ | | ❖ | 6 | | | ❖ | ❖ |
| 7 | | | 8 | ❖ | ❖ | 9 | 10 | |
| | ❖ | ❖ | 11 | | | ❖ | | ❖ |
| 12 | 13 | | ❖ | ❖ | ❖ | 14 | | 15 |
| ❖ | | ❖ | 16 | | 17 | ❖ | ❖ | |
| 18 | | ❖ | | ❖ | 19 | 20 | | |
| ❖ | ❖ | 21 | | 22 | ❖ | | ❖ | |
| 23 | | | ❖ | 24 | | | | ❖ |

### ఆధారాలు

**అడ్డం**

1. తిరస్కారం కాదు. అవార్డే! (4)
4. మొమెంటో (3)
6. విభజనలో దైవానికి చేసేది (3)
7. ఒకరు ఎక్కువా, ఒకరు తక్కువా కాదు ఆడామగా ఇద్దరూ (4)
9. నిరంతర వర్షం (3)
11. అటుగా అబద్ధం (3)
12. మృతులకు ఘటించేది (3)
14. అద్దె (3)
16. తగినది, భరణి నక్షత్రము (3)
18. సంగతి, వృత్తాంతం (2)
19. గర్వంలేనివాడు (4)
21. జనమేజయుడు కలిగిన ప్రజలే! (3)
23. స్త్రీల ముక్కుకు అందం (3)
24. మొన్న ఉగాదికి నవ్య సంపాదకుడు అందుకున్న ప్రభుత్వ పురస్కారం (4)

**నిలువు**

2. నాలుక (3)
3. ఆరంభములో ఇంద్రసభానర్తకి (2)
4. తెలివి (3)
5. నవారు లేని పనసలేనివారు (4)
8. పెరల్ (2)
10. దేవతలు, ఒకడే మరి! (3)
13. దేవీదేవతలందరూ కలిగి ఎక్కి తిరిగేది! (3)
15. తల్లి దాస్య విముక్తికై అమృతం తెచ్చినవాడు (4)
16. ఆలోచన (3)
17. కామునికి 'కా'లేదు (2)
20. కలరా వ్యాధి (3)
21. ముసలితనం (2)
22. మేనక మధ్యలో పోతే ఓ బలిపశువే (2)

### పదగారడి-310 సమాధానాలు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ■ | 1 అ | 2 క్ష | య | 3 తృ | తీ | 4 య | ■ | 5 క |
| 6 బిం | ■ | ర | ■ | ప్తి | ■ | మ | ■ | ల |
| 7 గా | లి | ము | ద్దు | ■ | 8 సా | గం | ధి | కం |
| రం | ■ | ■ | ■ | 9 వి | ■ | డ | ■ | డ |
| ■ | 10 కై | 11 పు | ■ | 12 లో | పా | ము | ద్ర | ■ |
| 13 కు | ■ | దు | ■ | మం | ■ | ■ | ■ | 14 కో |
| 15 వ | క్క | పొ | డి | ■ | 16 ఆ | 17 భ | ర | ణం |
| ల | ■ | ■ | ■ | 18 జా | ■ | స్మ | ■ | గి |
| యం | ■ | 19 స | గ | లు | ■ | 20 ము | క్కు | ■ |

Printed and Published by **VEMURI RADHAKRISHNA**, Managing Director on behalf of Aamoda Publications Pvt. Ltd., Published at Plot No:76, Ashwini Layout, Huda Heights, Jubilee Hills, Hyderabad - 500 033, Phone No: (040)23558233/44, Fax No: (040) 23558288 and Printed at Aamoda Press, Survey No: 70/1 & 2, Vedurupavuluru Village, Mustabad Grama Panchayathi, Gannavaram Mandal, Vijayawada, Krishna District, PIN: 521 107 on behalf of Aamoda Press, R.S No:191/3, Ward No:43, Donka Road, Patamata, Vijayawada 520 010, RNI No: APTEL/20047/12594, Editor : **A.N.JAGANNADHA SARMA**

